# ఆంధ్రసచిత్రవారపత్రిక

8-9-67

40 పైసలు



వినాయక చవితి
ప్రత్యేక సంచిక

హాస్యప్రియులందరికీ వినాయక చవితి సందర్భంగా మా శుభాకాంక్షలు.

—సం॥

### ముఖచిత్రం

16–8–67 నాటి సంచికలోని ముఖచిత్రం చాలా బాగుంది. [illegible] నిజమైన [illegible] ముఖచిత్రము కూడ గానే ప్రతి ఒక్క భారతీయుని హృదయములో [illegible] ఇక ఏనాడట కూడ [illegible] ప్రతి [illegible] అటువంటి చిత్రం ప్రచురించిన మీకూ, చిత్రకారులైన [illegible] గారికీ నా యొక్క హృదయపూర్వక నమస్కృతులు.

— ఎస్. శ్రీనివాసరావు (వోరుగల్లు కోట.)

### కథలు

16–8–1967 ఆంధ్రపత్రికలో "కాల ప్రయాణం" అనే "సైన్సు ఫిక్షన్" కథలో "కాలంలో ప్రయాణం చేయడం" అనే మాటను






# ఉత్తరాలు

రెండు మూడు చోట్ల ప్రయోగించారు రచయిత ఆ మాటకు అర్థం ఏమిటో బోధపడకుండా వుంది. వివరింప గోరుతాను.

హెచ్. జి. వెల్స్ సృష్టించిన "టైమ్ మెషీన్" నిజానికి అర్థరహితమైనది. సాపేక్ష సిద్ధాంతం ఆవిధంగా ఏమీ చెప్పడంలేదు.

విజ్ఞులైన రచయితగారి అభిప్రాయం తెలుసు కోవాలని ఉంది.

— మల్లాది వనిమోహన్ (ఢిల్లి)

* వనిమోహన్ గారు నాకు పరీక్ష పెడుతున్నట్లు తోస్తుంది! పరీక్షల్లో నెగ్గే సామర్థ్యం లేకపోయినప్పటికీ, నాకు తోచినది రాస్తున్నాను—

(అ) క్రిందకు వేసు ఉదహరించు రెండు పుస్తకాలలోని వాక్యాలని (తెలుగు అనువాదాలని) చూస్తే 'ఉదహా' రిస్తున్నాను:

1. "ఒకవస్తువు రెండుసంఘటనల వద్ద ఉండటానికి వీలయితే ఈ సంఘటనల మధ్య 'వ్యవధి' (ఇంటర్వెల్ కి ఈ మాటవాడవచ్చునా?) 'కాలంవంటిది' అంటాము.......'వ్యవధి' 'కాలంవంటిది' అయినప్పుడు ఒక వస్తువు రెండు సంఘటనల వద్ద ఉండగలదు; అటువంటప్పుడు ఆవస్తువు మీదవున్న ఒక పరిశీలకుడు రెండు సంఘటనల మధ్య 'వ్యవధి'ని వాటిమధ్య కాలం అని నిర్ణయిస్తాడు; అంటే, అది రెండు సంఘటనలమధ్య అతనికి (సంబంధించిన) 'సమయాన— కాలం.' బెర్ట్రాండ్ రస్సెల్, ది ఎ. బి. సి. ఆఫ్ రిలేటివిటీ, నాలుగవఅధ్యాయం. పదవ పేరా.

2. "భవిష్యత్తులో ఒక అంతరిక్ష ప్రయాణీకుడు సెకండుకి 167000 మైళ్ళ వేగంతో వెళ్లగల ఒక 'పరమాణు— శక్తి— అంతరిక్షనావ'ఎక్కి, ఆకాశం తిరిగి, పది భూమిసంవత్సరాల తర్వాత భూగోళానికి తిరిగి వచ్చి, తన వయస్సు భవులికంగా అయిదు సంవత్సరాలు మాత్రమే ఎక్కువ అయినట్లు కనుక్కునే బక్ రాజర్స్ కల్పనాప్రపంచపు సంఘటన ఒకటి వూహించవచ్చు" లింకన్ బార్నెట్, ది యూనివర్స్ ఎండ్ డా. ఐన్‌స్టైన్, ఏడవ అధ్యాయం, చివరి వాక్యం.

ఆ) హెచ్. జి. వెల్స్ రాసింది అర్థరహితమే అయ్యి ఉండవచ్చు. కాని, ఇటువంటి కథలు ఎన్నోచదివాను. ఈ మధ్యనే ఫ్రెడ్ హాయిల్ రాసిన "అక్టోబర్ ది ఫస్ట్ ఈజ్ టూ లేట్" అనే నవలలో ఇద్దరు ఈ భూగోళం మీదనే ఎన్నో చోట్ల ఎన్నో కాలాలలో తిరిగినట్లు ఉంది. అక్కడక్కడ చిత్రమయిన చర్చలు కూడా ఉన్నాయి.

ఆర్ గంటి (మదరాసు)

* * *

25–8–67 సంచికలో మీరు ప్రచురించిన "వర్షించని మేఘాలు" కథ చాల బాగుంది.

(ద్రోణంరాజు సుభద్రా రామకృష్ణ, (విశాఖపట్నం).

* * *

"నీకే ఎవరూ దొరకనప్పుడు మగవాడికి ఆడగొప్పు అడదే లోకువ" అంటూ చెప్పుకపోయిన, వెంకటేశ్వరరావుగారి 'అమ్మా! ఆకలి' కథ చాలాబాగుంది. (11–8–67). ఇటువంటి మంచి మంచి కథలు ప్రచురించి సమాజానికి అందజేస్తున్న ఆంధ్ర పత్రిక సంపాదకవర్గానికి, రచయిత(త్రు)లకు నా అభినందనములు. శ్రీమతి కె. రామలక్ష్మిగారి 'జవాబులు ఎంతో సహజంగా వుంటున్నవి. వారికి నా ధన్యవాదాలు.

పి. ఆదినారాయణ ప్రసాద, (హైదరాబాద్.

### వ్యాసాలు

18–8–67 సంచిక 'ఆంధ్రపత్రిక' చదివినాక నాకో సందేహం వచ్చింది. ఈ మధ్య రచయిత్రులు వ్రాసే వ్యాసాల్లో (చాలావరకు) మగవాళ్ళను దుయ్యబట్టడం పరిపాటి అయ్యింది అదేం గొప్పతనమో నా కర్థం కావడం లేదు.

దేనినైన విమర్శించేముందు అందులోని నిజాన్ని తరచి, తరచి చూసుకోవాలి! అలాంటి విమర్శ పలువురు మెచ్చాలి! కాని అభాసుపాలు కాకూడదు. కేవలం పక్షపాతం చూపిస్తు...... పాతదాన్నే కొత్త పద్ధతిలో రాయడం కేవలం స్వార్థమే అవుతుంది.

అలాంటిదే ఈ సంచికలో ప్రచురింపబడిన 'పిల్లల ప్రవర్తన— తల్లి బాధ్యత' అనే వ్యాసం. ఉదాహరణకు 17 వ పేజి, మూడవ కాలం, పదమూడవ లైనులో '........ మనం, విద్యాధికులైన పురుషులు కూడ చాలామంది కోపం వచ్చిందంటే చాలు 'పంచాంగం' విప్పడం చూస్తుంటాం' అని ఉంది. అంటే, మగాళ్లే తప్ప ఆడాళ్లు కోపం వస్తే, 'పంచాంగం' విప్పరా? చదువుకున్నామనే గర్వంతో తోటిమగణ్ణి చులకనగా చూస్తు (ఆః నరకమయిత) 'పంచాంగం' విప్పటం పరిపాటే. అలాంటప్పుడు ఆడ, మగ భేదం లేదు. ఎవరైనా అలాచెయ్యొచ్చు. (అందరూకాదు కొందరు మాత్రమే అని గమనించాలి) మళ్ళీ 18 వ పేజీ, 3 వ కాలం, 2 వ లైనులో........ కాలేజిల్లో కాస్త కంటికి నదురుగా కన్పించే అమ్మాయిలను వెంటపడి, వెక్కిరించి, ఇంకా ఘోరంగా కూడా అవమానించే ధీరులంతా ఎగరంటారు అని రాశారు.

కాని రచయిత్రి అన్నట్టు జరిగితే కొంతవరకు నయమే. మరి అందవిహీనులైన అబ్బాయిని మారుపేర్లతో ఉడికిస్తూ, అమాయకులైన యువకుల్ని బొమ్మల్లా ఆడిస్తూ ఏడిపించే అమ్మాయిలు కూడ అదే కాలేజిల్లో ఉన్నారనే సంగతి రచయిత్రి మరచిపోయింది. ఏమైన ఇటువంటివారు ఇరు పక్షాలలో వున్నారని మరి మరీ గమనించాలి.

— కె. బి. చక్రధరగిరి (లింగాలఘణపురం)

* * *

శ్రీ బులుసు వెంకటరమణయ్యగారి ధర్మపథం అనే శీర్షిక ప్రతివారం చదువు చున్నాము. ముఖ్యంగా ఈ వారం (11–8–67) పదభ్యాసాలలో కాల్యకృత్యాలను, కాలకృత్యాలని అంటున్నామని— దైవప్రార్థన— స్నానానికి ఎక్కువ కాలము తీసుకోవాలని— భోజనమ్ము,

# బ్రిల్‌క్రీమ్

## మీ శిరోజములను ఆరోగ్యవంతంగా, మెరయుచూ నున్నగా మరియు నల్లగా వుంచును

జిడ్డులేదు,
చెదరదు

### బ్రిల్‌క్రీమ్ మాత్రమే

- మీ శిరోజములను మాసెగాను, చెదురుగాను లేక జిడ్డుగాను వుండునట్లు చేయకుండా పరిపూర్ణంగా అణచియుంచును.
- అది చాల ఖర్చుతక్కువ-ఒక్క సారి రాస్తే మీ శిరోజాలను రోజల్లా సహజంగాను చెక్కుచెదరనీయక అణచియుంచును.
- నిజంగా పుష్టిని పోషించి, ఆరోగ్యవంతమైన శిరోజ పెంపును వృద్ధిపరచేటట్టు వంటి అసమాన సూత్రానుసారం తయారైనది.




బ్రిల్‌క్రీమ్‌నే వాడండి-ఆరోగ్యవంతమైన, మెరయుచుండే నున్నటి, నల్లని శిరోజాలనిమిత్తం

B 1-P 1-67 TL

తువునంగా తీసుకోవాలని— అలాంటప్పుడే లక్ష్మి జీవి కూడ తాండవమాడుతుందని— లక్ష్మీదేవి సమాధానము— చదివి ఎంతో సంతోషించాము. ముఖ్యంగా ఇలాంటి విషయాలు, మాలాంటి వాళ్లు తెలుసుకొనుట చాల అవసరమని, కాబట్టి ప్రతివారం ఇంకా ఎక్కువ అంద చేస్తారని ఆశిస్తున్నాము.

— బోను వెంకటేశ్వరరావు (సీతానగరం.)

* * *

విగ్రహారాధనగూర్చి వివేకానందుడు ఇచ్చిన ఉదాహరణ (ధర్మపథములో) సబబుగాలేదు ఆయన ఉమ్మివేయమన్నది రాజాగారి పటముమీద అని అందరికి తెలుసు కాని ఆయన పూజించమన్నది దేవుడి విగ్రహమని నమ్మకమేమిటి? ఆ విగ్రహము మాదిరే దేవుడుంటాడా? అలా అయినచో శివుడూ, శివుని కుమారుడు వినాయకుడుకూడా దేవుళ్లేనా? మాయీ సందేహాన్ని బులుసు వెంకట రమణయ్య గారు తీర్చెదరని ఆశిస్తున్నాను.

'సుమోగా' (విజయవాడ— 2.)

వివేకానందుని జీవిత చరిత్రలో ఇచ్చిందే వ్యాసంలో ప్రస్తావించడం జరిగింది.

—వ్యాస రచయిత.

* * *

ఆంధ్రపత్రికలో శ్రీ బులుసు వేంకటరమణయ్య గారు వివరించి చూపుతున్న ధర్మపథం చాలా చక్కగా ఉంటోంది. వారు ఎన్నుకునే వస్తువు వివరించే తీరూ తత్తత్కాలోచిత ప్రాస్తావికశ్లోకములు బాగుంటున్నాయి ''నాహంజానామికేయూరే'' అని లక్ష్మణుడప్పట్లు ఈ కాలంలో ఎవడైనా అంటే అతడిని ''ఆషాఢభూతి''అనకుండా ఉంటారా? యుగధర్మం మారి పోతోంది. ముఖంలోకి సూటిగ కాక పక్కకు చూస్తూ మాట్లాడితే తప్పు పడతారు ఈ రోజుల్లో. 11— 8— 67 పత్రికలో సదభ్యాసాలను గురించి వ్రాస్తూ శీఘ్ర భోజనము చిర స్నానము, ఆరోగ్య దాయికములుగా పేర్కొన్నారు. ''అజవత్ భక్షయేత్'' గజవత్స్నాయాత్ అనే సామెతను ఉదహరించి ఉండవలసింది— మరొక్కమాట. ''కాలకృత్యములు'' అనకూడదనీ ''కాల్యకృత్యములు'' అనాలి అని వివరించారు. సరే గాని, తమ పేరులో ''వెంకట'' అని వ్రాయకూడదని, ''వేంకట'' అని వ్రాయాలనీ అంగీకరిస్తారనుకుంటాము! ''వేం'' అనగ పాపమును ''కటతి'' అనగా కోయుచున్నాడు అనికదా అర్థం.

శ్రీ బులుసువారి కలం నుంచి ఈ సూక్తులను ఇంకా కొన్ని వినాలని కోరుకుంటున్నాను.

డాక్టర్. డి. రామలక్ష్మి (ఢిల్లీ)

* * *

''4— 8— 1967 వార పత్రికలో ప్రచురించిన ''గృహమే గృహిణి మనస్సుకి ప్రతిబింబం'' అను వ్యాసము చాలా బాగుంది. స్త్రీలేకాక, పురుషులు కూడా అసలు తెలుపుటకు విశ్లేష విషయములు చక్కగా వ్రాశారు. శ్రీ పి. యస్ గారిని అభినందిస్తూ, అటు వంటి ఉపయోగమైన వ్యాసములు అంద చేయవలసిందిగా కోరుచున్నాను.

[illegible]

ఓ. ఎస్. గారు ''పుష్టికరమైన ఆహారం'' అన్న వ్యాసములో మధ్యతరగతి కుటుంబాలలో, ''సక్రమమైన ఆహారము'', తీసుకోవడం (అంటే ముఖ్యంగా పండ్లు, పాలు, వగైరా) చాల కష్టమైనపని అనీ, అసాధ్యమని, కూడా వ్రాసారు. కాని ముగింపులో మొదట్లో చర్చించిన, ఆర్థిక బాధలను (మధ్యతరగతి వారినే దృష్టిలో వుంచుకుని మాత్రము) మరచిపుష్టికరమైన ఆహారం కొనము పాలూ, పళ్ళు పిల్లలదగ్గిర నుండి అలవాటుచేసుకోవాలని సెలవిచ్చారు. అదెలా సాధ్యమో యిక ఈరోజుల్లో పిండివంట్లకంటే, ఖరీదుల్లో, పండ్లు ఏమాత్రమూ తీసిపోనిద, శ్రోతలకు తెలిసినదే. ''పుష్టికరమైన ఆహారము''కు సంయింకా మంచి సలహాలు ఇవ్వవచ్చు.

ఎస్. కోటేశ్వరరావు, (మొవ్వ.)

## న్యూఢిల్లీలేఖ

4— 8— 67 సంచికలో 'శ్రీకృష్ణ' గారి పునర్దర్శనం నాకు అమితానందాన్ని కలుగచేసింది. శ్రీకృష్ణగారు న్యూఢిల్లీ లేఖలో అస్తవ్యస్తంగాతరగా రైన ఇండియా విదేశ విధానాన్ని చాల విపులంగా వ్రాశారు. అరబ్, ఇజ్రేల్ దేశాలమధ్య యుద్ధము, దాని ఫలితాలు ఎలా ఉన్నప్పటికీ, శ్రీమతి ఇందిరా గాంధి, శ్రీ దినేష్‌సింగ్, శ్రీ జగజీవనరావ్ గార్ల విదేశ విధానం చాల ఆందోళన కరమైనది. శ్రీమతి గాంధిగారి ఆప్తమిత్రుడైన నాజర్‌పుణ్యమా అని, ఇండియాకు ఆహార నౌకలు చేరుట ఆలశ్యమవుతున్నది. కిరోసిన కొరత ఏర్పడినది. మరి అరబ్‌వారు ఇజ్రేల్‌ను ప్రపంచపటంనుండి తుడిచి వేసేవరకు మనదేశపు గతి ఇంతేనా? శ్రీకృష్ణగారి నిర్మాణాత్మక విమర్శకు ఇవేనా అభినందనలు.

పి. ప్రకాశ్ కుమార్ (గుంటూరు)



వినాయకుడు

చిత్రకారుడు: వడ్లమాని సుబ్రహ్మణ్యరావు ([illegible])


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 8— 9— '67
ప్లవంగనామ సం॥ భాద్రపద మాసం శుద్ధ॥ పంచమి

సంపుటము : 60 సంచిక : 1

స్థాపితము
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ,
ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 22.40 |
| 6 మాసముల చందా | 11.20 |
| 3 మాసముల చందా | 5.60 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం : విఘ్నేశ్వరుడు

# క్రైస్తవ మిషనరీలని దూషించే వారిలో సంఘ సేవకులు ఎంతమంది?

■ జనసంఘంవారు, హిందీ భాషోన్మాదులూ క్రయిస్తవ మిషనరీ కార్యక్రమాలమీద ఎప్పుడూ ఏదో ఒక అభియోగాన్ని తెస్తూనే వున్నారు. చాలమంది క్రయిస్తవ మిషనరీలు భారత దేశంలో పని చేయడం గురించి, ఇక్కడి సంస్థలు విదేశాల నుంచి నిధులను తెప్పించుకుంటున్న వయినం గురించి కావలసినన్ని ప్రశ్నలు లేస్తున్నాయి. క్రయిస్తవ మతంలోకి మారడం గురించిన ప్రశ్నలు కూడా వస్తున్నాయి కాని, మహమ్మదీయుల విషయమై ఎవరూ పట్టించుకోవడం లేదు.

ముస్లిం మత వ్యాప్తికి దోహదమిస్తున్న 'దోబాండ్ స్కూల్' గురించి ఎవరూ ప్రశ్నించడం లేదు. ఈ సంస్థ ఎంతో మంది ముస్లిం మిషనరీలను తయారు చేస్తున్నది. ఎంతో మందిని ఇస్లాం మతంలోకి మారుస్తున్నది కాశ్మీరులోను, ఒరిస్సాలోను క్రయిస్తవ దేవాలయాల్ని కాల్చి వేయడం జరిగింది అది అలా వుండగా ఢిల్లీలోని లాల్‌బహదూర్ శాస్త్రిగారి సమాధి సమీపంలో ఒక సరికొత్త 'మసీదు'ను నిర్మించారు. మూడువందల సంవత్సరాల నుంచి అది అక్కడే వుండేదని వారి వాదం! నేను పుట్టినప్పటి నుంచి ఈ ప్రాంతంలో ముస్లిం 'మసీదు' ఛాయలు చూడలేదు సరిగదా అక్కడ యమునానదీ ప్రవాహం వుంటుండేది!

హుమాయూన్ కబీరుగారి ఆధిపత్యంలో పురాతత్వశాఖ కళ్ళుమూసుకు కూర్చుంది. ఆ ప్రదేశంలో మసీదుని నిర్మించడమే కాకుండా, ముస్లిం సంస్థకి సంబంధించిన వారికి ఇళ్ళూ, కార్యాలయాలూ కూడా నిర్మించారు. మత సంబంధమైన వైషమ్యాలకి నేను తలపెట్టడం లేదు. కాని, ఒక్క విషయం మాత్రం చెప్పుకోవాలి క్రయిస్తవులు వారి స్వప్రయోజనాల కోసం ఏ ఒక్క హైందవ పుణ్యస్థలాన్నీ పాడు చేయలేదు!

క్రయిస్తవుల మీద ఇంత కత్తి కట్టడానికి వారు ఏం చేశారు? శ్రీ జయప్రకాశ్ నారాయణ్ గారు దీనికి సమాధానం ఇవ్వగల్గుతారు. ఆయన మా విలేఖరితో ఒక విషయం చెప్పారు. రామకృష్ణ మిషన్ తప్పిస్తే జనసంఘం దగ్గర్నుంచి మరి ఏ యితర హైందవ సంస్థా బీహారులోని ఆవులను రక్షించడానికి, మనుష్యుల్ని కాపాడడానికి ముందుకు రాలేదు

తినమరిగిన 'సాధువులు' గోవధ నిషేధం కోసం పార్లమెంటు స్ట్రీటులో నాట్యం చేశారు. బీహారులో వందల కొద్దీ ఆవులు గ్రాసం లేక చచ్చిపోతున్నాయి. వాటిని తలచిన నాథుడు లేడు. శంకరాచార్యులు, జగద్గురువులు ఢిల్లీలోను తదితర స్థలాల్లోను చందాలు పోగు చేస్తున్నారు. ఈ ధనం ఆవుల్ని రక్షించడానికి కాకుండా దేవాలయ నిర్మాణానికి ఉపయోగపడుతుంది!

బీహారులోని ఆవులు, మనుష్యులు చచ్చిపోకుండా చేయడానికి ఎద్దు మాంసం తింటున్న దేశాలు మనకు సహాయం చేస్తున్నాయీ అంటే అది సిగ్గుచేటు!

'బీహారు ప్రజలు ఆకలిచావు చావకుండా కాపాడడానికి, ముఖ్యంగా పిల్లల్ని రక్షించడానికి ఎక్కువ సహాయం చేసినది క్రయిస్తవ మిషనరీలు మాత్రమే' అని జయప్రకాశ్‌నారాయణ్ గారు చెప్పారు.

క్రయిస్తవ మిషనరీలు 'సదాచార హ్రుతం' వారి విమర్శకు గురి అయ్యారూ అంటే సహజమే. సంఘసేవలో వారు వేసిన అంద అందరికీ సిగ్గు రప్పిస్తుంది!

ఢిల్లీ వ్యవహారం చర్చించుదాం. రెండు ఢిల్లీల్లోనూ 1947 వరకు, మొత్తం నాలుగు క్రయిస్తవ పాఠశాలలు, ఒక కాలేజీ వుండేది. ఆ ఒక్క క్రయిస్తవ కళాశాల తప్పిస్తే క్రయిస్తవేతరు లదంటూ చెప్పుకొనేది ఏ ఒక్కటీ లేదు. గత ఇరవయ్యేళ్లల్లో మూడు బాలికల పాఠశాలలు, ఒక బాలుర పాఠశాల కొత్త ఢిల్లీలో ఉన్నాయి. పాత ఢిల్లీలో రెండు బాలికల పాఠశాలలు, ఒక బాలుర పాఠశాల ఉంది. ఆ పాఠశాలల్లో రద్దీ ఇంతా అంతా కాదు. నిలబడ్డానికి కూడా చోటు లేకుండా కూరుకుపోతున్నాయి. ఆ పాఠశాలలన్నీ దిగుమతి చేసుకున్న ధనంతో నిర్మితమయ్యాయి. అంత చక్కని విద్యాసంస్థల్ని నిర్మించిన హిందూమత సంస్థ ఒక్కటీలేదు. నిజమే, క్రయిస్తవ మిషనరీలను ఆడిపోసుకోవలసిందే! కుష్ఠురోగ పీడితులకు ఆశ్రయమిచ్చిన సంస్థల్లో అగ్రగణ్యమైనవి క్రయిస్తవ సంస్థలే అనేది అందరికీ తెలిసిన సత్యం క్రయిస్తవ హాస్పిటళ్లలో తర్ఫీదు నొందిన నర్సులు మంచి పనితనం గల వాళ్ళుగా దేశంలో పేరు తెచ్చుకుంటున్నారు!

క్రయిస్తవ మిషనరీలు [illegible] నేరాన్ని చేశారు! డా. అంబేద్కర్

# న్యూఢిల్లీ లేఖ

పుట్టకముందే నిమ్న జాతుల్ని ఆదరించి, వారిలో ఆత్మ గవురవాన్ని నిలబెట్టారు. నిమ్న తరగతుల మతాల మార్పిడిని ద్వేషిస్తూ వస్తున్న వారు సంఘోద్ధారకులయిన ఇస్లాము, శిక్కు మతాల వారూను. ఉదాహరణకు నిమ్న జాతిలో ఎవరైనా శిక్కు మతం తీసుకుంటే వారిని 'మాజ్ బీ'లని వ్యవహరిస్తారు. సిక్కులకీ వారికి పొత్తు కుదరదు. వారిమధ్య పెళ్లిళ్లు జరగవు. సహపంక్తి భోజనం కూడా తలపడనికి వీల్లేదు!

నేనిదంతా క్రయిస్తవ మిషనరీల తరఫున వాదించడం కాదు ఎవరు పరిశీలించినా ఇవే నిజాలు బహిర్గత మవుతాయి ఈ మిషనరీలను దేశాన్నుంచి వెళ్ల గొట్టడానికి తలపెట్టినవారు, వారు చేసిన సదుపాయాల్నే తమరూ చేయడానికి ముందుకు రావాలి ఉదాహరణకి జనసంఘం, వారితో వారి మిత్రులు, 'మేము ఏమీ తీసిపోలేదు' అంటూ కుష్ఠురోగులకు ఆశ్రయం కల్పించి, హాస్పిటళ్లు నిర్మించి క్రయిస్తవ సంస్థలతో పోటీ పడాలి ప్రతి గ్రామంలో ఒక పాఠశాల నిర్మించడానికి, ప్రతి తాలూకాలోను ఒక హాస్పిటలు కట్టడానికి చాలినంత ధనం మన హైందవ మత సంస్థల ఖజానాల్లో వుంది 'అమ్మ అన్నం పెట్టదు అడుక్కు తిననివ్వదు' అన్న సామెతగా వేరు ఏర్పాట్లు చేయకుండా, దేశంలో జీవకారుణ్యానికి ఎంతగానో తోడ్పడుతున్న సంస్థల్ని దేశం విడిచి పొమ్మనడం అన్యాయం!

క్రయిస్తవ మిషనరీలు సరిహద్దుల్లో వున్న ప్రజల్ని దేశానికి కాకుండా చేస్తున్నారనే వదంతి ఒకటుంది ముసల్మానుల దగ్గర్నుంచి అందర్నీ అటువంటి దేశ విద్రోహక చర్యల కోసం దండించవలసిందే. ఇక్కడ ముసల్మానుల్ని ఎందుకు ఉదహరించవలసి వచ్చిందీ అంటే, ఉత్తరాదిన ఉన్నత వంశంలోని ముసల్మానులు తరచు పాకిస్తాను ముసల్మానులతో సంబంధాలు ఏర్పరచుకుంటున్నారూ అన్నది దాచవలసిన విషయం కాదు!

పశ్చిమ బెంగాల్‌లోని 'కలింపాంగ్'లో ఎంతమంది క్రయిస్తవేతరులు జీవించారు? అన్నది ప్రశ్న కావొచ్చు అక్కడి కొండజాతి ప్రజల్ని ఉద్ధరించడానికి ముప్ఫయ్ మంది 'స్విస్' మిషనరీలు ఆ దేశం డబ్బుతో వచ్చారు. అందులో చాల మంది భారత పౌరులుగా మారిపోయారు! కొండజాతి ప్రజలకి ఎటువంటి ఆరోగ్య పథకాలు ఏర్పరచకుండా ఈ మిషనరీ అందర్నీ 'ఓమ్‌డో' దాటి పొమ్మని భారత ప్రభుత్వం ఆజ్ఞాపించింది. పర్యవసానంగా కమ్యూనిజం, చైనా, పాకిస్తాన్ విద్రోహ సంస్థలు ఆ స్థానాన్ని ఆక్రమించుకోవచ్చు! దీనిని మన సనాతన ధర్మపరాయణులు సహించగలరు. కాని క్రయిస్తవ మిషనరీలను సహించలేరు!

## ప్రాంతీయ భాషా విధానం

ఢిల్లీ ఇప్పుడు సెలవుల్లోవుంది. పార్లమెంటరీ విరామంవల్ల పార్లమెంటు స్ట్రీటులో వున్న ప్రజలు కొన్త వూపిరి పీల్చుకుంటున్నారు.

పార్లమెంటు చర్చలున్న రోజుల్లో ప్రతి రోజూ ఒకటీ అరా ఆందోళనల్ని ఈ వీధి రుచి చూస్తూ వుండేది. పత్రికలకి వార్తలు తక్కువయ్యాయనీ బెంగాలు మంత్రులు ప్రధానమంత్రి యింటిముందు 'ధర్ణా' చేయ సంకల్పించుకున్నట్టు ఇది వరలో పకటించారు. అసలు, బెంగాలు మంత్రులు కార్యాలయాన్ని అధివసించి అప్పటినుంచీ పత్రికల ప్రముఖ వార్తల్లో వానుతూ, సంకల్పాన్ని నెరవేర్చుకుంటూనే వున్నారు.

భారతదేశంలో జాతీయ భావాన్ని ఛేదించడానికి మరో బెంగాలీ నాయకుడు టి సేన్ నామకుడు ఒక జాతీయ విద్యా విధానాన్ని ప్రకటించారు! ఆయన వాదాన్ని బలపర్చడానికి మరి కొందరి రాజకీయవేత్తలని కూడదీశారు. భారతదేశ ప్రజల సంఘీభావానికి చేటు వాటిల్లుతుందని గ్రహించిన శ్రీమతి గాంధీగారి మంత్రివర్గమే విద్యా విధానం మీద వారి మొదటి తీర్మానాన్ని మార్చుకున్నారు! శ్రీ సేన్ గార్లు ఎలానైనా దేశాన్ని విచ్ఛిన్నం చేయాలని చూస్తున్నారు గనక తమ అభిప్రాయాన్ని బలపర్చడానికి సాధన సంపత్తిని ప్రోగు చేయ సమకట్టారు.

శ్రీ సేన్ గారికి రాష్ట్రాలనుంచి కొంత బలం చేకూరుతూ వుందనడానికి కొంత వ్యాఖ్యానం కావాలి. బెంగాలు, కేరళ, కమ్యూనిస్టుల కైవశమయిన రాష్ట్ర ప్రభుత్వాలు. రష్యాకి ఆవలి ప్రపంచంలో వున్న కమ్యూనిస్టులు—దేశంలో విచ్ఛిత్తిని ఏర్పరచడం ద్వారా కొంత బలాన్ని పుంజుకోవచ్చుననే నమ్మకం కలిగి వున్నారు. బెంగాలీలు వారి రాజ్య వాదంలో ఎప్పుడో పట్టు తప్పారు 1912 వరకు కేంద్ర సచివాలయం నిండా వారే అదీకాక, ఈ ప్రాంతీయ విధానం వల్ల వారికి పోయేది ఏమీ లేదు. ఆంధ్రప్రదేశ్, అస్సాం, మైసూరు రాష్ట్రాల్లో కాంగ్రెసు ప్రభుత్వం వుంది. ఈ రాష్ట్రాలకు చెందినవారు కేంద్ర సచివాలయంలో ఆట్టే లేరు. అందుచేత వారుకూడా విభిన్నంగా ప్రవర్తించడానికి అవకాశం వుంది. కేరళలో కమ్యూనిస్టులకు రెండు వైపులా పదునున్న కత్తి వుంది! వారికి ప్రాంతీయ విధానం బాగా నచ్చుతుంది ప్రభుత్వాన్ని నిలుపుకునేందుకు తగిన బలాన్ని నిరుద్యోగ సమస్య ద్వారా సంపాదించుకుంటుంది!

శ్రీ టి. సేన్ గారి ప్రాంతీయవిధానం వల్ల మద్రాసులోని ఒక కేంద్ర ప్రభుత్వ ఉద్యోగి మద్రాసులోనే రిటయిరవుతాడు. ఇతర ప్రాంతాలకు బదిలీ అవడం ద్వారా వచ్చే సదుపాయాల్ని అతను పోగొట్టుకుంటాడన్న మాట!

ఈ మందు తీసుకుంటే
ఆకలి అన్నమాట
వుండదు

ప్రజలు

డా॥ మార్క్సిస్టు

విచ్ఛిత్తి
(విషం)

పెరుగుతున్న స్నేహం!

చైనా

భారత్

జపాన్

ఈ శతాబ్దంలోని మహాగొప్ప
కథని ఇక్కడ చదువుతావు

పుకారు
శ్రీమతి
ఇందిరాగాంధీ
మీద
చవాన్
కుట్ర
పన్నుతు
న్నారు.

## వంతెన నిర్మాతలు

పాకిస్తాన్

భారత దేశం

నిర్మాణంలోవుంది
భారత పాకిస్తాన్
సుహృద్భావ వారధి

OOMMEN

ఇటీవలి హింసాత్మక సంఘటనలు ఒక్కటే భారతదేశ ఐక్యతను విలవేట్టి వీలా కనిపిస్తున్నది. ఇంగ్లీషు 'లింకు' భాషగా వుండాలన్నది ఈ ఒక్క రాష్ట్రమే!

## ముందు చూపులేని 'ప్లానింగ్'

బీహార్—బెంగాలులలోని ప్రభుత్వ రంగం సంస్థలవిూద 'తిర్యగ్గమనం' కొంత చర్చ నీయం. ఉక్కు పరిశ్రమలు, ప్లానింగు, పెట్రోలియమ్ వ్యవహారాలను చూడడానికి మొత్తం ముగ్గురు మంత్రులు ఉన్నారు. ప్లానింగ్ కమిషన్‌లోని మెంబరు

## న్యూఢిల్లీ రేఖ

గారోకరున్నారు, ఇంకా సెక్రటరీలున్నారు—జాయింటు సెక్రటరీలున్నారు. డిప్యూటీ సెక్రటరీలున్నారు. వీరుకాక పర్సనల్ అసిస్టెంటులున్నారు వీరంతా ఎందుకు? ఏం చేస్తారు?

ప్రభుత్వ రంగంలోని పైపుల తయారీకి సంబంధించిన వ్యవహారం ఈ విషయాన్ని బాగా విశదం చేస్తుంది మహా గొప్ప పాతరోజుల్లో, గొప్ప గొప్ప ప్లానులు వేసిన దినాల్లో పెట్రోలియం ఉత్పత్తుల సరఫరాకోసం భారతదేశమంతటా పైపులు వేయాలని చూశారు కావలసినన్ని పైపుల తయారీకి ఒక కర్మాగారాన్ని నిర్మించారు. స్వయం పోషకంగా వుండాలన్నది ఇక్కడ సదుద్దేశం. పైపులని వేయడానికి తగిన సాంకేతిక నిపుణులు మన వద్ద లేక పోయారు. ఇక్కడ స్వయం సమృద్ధి సూత్రాన్ని కొంచెం సవరించవలసి వచ్చింది. బరోనీని కాన్పూరుతోను, బరోనీని హాల్దియాతోను కలుపుతూ రెండు పైపులైన్లను వేయడానికి ఇటలీ వారు దిగి వచ్చారు. కాన్పూరు—బరోనీ లైను వారానికి రెండు మూడుసార్లు ఉపయోగానికి వస్తుంది. హాల్దియా—బరోనీ పైపు లైను తుప్పు పట్టి పోతోంది. ఇది బీహారు మీదనుంచి వేయడంతో అక్కడ కొంత రభస జరిగింది. 'రైల్వే' వారికి ఇబ్బంది వస్తుంది గనక బొంబాయి—పూనాలను కలపడానికి వేసే పైప్‌లైన్‌ని పూర్తిగా విరమించుకున్నారు. మరో విధంగా చెప్పాలంటే, భారత దేశాన్ని 'పైపు లైన్ల' తో నింపాలన్న పథకాన్నే పూర్తిగా విరమించుకున్నారు!

గౌరవనీయులైన మంత్రులు ఎవిధంగా 'గొట్టాల్ని' వినియోగించుకుంటారూ అనేది ఇక్కడి ప్రశ్న ఎగుమతుల ద్వారా, అని ఒక సమాధానం చెప్పుకోవచ్చు పోనీ, అలానే అని సర్దిపుచ్చుకుందా మంటే ప్రపంచ మార్కెట్టుకి మన ధరలు సరితూగవే! అప్పుడు తగ్గింపు రేటుకు అమ్మవలసి వస్తుంది వీటి ధరల్ని తగ్గించారూ అంటే పన్నులు కట్టే ప్రజల జేబులు కొట్టాల్సి వస్తుంది!

పైపుల కర్మాగారాన్ని నిర్మించడానికి పన్నులు కట్టే ప్రజల మూలధనాన్నే పెట్టారు. తిరా నిర్మించిన తర్వాత, నష్టపోయేది కూడా ప్రజలే నాశితమ ఘనతను నిరూపించుకోడానికి వేసే ముందుచూపు లేని ఇటువంటి పథకాలనే మన దేశంలో 'ప్లానింగు' అంటున్నారు! ●

# కాలప్పన్ - దొంగసారాయి - చిన్నపిల్లలు

ఆగస్టు పదిహేడవ తేదీన కాలికట్ ప్రాంతంలో తాగుడు అలవాటున్న కొందరు ఎందరో పిల్లల్ని కల్లంగళ్లలోకి తీసుకు వెళ్లారుట— అక్కడ వారందరి చేతా సారా తాగిస్తూ, "కాలప్పన్, దొంగసారా(కాచేవాళ్లూ నశించాలి." అని అరిచారట. ఈ కాలప్పన్ ఎవరు? ఒక సర్వోదయ సంఘ సేవకుడు, నాయకుడు. ఈ 'ఉద్యమా'నికి కారణం ఏమిటి? ఆ ప్రాంతంలో సర్వోదయ సంఘం వారు గాంధి శాంతి సంస్థతో కలిసి సారా దుకాణాని పికెట్ చేస్తున్నారట.!

## ముగ్గురా నలుగురా?

బీహారులోని ధన్‌బాద్ దగ్గర లెవెల్ క్రాసింగ్ దగ్గర ఒక కారు ఆగిఉంది. అందులో ఇద్దరు కూర్చుని ఉన్నారు. గేటు తెరవటానికి కాచుకుని కూర్చున్నారు.

ఇంతలో ముగ్గురు వచ్చి తమని పోలిస్‌స్టేషన్‌లో దింప మన్నారు. "మేమెవర్లో తెలుసా పోలీసు వాళ్లం." అన్నారు. అయితే, కారు నడుపుతున్న పెద్దమనిషిని తనతో ఉన్న స్నేహితుడిని ముందు సర్‌క్యూట్ హౌస దగ్గర దింపటానికి వప్పుకున్నారు.

కారు సర్క్యూట్ హౌస్‌ముందు ఆగింది. కారు నడిపే ఆయన మిత్రుడు దిగాడు. వెంటనే అక్కడ ఉన్న కాపలా వాళ్లు ఎటెన్షన్‌గా ముంచుని సెల్యూట్ కొట్టారు.

ఇంతకీ ఆయన బీహార్ రాష్ట్రం డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీసు

ముగ్గురు పోలీసు వాళ్లనీ సస్పెండ్ చేశారట. ఇది ఆగస్టు 18 న జరిగింది.

## సమాధిలో నుంచి బదిలీ

ఈమధ్య 1577 'మంది'ని పారిస్‌లో ఒకచోట నుంచి 'ఎవిక్ట్'చేశారు. ఆచోటు ఒక స్మశానం. 1577 మందీ చనిపోయి చాలాకాలం అయింది. స్మశానంలో ఖాళీ లేక అందరినీ పంపించేస్తున్నారు. బహిష్కరింపబడిన వారి జాబితా ప్రకటించారు.

## కనకం, కాలనిర్ణయం

30 లక్షల బంగారం, గడియారాలు— అంటే ఎంత, ఎన్ని? సుమారు 3920 తులాల బంగారం 20,000 చేతిగడియారాలు. బంగరం ఖరీదు. 7లక్షల రూపాయలు, గడియారాల ఖరీదు మిగతా.

ఇదీ ఆగస్టు 19 తెల్లవారు జామున బొంబాయి సెంట్రల్ ఎక్స్‌ప్రెసు వాళ్ళు పట్టుకున్న దొంగరవాణా సరుకు.... .....

**అంతా ఒక లారీలో దొరికాయి. అందులో** కూచున్న ముగ్గురినీ, డ్రయివరునీ— నిర్బంధించారు.

## పడని ఫలహారం

22 ఆగస్టు, మాండ్య, మైసూరు— ఇక్కడ ఒకహోటల్లో పొద్దునే టిఫిన్ తిని 15 మంది చని పోయారుట.

## శిశు హత్య

జాన్ లిన్ వయస్సు 25 అతనికి ఆరేళ్ల కొడుకు నాలుగు, రెండు ఏళ్ల కూతుళ్లూ ఉన్నారు. అందరూ అమెరికాలో బిడ్ ఫోర్డ్ అనే ఊళ్లో ఉంటూ ఉండేవారు. మొన్న ఆగస్టు 23న జాన్ లిన్ ముగ్గురు పిల్లల్నీ కాల్చి చంపేశాడు. తర్వాత పోలీసు వాళ్ల దగ్గిరికి వెళ్లి నేరం చెప్పుకున్నాడు.

ఎందుకు కాల్చాడో తెలీదు.

*   *   *

మొన్న ఇరవై రెండో తేదీ వెనజ్వెలాలో ఒకచోట ఆరు బైట పడుకో బెట్టిన నెల పసి కందును రాబందు ఒకటి తన్నుకుపోయి, బరువు మొయ్యలేక, పక్కనున్న రాళ్లల్లో వదిలేసిపోయిందట, స్వల్ప గాయాలతో ఆపసికందు తల్లికి దక్కింది. జనాభా తగ్గాలి— తగ్గి తీరాలంటే పుట్టకూడదు. అనిగాని— యిలాగ్గ పోవాలనా

## బియ్యం దొంగరవాణా: అధికారిపై దౌర్జన్యం

నూళ్ళూరుపేట కాంప్‌లో ఉన్న రాష్ట్ర రహస్య సమాచారశాఖ ప్రత్యేక విభాగానికి చెందిన డిప్యూటీ పోలీస్ సూపరింటెండెంట్ శ్రీ గోపాలకృష్ణ గోఖలే సూళ్ళూరుపేటనుంచి జనతాఎక్స్‌ప్రెస్‌లో మద్రాసుకి బియ్యం దొంగరవాణా జరుగుతున్నదన్న విషయం తెలుసుకుని ఆ ముఠాను పట్టుకోడానికి జనతా వచ్చే సమయానికి అవుటర్ సిగ్నల్ వద్దకు వెళ్లారు. ఆయనతోపాటు ఒక సబ్‌ఇన్‌స్పెక్టర్, హెడ్ కనిస్టేబిల్, ఓ కానిస్టేబిల్ కూడా సహాయంగా వెళ్లారు. కాని వారిని పసిగట్టిన దొంగరవాణా ముఠావారు వారిపై తిరగబడ్డారు. ఆత్మరక్షణార్థం శ్రీ గోపాల కృష్ణ తమ రివాల్వర్‌ని పేల్చారు. కానీ దానివల్ల ఎవరూ గాయపడలేదు. ఆ ముఠాలో ఒకరు విసిరిన ఉక్కు తీగ ఆయన కుడి మోకాలుని గాయపరిచింది. శ్రీ గోపాలకృష్ణ మళ్లీ రివాల్వర్ పేల్చబోగా అది పని చేయలేదు. సబ్‌ఇన్‌స్పెక్టర్ మరికొందరు పోలీసుల్ని తీసుకురావడానికి వెళ్లగా దొంగరవాణా ముఠా శ్రీ గోపాలకృష్ణ పైబడి ఆయన వద్దనున్న రివాల్వర్‌ని లాక్కోడానికి ప్రయత్నించి విఫలులైనారు. అందులో ఒకడు ఆయన చేతిగడియారాన్ని మాత్రం చేజిక్కించుకున్నాడు. ఆయనతోపాటు ఉన్న హెడ్ కానిస్టేబిల్‌ని, కానిస్టేబిల్‌ని కూడా దొంగరవాణా ముఠావాళ్లు కొట్టారు. ఇంతలో సూళ్ళూరుపేట రైల్వేస్టేషన్ నుంచి పోలీసులు రావటం చూసి వాళ్లు పారిపోయారు. ఆగస్టు 23 న ఈ సంఘటన జరిగింది.

- తస్కర్



# [illegible]

ఏ పని ప్రారంభించినా విఘ్నరాజును

"శుక్లాంబరధరం విష్ణుం
శశివర్ణం చతుర్భుజం,
ప్రసన్నవదనం ధ్యాయేత్
సర్వ విఘ్నోప శాంతయే"

అని స్మరించడం అనూచానంగా ఆచారమని పెద్దలు అంటారు కాని దీనిని ప్రాచీనులందరూ పాటించినట్లు కనుపించదు

కావ్య రచన అనేది గొప్ప పనికదా? అది సప్త సంతానాలలో ఒక్కటిగా పేరు పొందింది అలాటి మహాకార్యం చేయడానికి ముందు విఘ్నోపశాంతికిగాను వినాయకుణ్ణి పూజించాలి కదా! మన మహాకవులెవ్వరూ అలా చేసినట్లు కనిపించదు

మన ఆదికవి నన్నయ భట్టారకుల సంగతే చూద్దాం భారతం వంటి ఇతిహాసాన్ని తెలుగు చేస్తున్నారు కదా! వినాయకుని స్మరించారా మొదట్లో

"శ్రీ వాణీ గిరిజాశ్చిరాయ దధతో
వక్షో ముఖాంగేషు యే"

అని త్రిమూర్తులను, సపత్నీకులను స్మరించారుగాని! వినాయకుడంటే భయమే ఉంటే "శ్రీ విఘ్నేశ్వర" అని ప్రారంభించి మొట్ట మొదట పద్యమో, శ్లోకమో చెప్పేవారే!

శివకవులయిన నన్నె చోడుడు గారు పాల్కురికి సోమన్నగారు వీరశైవులు గణాధిపతి వారికి ముఖ్యం వారైనా వినాయకుడిని తమ రచనల మొదట్లో స్మరించారా? ఉహూం!

తిక్కన్నగారు మరి యిది "శ్రీ రామ్యం మనుమ క్షితీశ" అని మనుమ సిద్ధికి శుభం కోరుతూ "శ్రీయన గౌరినా బరుగు చెల్వకు" అని హరిహరాద్వైతంతో తమ విరాటపర్వం ఆరంభించారు

పోతనగారు విష్ణు భక్తులు ఆయన మంచి మొదట్లోనే వినాయకస్తవం ఆశించలేము

"శ్రీ కైవల్యపదంబు జేరుటకునై
చింతించెదన్ లోకర
క్షైకారంభకు"

అని కృష్ణస్తుతితో భాగవత రచన ప్రారంభించి, తర్వాత ఆ శివ పార్వతుల భక్తి మొక్కి



సింహారూఢుడై ఉన్న పంచముఖ గణపతి

ఫొటోలు ఎస్ రామకృష్ణ

పిదప విధాతకు సేవచేసి, నిఖిల ప్రధాన దేవతా వందనంబు చేసి వినాయకునికి

"ఆదరమొప్ప మ్రొక్కిడుదు
నద్రిసుతా హృదయానురాగ సం
పాదికి దోషభేదికి ప్ర
పన్న వినోదికి విఘ్నవల్లికా
చ్ఛేదికి మంజువాదికి న
శేష జగజ్జన నంద వేదికిన్
మోదక ఖాదికిన్ సమద
మూషక సాదికి సుప్రసాదికిన్"

అని ఒక నమస్కారం పెట్టారు, ఉప దేవతను ఎందుకు వదలుకోవాలనే ఆదరంతో

ప్రబంధాలకు ప్రవర్తకులయిన పెద్దన గారయినా వినాయకుణ్ణి మొదట్లో స్మరించారా అంటే, లేనేలేదు

"శ్రీ వక్షోజ కురంగనాభ మెదమై

జెన్నొంద విశ్వంభరా
దేవిన్ దత్కమలా సమీపమున ప్రీ
తిన్ నిల్పినాడో యనం
గా వందారు సనందనాది నిజ భ
క్త శ్రేణికిం దోచు రా
జీవాక్షుండు కృతార్థు జేయు శుభదృ
ష్టిం గృష్ణరాయాధిపున్"

అని విష్ణువును కృష్ణ రాయలకు శుభం చేయవలసిందిగా సిఫార్సుచేసి, శివ బ్రహ్మలను స్మరించిన తర్వాత

"అంకముజేరి శైల తనయా
స్తన దుగ్ధము లానువేళ బా
ల్యాంకవిచేష్ట దొండమున
నవ్వలిచన్ గబళింపబోయి యా
వంక కుచంబు గాన కహి
వల్లభహారము గాంచి వే మృణా

జాన్యుని గొల్తు సభీష్ట సిద్ధికిన్"
అని వినాయకుణ్ని సకల విద్యార్థి నాయకునిగా గాక, చిలిపిచేష్టలుచేసే క్షుద్రవానిగా వర్ణించారు

కవితా కళాపూర్ణమైన కళా పూర్ణోదయంలో పింగళి సూరనగారు వినాయకుణ్ని పూర్తిగా మరిచేపోయారు పెద్దనగారు "శ్రీ వక్షోజ కురంగనాభమెదపై జెవ్వొంద" అని ప్రారంభిస్తే, కస్తూరి ఎందుకు, కుంకుమపూవు కాగూడదా?—అని పెద్దన గారితో పోటీపడి,

"శ్రీ లావణ్యవతీ కుచద్వితయ కా
శ్మీర ప్రభాచారు వ
క్షో లంకారమణి ప్రకాండము వసీ
నార్యుండుగా సన్మనో
వాళీకావిరత ప్రభాత మగుమన్
భాసిల్లు తత్త్వంబు నం
ద్యాల శ్రీ నరసింహ కృష్ణవిభు ని
త్య శ్రీయుతుం జేయుతన్."

అని ప్రారంభించి, తాండవ కృష్ణుని, అర్ధనారీశ్వరుణ్ని, బ్రహ్మను నమస్కరించి, వాల్మీకి వ్యాసులను పొగడారు తర్వాత. వినాయకుని ఊసేలేదు

వినాయకునికి విశేష ప్రాభవంగల తమిళదేశం మధ్యన రాజ్యమేలిన రఘునాథ నాయంకులవారు వాల్మీకి చరిత్ర ప్రారంభంలో వినాయకుని స్మరించవలసిందే. కాని, అలా ఎందుకు చేయలేదో!

"శ్రీ వైదేహి యురోజ పూర్ణ కలశీ
శృంగంబులం బల్లవ
శ్రీ విన్యాసము జూపు హస్తములచే
ప్రేమం ప్రకాశంబుగా
శ్రీ విద్యుల్ నతకోటి కిచ్చు నల రా
జీవాక్షు డిక్ష్వాకు వం
శావిర్భూత మహార్ఘ రత్నము మదీ
యాభీష్టముల్ సేయుతన్"

అని శ్రీరాముణ్ని, తర్వాత సీతాదేవిని, హనుమంతుని స్తుతించిన మీదట విఘ్ననాయకుని స్మరించారు

ఆధునికకవులంతా తమనుతప్ప మరెవరినీ స్మరించరుగన కవినాయకస్తుతి ప్రసక్తేలేదు.

ఏమైనా, మన ప్రాచీన కవివరులు వినాయకుని — నేడు పై ఆఫీసరును చూడబోతూనో, చూచి వచ్చిన తర్వాతనో గుమాస్తా పగ్గాలకు ఒక దండం పారేసినట్టు — అనుషంగికంగా స్తుతించారేకాని, ప్రధానంగా స్తుతించలేదు —శి. రా.]

వినాయక చవితిని మహారాష్ట్ర దేశంలో 'గణేశ్ చతుర్థి'గా వ్యవహరిస్తూవుంటారు. మహారాష్ట్రుల పండుగలలో కెల్లా పెద్ద పండుగ ఇదే. ఈ పండుగ సందర్భంలో మనలాగే వారు కూడా నవరాత్రులూ వేడుకలు జరుపుకుంటారు.

ఈ తొమ్మిదిరోజులూ మహారాష్ట్రంలో ఏ వీధిని చూచినా పండుగసంబరంతో కోలాహలంగా ఉంటుంది. మేళతాళాలతో మార్మోగుతూ ఉంటుంది.

ఒకో వీధికి ఒక పెద్ద వినాయకుడి విగ్రహం ఉంటుంది. వీధివీధికీ కాకుండా కొందరు కొందరు సంఘంగా కూడి చందాలు పోగుచేసి ఒకరికిమించి మరొకరు పెద్ద పెద్ద వినాయకుని విగ్రహాలను ప్రతిష్ఠించుకోవడం కూడా కద్దు.

విఘ్నేశ్వరుణ్ని నదిలోనో, కాలువలోనో కలిపే ఆచారం మనకూ వుంది. మహారాష్ట్రులకు ఈ దినం మరో ఘనమయిన పర్వం. వినాయకుణ్ణి నీటిలో కలపడాన్ని 'గణేశ్ విసర్జన్' అంటారు. ఇది ప్రభుత్వ సెలవుదినం కూడా!

బొంబాయి నగరాన్ని ప్రత్యేకంగా తీసుకుంటే ఆ రోజు అక్కడి హడావుడి అంతా యింతా కాదు. జనసమ్మర్దంతో సముద్ర తీరమయిన 'చవుపాటీ' దరిదాపుల రోడ్లన్నీ తొక్కిసలాడిపోతాయి. బస్సుల రూట్లను మార్చేస్తారు. ఎక్కువబస్సులనూ, రైళ్లనూ వేస్తారు. రహదార్లకు సంబంధించిన తక్షణ



బహూర్ పల్లవ వినాయకుడు.

చర్య లన్నింటినీ తీసుకుంటారు

అన్ని ప్రయాణ సవుకర్యాలు ఉన్నా, బస్సులలో ఖాళీ ఉండదు రైళ్లలో సరేసరి, మామూలుగానే వేలాడడం వుంటుంది. ఇటువంటి సందర్భంలో అయితే చెప్పనే అనసరంలేదు ఈ బాధలన్నీ పడలేక నడిచి వెళ్లేవాళ్లే ఎక్కువ ఉంటారు

బొంబాయి ప్రజ అంతా సముద్ర తీరాన్నే ఉంటుంది ఆడా మగా భేదం లేకుండా ఎంతో ఉత్సాహంగా ఉత్సవంలో పాల్గొంటారు

మధ్యాహ్నం దాటిన తర్వాత రెండుమంచి అయిదూ ఆరుప్రాంతం వరకు తొడతొక్కిడి మరీ అధికంగా వుంటుంది ఆ సమయంలో ఒకో 'భేల్ పూరీవాలా' కనీసం ఒకటిరెండు వందలు తక్కువకాకుండా సంపాయిస్తాడు!

గణేశ్వరుని విగ్రహాల్ని లారీలమీద సముద్రానికి తీసుకువస్తారు ఒక లారీ సరిపోక పోతే రెండు లారీలను జతచేసి దానిమీద విగ్రహాన్ని నిలబెట్టి తీసుకురావడం ఉంటుంది! ఇక్కడ చిత్రమేమిటి అంటే వాటిమీద ఒక్క విఘ్ననాయకుడి విగ్రహం మాత్రమే ఉండదు. భారత రామాయణాల్లోని పురాణపురుషుల లగాయతూ చైనా పాకిస్తాన్ రణధీరుల విగ్రహాల వరకు ఉంటాయి!

ఈ విగ్రహాలు జయజయ ధ్వానాలతో, మహారాష్ట్ర ప్రసిద్ధ నృత్యాలతో, వాయిద్యాలతో, రకరకాలయిన ప్రదర్శనలతో ప్రజల్ని ఆకర్షిస్తూ ముందుకు సాగుతూవస్తాయి

సినిమా నటీనటుల దగ్గర్నుంచీ, గుడిసెల్లో నివసించేవారిదాకా ఈ విగ్రహాల్ని ప్రత్యేకంగా నిర్మిస్తారు

ఒకప్పుడు ప్రముఖ చలనచిత్ర నిర్మాత 'శాంతారాం' గణేశ్ విగ్రహం అన్నిటికంటె గొప్పదని చెప్పుకునేవారు తర్వాత రాజ్ కపూర్ ది ఇలా ఒకరికంటె ఒకరు ఘనమైనవిగా నిర్మించుకొని తమ ఘనతను చాటుకోవడం కూడా ఇక్కడ ఆచారం! చవుపాటీలో చోటుండదు గాని, నిలబడగల్గితే పెద్ద పెద్ద విగ్రహాలన్నీ కనిపిస్తాయి

'గణపతి బప్పా మోరియా పుఢ్ చా వర్షీ లౌకర్ యా' అంటూ విగ్రహాల్ని సముద్రంలో కలుపుతూ మళ్లీ వచ్చే సంవత

(80 వ పేజీ చూడండి)




ఆక్టోపస్ నన్ను చుట్టెయ్యటం మొదలు పెట్టింది.

అయిపోయింది! నేనే గెలిచాను. ఫరవాలేదు.




చచ్చిపోతున్న ఆక్టోపస్‌ని వదిలేశాను నామీద హఠాత్తుగా, మిస్టర్ బిగ్ నావ, సెకాతుర్, అడుగు భాగం కనిపించింది.

దానికి చిన్న లింపెట్ మయిన్ (బాంబు) ఒకటి తగిలించాను. పక్కగా ఒక బరాకూడా చేప నోరు తెరుచుకుని వెడుతోంది..

హఠాత్తుగా పిచ్చెక్కిన బరకూడాలు నన్ను చుట్టుముట్టాయి పయిన ఎవరో మాంసపు ముక్కలు చల్లుతున్నారు.




పయిన వేస్తున్న వాటివల్ల ఉద్రేకం చెందిన బరాకూడాలు నామీద పడ్డాయి..

ఒకటి నా రబ్బర్ సూట్‌ని చింపేసింది దానిని నా ఈటె తుపాకితో కాల్చాను. అది ఈటెతో పాటు పారి పోయింది.

నేను నీటికింద ఒక గుహలో దాక్కున్నాను.




ఆ నీటికింద గుహలో వాళ్ళు డప్పుల మోత వినిపించటం ప్రారంభించింది.

అంటే శత్రువు మేలుకున్నాడన్న మాట.




మిస్టర్ బిగ్ కేంద్రం కార్యాలయం కింద ఈదుతూ ఉండగా నన్నిద్దరు పట్టుకున్నారు

బయట డప్పులు మోగుతూనే ఉన్నాయి నా 'ఫ్రాగ్ మాన్— సూట్' తీసేశారు

అమాంతంగా నా శత్రువు, మిస్టర్ బిగ్, ఆ గుహ అవతల కనిపించాడు




'గుడ్‌మార్నింగ్ మిస్టర్ బాండ్ ఈగ సాలీడు గూట్లోకి రావటానికి చాలా సేపయ్యిందే!'

మిస్టర్ బిగ్ వెనకాల నిధిని ఎలా రవాణాకి తయారు చేస్తున్నారో గమనించాను తర్వాతి షిప్‌మెంట్ అమెరికాకే కాని నాకు అదంతా చూసే వ్యవధి లేకపోయింది....

"పైకి తీసుకురండి—"
వీపుకి ఆన్చినకత్తి— ముందుకి వెళ్ళాను

(ఇంకా వుంది)

విలియాం మాంచెస్టర్

# అధ్యక్షుని మరణం

## 14

లవ్‌ఫీల్డ్ విమానాశ్రయంలో 26000 విమానం తలుపులు మూశారు. జాక్వెలీన్ కెన్నెడీ కొంతసేపు వంటరిగా ఉంటానన్నది తనూ, జాక్ (కెన్నెడీ) ఆఖరిసారి ఈ విమానం మీద కొంతకాలం గడిపినది తమ 'కేబిన్'లో నెమ్మదిగా తనలో తనే మాట్లాడుకుంటూ, అక్కడికి వెళ్ళింది. గదిలో కూర్చుని మనసు కుదుట పర్చుకోవాలని ఆమె ఉద్దేశం గది తనదే. తలుపు కొట్టటం దేనికి అనుకున్నదేమో తలుపు తెరిచింది లోపల మంచం మీద లిండన్ జాన్సన్ చేరగిలబడి ఉన్నాడు మారీ ఫెహ్మర్‌కి ఏదో డిక్టేట్ చేస్తున్నాడు

శ్రీమతి కెన్నెడీ రక్కున ఆగిపోయింది కొత్త అధ్యక్షుడు లేచి అవసరం అవసరంగా బయటికి వెళ్ళిపోయాడు. మారీఫెహ్మర్ కూడా కాగితాలూ, పెన్సిళ్ళూ తీసుకుని బయటికి వెళ్ళిపోయింది

శ్రీమతి కెన్నెడీ వారి వంక చూస్తూ ఉండిపోయింది ఒక క్షణం అక్కడే ఉండిపోయింది. తర్వాత వచ్చిన దారినే వెళ్ళిపోయింది.

రెండు గంటలుగా ఉన్న వత్తిడి కొంత తగ్గటం ప్రారంభమయి విమానంలోఉన్న ఎందరో తమకి ఆకలిగా ఉందని గమనించారు జాన్సన్ కొంత సూప్ తెప్పించుకున్నాడు శ్రీమతి కెన్నెడీ శవపేటికతో కూర్చొనటానికి విమానం చివర గదిలోకి వెళ్ళిపోయింది.

విమాన చోదకుడు ఒక ఇంజన్‌ని స్టార్ట్ చేశాడు. గాడ్‌ఫ్రే మెక్‌హ్యూగ్ విమానం ముందు భాగానికి వెళ్ళి, 'టేకాఫ్! అధ్యక్షుడు విమానంలో ఉన్నాడు!' అని అరిచాడు.

నిజానికి విమానంమీద ఇద్దరు అధ్యక్షులు ఉన్నారు. మెక్‌హ్యూగ్ ఇలాగ అనుకోలేదు. జాన్సన్ డల్లాస్‌లోనే ప్రమాణ స్వీకారం చెయ్యటానికి నిశ్చయించుకొనటం అతని వర్గంవారికీ, కెన్నెడీ వర్గంవారికీ మధ్య కొంత కోపతాపాలు పుట్టించటానికి తోడ్పడింది. గడిచిన రెండు గంటలలో కెన్నెడీ మనుషులు తమ అధ్యక్షుడిని కోల్పోయారు. అతని దేహాన్ని ఆస్పత్రినుంచి కదపటానికి యమయాతన పడ్డారు. ఎందరో ఒక జీవితకాలంలో తినని దెబ్బలు తిన్నారు. అందరి కోపాలూ ముక్కులమీద ఉన్నాయి. జాన్సన్ వారిని ఎయిర్ ఫోర్స్‌వన్ బదులు పక్క విమానాన్ని తీసుకు పొమ్మంటే వారి బాధ అంత తీవ్రమయ్యేదని అందుకుని ఉండేది కాదేమో. కాని, పాలేకాక, జాన్సన్ కూడా పెద్ద దెబ్బ తిన్నవాడేనని గుర్తించటం అవసరం. ఈ కాలంలో కెన్నెడీ అనుచరులు తమగాయాలని దాచుకున్నారు కొత్త పరిపాలకులతో పోట్లాట పెట్టుకొనటం దేశానికీ, తమని వదిలివెళ్ళిపోయిన మనిషికీకూడా మంచిదికాదని గ్రహించారు.

గాడ్‌ఫ్రే మెక్‌హ్యూగ్ ఒక ఇంజన్ తిరగటం ప్రారంభించటంతో తక్కినవన్నీ కూడా మేలుకుని విమానం ఎగిరిపోతుందనుకున్నాడు సాధారణంగా అయితే ఇది జరిగేదే కాని, కిల్డఫ్ సిగ్నల్ ఇవ్వందే విమానం కదలటానికి వీలులేదు

అతను జాన్సన్ అక్కడే ప్రమాణం స్వీకారం చేస్తాడని తెలుసుకుని, అంతదాకా విమానం కదలరాదని నిశ్చయించుకున్నాడు. నేరుగా పయిలట్ గదిలోకి వెళ్ళిపోయాడు దారిలో మెక్‌హ్యూగ్‌ని గమనించలేదు అతను, ఆ హడావుడిలో!

'ఆపు!' అన్నాడు పయిలట్‌స్విండాల్‌తో అత నెవరో స్విండాల్‌కి తెలుసు మాట్లాడకుండా స్విచ్ వయిపుకి చెయ్యిజాపాడు. క్షణాలలో మెక్‌హ్యూగ్ లోపలికివచ్చి, 'టేక్ ఆఫ్! అధ్యక్షుడు ఎక్కాడు!' అన్నాడు

'వీల్లేదు!' అన్నాడు స్విండాల్.

'పదమంటూంటే!'

'మిస్టర్ కిల్డఫ్ వీల్లేదంటున్నాడు...'

'ఎవరు ఏమన్నా పరవాలేదు, కదులు!' మెక్‌హ్యూగ్ ఒక జనరల్. స్విండాల్ కర్నల్ తన మాట వినకేమి చేస్తాడని మెక్‌హ్యూగ్ వెనక్కి వెళ్ళిపోయాడు.

జాన్సన్ పడకగదికి అనుకుని ఉన్న బాత్‌రూమ్‌లోకి వెళ్ళి షర్టు మార్చుకున్నాడు. తల దువ్వుకున్నాడు అందువల్లనే మెక్‌హ్యూగ్ అతన్ని కలవలేకపోయాడు. కలిసినా అతని మాట వినేవాడో కాదో! అతని కళ్ళకి లిండన్ జాన్సన్ ఇంకా ఉపాధ్యక్షుడే. అతను ఆజ్ఞ జారీ చేస్తే పట్టించుకుని ఉండకపోవచ్చు.

వెనక శవపేటిక గదిలో శ్రీమతి కెన్నెడీ, 'ఉక్కపోస్తోంది, బయలుదేరుదామా?' అన్నది.

'చెప్పలేదూ!' అని అడిగాడు కెన్ వోడానెల్ మెక్‌హ్యూగ్‌ని

'చెప్పాను కాని మెక్ కిల్డఫ్ ఇంకేదో చెప్పినట్లున్నాడు. మళ్ళీ వెడతాను'

దారిలో కిల్డఫ్‌ని కలిశాడు! కిల్డఫ్ ఫొటోగ్రాఫర్ ఏర్పాటులో మునిగిఉన్నాడు. చాలా హడావుడిగా తిరుగుతున్నాడు

'ఏమిటిదంతా?' మెక్‌హ్యూగ్ అడిగాడు.

'పత్రికల వాళ్ళకోసం చూస్తున్నాము.'

'వాళ్ళ మొహం! మనం పోవాలి!'

'లేడీబర్డ్ సామానులు ఇంకా రాలేదు'

'అదేమిటి? ఆవిడ సొంత విమానం లేదూ?'

'లేదు ఇక్కడే ఉంది. టెక్సాస్ జడ్జి కోసం చూస్తున్నాము ఒక ఆడమనిషి'

మళ్ళీ వెనకగది కెన్‌వోడానెల్ మెక్‌హ్యూగ్‌ని అడిగాడు. 'ఏమయింది?'

'అదే అర్థం కావటంలేదు. ఒక ఆడ జడ్జికోసం, విలేఖరులకోసం, శ్రీమతి జాన్సన్ సామాన్లకోసం ఆగుతున్నాముట!' మెక్‌హ్యూగ్‌కి తనమాటలు తనకే అబ్బెట్టుగా వినిపించాయి కాని, విన్నది చెప్పగించాడు.

వోడోనెల్ ముఖం బిగుసుకుంది. 'ఇప్పుడే బయల్దేరుతున్నాము' అన్నాడు.

'ఈసారి నిజంగానే బయల్దేరుదామ్మ,

అన్నాడు మెక్‌హ్యూగ్ కొంత కటువుగా. స్వీండాల్‌ని తప్పుకోమని తనే విమానం నడపగలడు, అవసరమయితే.

దారిలో కొంచెం సందేహించాడు. మిసెస్ జాన్సన్ విమానంలో ఉందంటున్నారు. బహుశ జాన్సన్ కూడా ఉన్నాడేమో! ఎట్లాగయితేనేమి మెక్‌హ్యూగ్ విమానం కదలక పోవటానికి కారణం తెలుసుకున్నాడు.

సేపీ తీరే అవకాశం లేదు కెన్నెడీ వర్గం వారు తమ నాయకుడు పడిపోయినా అతనే విమానం ప్రధాన ప్రయాణీకుడు అనుకున్నారు అతను ఆజ్ఞలు ఇవ్వలేదు కాబట్టి శ్రీమతి కెన్నెడీ నాయకత్వాన్ని గుర్తించారు జాన్సన్ వర్గంవారు అతని ఆజ్ఞకోసం ఎదురు చూస్తున్నారు. 'బాస్ వెళ్లమని చెప్పినప్పుడు, అప్పుడు వెడదాము,' అన్నాడు యంగ్‌బ్లడ్ లెమె జాన్సన్‌తో.

మెక్‌హ్యూగ్ మళ్లీ ముందుకి వెళ్లాడు. దారిలో కిల్డఫ్ కనిపించాడు. 'వెంటనే బయలుదేరాలి!' అన్నాడు ఆవేశంతో.

'ముందు జాన్సన్ ప్రమాణస్వీకారం చెయ్యాలి' అన్నాడు కిలఫ్,

'జాన్సన్ ఇక్కడ లేడు. రెండో విమానంలో ఉన్నాడు.'

'అయితే ఆ అరడుగుల టెక్సాస్ మనిషితో తను లిండన్ జాన్సన్ కాడని చెప్పు' అన్నాడు కిల్డఫ్. 'అధ్యక్షుడు ప్రమాణంచేసే దాకా మనం కదలపోయేది లేదు'.

మెక్ హ్యూగ్ మొహం ఎర్రబడింది విమానం వెనుక భాగం వయిపు చూపిస్తూ, 'నా కొకడే అధ్యక్షుడు ! అయన కాబిన్‌లో ఉన్నాడు.' అని అరిచాడు.

విమానం రాజధాని చేరే ముందు ఈ మాటలు అందరికీ తెలిసిపోయాయి. కొందరు మెక్ హ్యూగ్‌ను పొగిడారు. జాన్సన్ వాటిని విని హర్షించి ఉండజాలడు

శ్రీమతి కెన్నెడీ పడక గదిలోకి వచ్చింది. జాన్సన్ దంపతులు పరామర్శకని వచ్చారు. జాన్సన్ ఆమెని 'హనీ' అని పిలిచి, చుట్టూ చెయ్యి వేసి విచారంగా తల ఆడించాడు. మాటలు భార్య వంతు అని వదిలివేశాడు. శ్రీమతి కెన్నెడీకి ఆమె అంటే ఇష్టం.

కన్నీటితో మొహం ముడుచుకు పోతూ ఉండగా కొత్త అధ్యక్షుని భార్య, 'జాకీ! ఉపాధ్యక్ష పదవి కూడా అనవసరం అనుకుంటే చివరికి కొంతవని జరిగింది!' అన్నది.

'నేనక్కడ లేకపోతే! అప్పుడక్కడ ఉండగలిగాను, ఆదేవాలు!' అన్నది జాక్వెలీన్ కెన్నెడీ

జాన్సన్ మవునం సరయినదే. శ్రీమతి జాన్సన్ చాలా మర్యాదస్తురాలు. అయినా పొరపాటుగా, 'ఏమనాలో తెలియటం లేదు. పోయిపోయి, మా టెక్సాస్ రాష్ట్రంలోనా ఇది జరగాలి!' అన్నది వెక్కిళ్ల మధ్య.

వెంటనే ప్రాంతీయ దురభిమానానికి ఇది సమయంకాదని గ్రహించింది. 'అన్న వెంటనే చింతించాను,' అన్నది ఆమె తర్వాత కెన్నెడీ మరణం కన్నా ఈ అభిమానం గొప్పదికాదు. శ్రీమతి జాన్సన్ కళ్లు దించేసుకున్నది. అక్కడే రక్తసిక్తమయిన జాకీ చేతి గ్లవ్స్ కనిపించాయి.

'కొత్త బట్టలు తీసివ్వనా?' అని అడిగింది.



అధ్యక్షుని విమానం లోపలి దృశ్యం.

'వద్దు,' అన్నది శ్రీమతి కెన్నెడీ 'తర్వాత కావలిస్తే మేరీ గల్లాఘర్‌ని అడుగుతాను. ఇప్పుడు కాదు.'

ముగ్గురూ మంచం మీద కూచున్నారు. శ్రీమతి కెన్నెడీ మధ్య కూర్చున్నది.

'లిండన్', అని మొదలుపెట్టిన ఆమె మధ్యలో హటాత్తుగా ఆగిపోయింది. 'క్షమించాలి! మళ్లీ అలా పిలనను. మిస్టర్ ప్రెసిడెంట్!'

'హనీ, నువ్వలాగే పిలుస్తూ ఉండు,' అన్నాడు అతను.

ఆమె మాట్లాడలేదు ఏమనాలో తెలియలేదు కొత్త అధ్యక్షుడు — పేరు పెట్టి పిలవరాదు అనుకున్నది .

'ప్రమాణ స్వీకారం. .' అని మొదలు పెట్టాడు అతను.

'అవును, విన్నాను!' ఆమెకి పద్ధతులని గురించి పూర్తిగా తెలుసు ప్రమాణ స్వీకారం ఎక్కడయినా జరగవచ్చు. ఈ విమానం మీద నయినాసరే. అంత [illegible] జరగపోతున్నట్లున్నది. 'ఇప్పుడేమి జరుగుతుంది?'

'నాకు తెలిసిన జడ్జి ఒకామె ఉంది, కబురుపెట్టాను జడ్జి హ్యూగ్స్—గంటలో వచ్చేస్తుంది. ఇంతలో కాసేపు పడుకో. మేము వెళ్లిపోతాము,' అన్నాడు అతను.

'సరే,' అన్నది శ్రీమతి కెన్నెడీ యాంత్రికంగా.

వంటరిగా మిగిలిపోయింది తను గదిలో. కొంతసేపు సిగరెట్లు కాల్చింది. శూన్యంలోకి అలా చూస్తూ ఉండగా జాన్సన్ మాటల అర్థం తెలిసింది — ఒక్క గంట సేపా! ఆగాలా! భగవంతుడా!— అనుకున్నది

జాన్సన్‌ని చూసిన మెక్‌హ్యూగ్ అతన్ని కలవటం పొరపాటున తప్పిపోయిందని గ్రహించాడు. ప్రమాణస్వీకారం విమానం ఎగురుతూ ఉండగా ఎందుకు చెయ్యరాదు, అని అడిగాడు అది సవ్యమయిన ప్రశ్నే. కాని, సరయిన సమాధానం దొరకలేదు. సరికదా ఫొటోగ్రాఫర్ల పని గురించిన చర్చ ఒకటి మొదలయింది

జరగపోయే సంఘటన గురించిన ఆలోచనలు అందరి తలలోనూ మెదులుతున్నాయి శ్రీమతి కెన్నెడీ కూడా దాన్ని గురించే ఆలోచిస్తున్నది తన కోసం చలవ బట్టలు తీసి సిద్ధంగా ఉంచారు అంటే తను ప్రమాణస్వీకారం జరిగేటప్పుడు శుభ్రంగా కనిపించాలన్నమాట

జాన్సన్ తన వస్త్రాల విషయంలో చాలా శ్రద్ధ తీసుకున్నాడు. ఇందులో అసభ్యమేమీలేదు కొత్త అధ్యక్షుడు పదవి స్వీకరించేటప్పుడు, అమెరికన్ ప్రభుత్వం నిలకడ నిరూపించేందుకు తను ఎంత లక్షణంగా కనిపిస్తే అంత మంచిది.

* * *

# అధ్యక్షుని మరణం

జడ్జి సారాహ్యూగ్స్ వచ్చింది. జాన్సన్, 'ప్రమాణ స్వీకారంలో పాల్గొనాలనుకునే వారంతా పాల్గొనవచ్చు' అన్నాడు ఎవరూ వినపడలేదు. కెన్నెడీ హత్య టెక్సాస్‌లో జరిగింది. టెక్సాస్ వారందరూ అప్పుడు అంత ఆకర్షవంతంగా కనిపించలేదు, చాలా మందికి అందుకనే ప్రమాణస్వీకారం బొమ్మలలో కెన్నెడీవారు ఎవరూ కనిపించలేదు. (ఇది సరికాదు మాంచెస్టర్ పొరబడ్డట్లు తర్వాత తెలిసింది — అనువాదకుడు) ఉన్నవారు కూడా ఇతరుల మరుగున నుంచున్నారు స్వీండాల్ తన ముఖాన్ని రాయ్ కెల్లర్‌మాన్ వీపు వెనుక దాచుకున్నాడు. 'ఆ బొమ్మలో పడాలని నాకు అనిపించలేదు నేను లిండన్ జాన్సన్ జట్టులోని వాడిని కాను నా అధ్యక్షుడు ఆ శవపేటికలో ఉన్నాడు' అన్నాడు తర్వాత.

అధ్యక్షుడు జాన్సన్‌కి న్యాయం జరగలేదు అతనిది సున్నిత మనస్తత్వం. అదీ కాక, అధ్యక్షుడికి ఇది అగౌరవం.

ఆ విమానంలో ఇద్దరు అధ్యక్షుల పరివారాలు ఈ రెండూ మూడు సంవత్సరాల క్రితం (జాన్సన్ కూడా అధ్యక్ష పదవి నామినేషన్‌కి ప్రయత్నించినప్పుడు) పోట్లాడుకున్నారు పోట్లాట తప్పలేదు అక్కడ



దుర్మార్గుడెవరూ లేడు దుర్మార్గుడు కింద పోలీసు కేంద్ర కార్యాలయంలో ఉన్నాడు.

మరొక గంటలో ఫోటోగ్రాఫర్ స్టాఫ్‌టన్ ఒక బొమ్మని తయారు చేశాడు. అది దేశమంతటా విడుదల అయింది అందులో బాధతో నిండిన శ్రీమతి కెన్నెడీ ముఖం అందరికీ కనిపించింది, ప్రమాణం తీసుకుంటున్న మనిషికి ఆమె అక్కడ ఉండటం చాలా అవసరం అనుకున్నాడు. అందరికీ చెప్పాడు కూడా, చివరికి ఆమె రానే వచ్చింది అయితే, తన నిర్ణయం ఆమె స్వయాన తీసుకున్నది అధికారానికి కొన్ని చిహ్నాలు అవసరం, ఒక ఘోర ప్రమాదం తర్వాత జాతీయ గాంభీర్యం ప్రదర్శించటం దేశానికి మంచిది అందుకనే ఆమె వచ్చింది

జాన్సన్ ఆమె రాక కోసం ఆదుర్దాగా ఎదురు చూస్తున్నాడు రాగానే జడ్జి సారా హ్యూగ్స్‌కి పరిచయం చేశాడు తన ఎడం వయిపు నుంచో పెట్టుకున్నాడు

'ఇది సరేనా?' అని అడిగాడు ఫొటోగ్రాఫర్‌ని అతను తనకి నచ్చినట్లు అందరినీ సర్దాడు, చెమటలు కక్కుతూ

ఇంతలో ఎవరో, 'బైబిల్ ఏదీ'? అని అడిగారు అందరూ ఒకరి ముఖాన్ని ఒకరు చూసుకున్నారు జో అయిర్స్‌కి కెన్నెడీ తన గదిలో దాచుకున్న బైబిల్ గుర్తుకి వచ్చింది రోజూ రాత్రి పడుకునే ముందు చదివేవాడు

అది తోలు బయిండింగ్ కలది. జె.ఎఫ్.కె అనే అక్షరాలు పొదిగినది

సారాహ్యూగ్స్ సందేహించింది. అది కాథలిక్ బైబిల్ అయి ఉండవచ్చు. కాని, వెంటనే ఫరవాలేదనుకుంది.

ఎందరో ప్రమాణస్వీకారాన్ని పట్టించుకోవటంలేదు స్టాఫ్‌టన్ చెమటతో ముద్దయి పోతున్నాడు కెమెరా సరిగ్గా పని చెయ్యటంలేదు. మొదటి బొమ్మ రాలేదు కెమెరా శబ్దం వినిపించక పోవటంతో అక్కడ పెద్ద నిశ్శబ్దం ఆవరించింది కంగారుగా కెమెరాని ఎలాగో సరిచేశాడు. 'క్లిక్' మన్నది.

కెన్‌వోడాన్నెల్ బయట బోనులో పులిలాగ పచార్లు చేస్తున్నాడు. —శ్రీమతి కెన్నెడీని వాడేసుకుంటున్నారు! —అనే ఆలోచన అతని బుర్రలో తిరుగుతోంది. ప్రమాణం వినపడకుండా చెవుల మీద చేతులతో కప్పుకున్నాడు.

* * *

గది చిన్నది అందరి దేహాల వేడి దుర్భరంగా ఉంది. ఒక్క శ్రీమతి జాన్సన్ మాత్రం దీనిని గమనించటం లేదు. —ఇదంతా కలలాగ ఉంది అంతా మాయ; మేమంతా నాటకంలో వేసే పాత్రలము, ఇది మా మీదపడే ఏదో భయంకరమయిన భారానికి నాంది, అదేమిటో తెలియదు; కొత్త ప్రపంచంలోకి వెళ్ళిపోతున్నాము; అంతా కల — అనుకుంటున్నది ఆమె. —కాని కల కాదుకదా! —

అధ్యక్షుడు భార్యనీ, జాక్వెలిన్ కెన్నెడీనీ కావలించుకున్నాడు 'ఇక్కడ కూర్చోవాలనీ' అని భర్తని కోల్పోయిన శ్రీమతి కెన్నెడీని ఆమె సీట్లో కూర్చోపెట్టాడు లెమ్ జాన్స్‌తో, 'ఇక కదలచ్చు!' అన్నాడు అధ్యక్షుడి కుర్చీలో కూలబడ్డాడు

జాన్సన్ సూప్ ఆర్డర్ చేశాడు. శ్రీమతి జాన్సన్ బిస్కట్లు కావాలన్నది. శ్రీమతి కెన్నెడీ లేచి నుంచుంది ఎంతో మర్యాదగా, 'క్షమించండి,' అన్నది జాన్సన్ దంపతులకి అమర్యాద అనికాదు కాని ఆమె మనస్సులో ఒకటే ఆలోచన—నేను యిక్కడ ఉండలేను. ఆ గదిలోనే ఉండాలి—

చక చక అక్కడికి వెళ్ళిపోయింది కెన్, లారీ, డేవ్, గాడ్ఫ్రే లు శవ పేటిక చుట్టూ నుంచుని ఉన్నారు తను ఒక సీట్లో కూర్చున్నది కెన్ కూడా కూర్చున్నాడు ఆమె వంక చూశాడు. ఆమె కన్నీరు ఆగలేదు ఆమె ఏడవటం అదే మొదటి సారి. కన్నీరు పొంగాయి. ఎంతో సేపు మాట్లాడలేక పోయింది.

మెట్లు దిగుతున్న జడ్జి సారాహ్యూగ్స్ ఒక అపరిచిత వ్యక్తిని కలిసింది అతనెవరో అధికారి అనుకున్నది అతను ఆమె చేతిలోని బైబిల్‌ని, ప్రమాణం పాఠం రాసి ఉన్న అట్ట ముక్కని తీసుకుని మాయమయి పోయాడు.

అతనెవరో ఇంతదాకా ఎవరికీ తెలియదు. చరిత్రలో ప్రాముఖ్యం సంపాదించుకున్న రెండు వస్తువులని దొంగిలించుకుని వెళ్లిపోయాడు అందులో ఒకటి —బైబిల్— కెన్నెడీ ఆస్తిలో ఒక అతి ముఖ్యమయిన భాగం.

**(ఇంకా వుంది)**

# LitQuiz No 21

# 25,000

| FIRST PRIZE | RUNNERS-UP (UPTO 4 ERRORS) | MINIQUIZ (UPTO 2 ERRORS) |
|---|---|---|
| Rs 12,500 | Rs 7,000 | Rs 4,500 |

FAMINE RELIEF FUND Rs 1000

అందుటకు ముగింపు తేది: 7—9—67.
సొల్యూషన్ భారత్ జ్యోతిలో: 10—9—67.
ఫలితాలు భారత్ జ్యోతిలో 24—9—67.
* సొల్యూషన్ వెంటనే పొందుటకు 6 పైసల స్టాంపు, స్వంత అడ్రసుగల కార్డును వెంటనే పంపవలెను *లిట్‌క్విజ్ వీక్లీ చందాదారులకు రు 1 పంపవలెను * మీ ఎంట్రీలను 6-9-67 బుధవారమునాడు కూడా పంపవచ్చును కాని వాటిని ఎక్స్‌ప్రెస్ డెలివరీలో పంపవలెను

———లిట్‌క్విజ్ నెం. 21 అధికార ఎంట్రీఫారము———

ADDRESS
LITQIZ No 21, ALANKAR, BALARAM ST , BOMBAY-7 (WB)

షరా - (1) ఒక్కొక్క కాలంలో మీరు వద్దనే పదమును కొట్టివేయండి (2) ఒక కూపన్‌మాత్రం పంపినచో రెండవకూపన్ కొట్టి వేయండి (3) ఎంట్రీరుసుము M O ద్వారా పంపినచో, పోస్టాఫీసునుండిపొందిన M O రసీదును ఎంట్రీఫారమునకు జతపరచవలెను M O రసీదు లేని ఎంట్రీ నిరాకరించబడును (4) I P O క్రాస్ చేయవద్దు అది లిట్‌క్విజ్ నెం 21 బొంబాయి-7 వారికి చెల్లించునట్లు ఉండవలెను

| 1 | Re. 1 | | 2 | Re. 1 | |
|---|---|---|---|---|---|
| 1 | AGITATION | EDUCATION | 1 | AGITATION | EDUCATION |
| 2 | CONTENTMENT | DETACHMENT | 2 | CONTENTMENT | DETACHMENT |
| 3 | DESIRES | PLEASURES | 3 | DESIRES | PLEASURES |
| 4 | DIVINE | FEMININE | 4 | DIVINE | FEMININE |
| 5 | ECONOMY | POLITY | 5 | ECONOMY | POLITY |
| 6 | FREEDOM | WISDOM | 6 | FREEDOM | WISDOM |
| 7 | FREELY | TRULY | 7 | FREELY | TRULY |
| 8 | HAPPY | HIMSELF | 8 | HAPPY | HIMSELF |
| 9 | MATERIAL | ORIGINAL | 9 | MATERIAL | ORIGINAL |
| 10 | PEOPLE | RELIGION | 10 | PEOPLE | RELIGION |
| 11 | PERSONAL | POLITICAL | 11 | PERSONAL | POLITICAL |
| 12 | PROSPERITY | STABILITY | 12 | PROSPERITY | STABILITY |
| 13 | RACIAL | RELIGIOUS | 13 | RACIAL | RELIGIOUS |
| 14 | RUINS | RULES | 14 | RUINS | RULES |
| 15 | SPIRITUAL | UNIVERSAL | 15 | SPIRITUAL | UNIVERSAL |
| 16 | VALUES | WAYS | 16 | VALUES | WAYS |
| 17 | WANT | WITHIN | 17 | WANT | WITHIN |

21 SEND THESE 2 COUPONS & ENTER MINIQUIZ FREE

MiniQuiz

10 CLUES FREE COUPON

| | | | |
|---|---|---|---|
| AGITATION | EDUCATION | HAPPY | HIMSELF |
| CONTENTMENT | DETACHMENT | RACIAL | RELIGIOUS |
| ECONOMY | POLITY | SPIRITUAL | UNIVFRSAL |
| FREEDOM | WISDOM | VALUES | WAYS |
| FREELY | TRULY | WANT | WITHIN |

21 (ASVP)

ఈ క్విజ్ ప్రవేశమునకు చెందిన నిబంధనలు షరతులను పాటించుటకు అంగీకరిస్తున్నాను మరియు కాంపిటీషన్ ఎడిటరు గారి నిర్ణయమును తుది నిర్ణయముగాను, న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఆమోదిస్తున్నాను ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు 1/- ఈ పూర్తి ఎంట్రీ ఫారం ఎంట్రీ ఫీజు రు 2/- M O రసీదు/ I P O /లిట్‌క్విజ్ క్యాష్ రసీదు/ప్రైజు కార్డు జతపరుస్తున్నాను వాటి నెం . ..... ...... ....

CAPITAL LETTERS

NAME.. . ...... .. .... ... .. .. .. .. . ...

ADDRESS. ........... ...... . . . . ...

............... . .. ...... .. .. .. . .. ...

——— ఈ పూర్తి ఫారమును కత్తిరించి పంపవలెను ———

## 17 CLUES

1 Election time is obviously a time of intense political activity and mass **Agitation/Education**,

**Contentment/Detachment** is the real fountain of happiness

Our **Desires/Pleasures** are always changing.

4 Devotion, Love and Service are **Divine/Feminine** terms They are the attributes of the Divine Mother of the universe

5 The central problem of the Indian **Economy/Polity** is the problem of poverty

6 Democrats cannot afford to regard themselves as sole custodians of **Freedom/Wisdom**

7 It is the basis of Democracy that everybody functions **Freely/Truly** within the law

8 Wherever a man is, in whatever condition he is placed, he wants to be **Happy / Himself**

9 It is impossible to be absolutely **Material / Original** in this age when a vast amount of knowledge has accumulated

10 The early beginnings of practically every **People / Religion** on earth are shrouded in myth and mystery

11 Good education brings freedom from fear, which is essential to make the nation courageous, and helps to realise the value of **Personal / Political** freedom

12 Social **Prosperity / Stability** is not attained by dividing society setting up one against the other, with political motives

13 **Racial / Religious** feeling is one of the most combustible elements in the life of the masses

14 Ours is a country of historic **Ruins / Rules**

15 If a religion is not **Spiritual / Universal**, it cannot be eternal

16 In all ages new ideas, new thoughts, new **Values / Ways** of life have been introduced into our society, though usually subject to the maintenance of some basic principles

17 All activity presupposes restlessness, and restlessness comes from **Want/ Within**

గమనిక - పై కొటేషన్లు గ్రంథకర్తలు, రచయితల పుస్తకముల నుండి తీసుకొనబడినవి అవి పూర్తి వాక్యములు మరియు వేరువేరుగా పూర్తి అర్థవంతమైనవి గ్రంథకర్తల రచయితల పేర్లు, వారి పుస్తకముల పేర్లు అఫీషియల్ సొల్యూషన్‌తోపాటు లిట్‌క్విజ్ వీక్లీలో ప్రచురించబడును



# నీవే గతి గణపతి!



ముద్దా చిట్టిబాబు

ఇదుగో—లావుగా పొట్టిగా వున్న ఈ అవతారం చూశారా? — ఇతని పేరేమిటో చెప్పుకోగలరా? —ఆఁ—అదే—అదే గణపతి ఇతని పేరు గణపతి. గణపతిలాగా పెద్ద బొజ్జ వుంది గాని, పొట్ట పొడిస్తే అక్షరం ముక్క లేదు అక్షరం ముక్క లేకపోయినా, పొట్టనిండా పుట్టెడు బుద్ధులు!

* * *

పక్క ఊరి జమిందారువారు పెద్ద ఎత్తున వైభవంగా గణపతి నవరాత్ర మహోత్సవాలు జరిపిస్తున్నారు ఊరందరికీ విందు. కన, విన, తిన — అంతా వేడుకే! —ఎవరి నోట విన్నా ఇదే విశేషం!

ఈ సంగతి వినగానే గణపతి ఇట్టే ఉక్కిరిబిక్కిరయ్యాడు. నోరూరింది ఎగిరి గంతేశాడు. అయితే, ఒక్కటే సమస్య— విందుకు వెళ్లటానికి కొత్త బట్టలు కావాలే ?—

* * *

'ఓసే, ఓసే — నాకు కొత్త బట్టలు కావాలి...వేగిరం వేగిరం —ప్రయాణం . ప్రయాణం...'

'కొత్త బట్టలేవి మడిబట్టలాలేశా అయినా, చవితి పండగపూటా పూజ చేసుకోకుండా ఎక్కడికీ వెళ్లకూడదు'

'అపశకునం పలక్కే. అసలు నేనే గణపతిని కదా, వేరే, వినాయక పూజ ఒకటా!—'

'అయ్యో అలా అనకండి. పాపం! పాపం!!—'

* * *

'బంగారయ్య బట్టల కొట్టుకి వెళ్లాడు గణపతి.

'బంగారయ్య గారూ! ఖాళ పంచల కదా — మీకు పుణ్యం కావాలా, పాపం కావాలా ?' అడిగాడు గణపతి.

'పుణ్యమే కావాలి ఏం ?—'

'అయితే, మీరు నాకొక పంచెలచాపు ఇవ్వండి ఇస్తే నేను జమీందారు గారింటికి వెళ్తాను కడుపునిండా భోంచేస్తే ఒక బ్రాహ్మడు భోంచేసిన పుణ్యమంతా మీదే!—'

'లేకపోతే ?—'

'లేకపోతే, నాకు విందు భోజనం దొరకదు మీకు పుణ్యమూ దక్కదు పైగా నేను వస్తుంటే ఆ పాపం మీకు చుట్టుకుంటుంది!—'

గణపతి మాటలకు బంగారయ్య ఫక్కున నవ్వాడు. పంచెల చాపొకటి ఇచ్చాడు.

* * *

ముస్తాబయి వెళుతున్న గణపతికి మధ్యలో ఏరు అడ్డం వచ్చింది. పడవ కేవు పది పైసాలు గణపతి పడవ ఎక్కాడు,



ఏరు దాటాడు. 'మళ్ళీ వచ్చేటప్పుడు జమీందారుగారింటి దగ్గర్నించి మంచి లడ్డు వుండ తెచ్చి పెడతానే' అని చెబుతూ పరుగు తీశాడు, గణపతి.

* * *

జమీందారుగారింట్లో సుష్టుగా భోంచేశాడు గణపతి. బేవ్ మని త్రేన్చాడు. చెంబుతో రెండు లడ్డుండలు వేసుకు బయల్దేరాడు. అయితే, నడవటం కాస్త కష్టంగా వుంది.

ఐదు పైసలు దక్షిణ రొండిని దోపుకుంటూ వుండగా ఘుమ్మమని కమ్మటి వాసన కొట్టింది. 'ఆహాహా!—' అంటూ. అదే దిక్కుగా వెళ్లాడు, గణపతి అక్కడ వన్యం తాజాగా మారుతున్నారు.

'వన్యం! — అవశ్యం' అంటూ ఐదు పైసా లిచ్చి ముక్కుపొడి కొన్నాడు.

* * *

వస్తూ వుంటే కిరాణాకొట్టు తగిలింది. కదల్లేక అక్కడ కూలబడ్డాడు గణపతి.

'కడుపు భారంగా వుంది, చిన్న శొంఠి ముక్క ఇయ్యవయ్యా సావుకారూ!'

'ఇదండి.'

శొంఠి ముక్క కర కర నమిలేశాడు, గణపతి

'ఐదు పైసా లిచ్చేస్తుండి, చాతుర్మ్యా గోరూ!—'

'పైసాలు లేవే సావుకారూ! —అయిదు పైసాలుంటే ఇప్పుడే ముక్కుపొడుం కొనేశా.'

తెల్లబోయాడు, సావుకారు.

* * *

కాస్సేపు అక్కడే విశ్రమించాడు గణపతి ఘుమ్మాయాసం తీరింది. చూస్తే—చేతిలో

చెంబు మాయమైపోయింది! — సావుకారు గణపతితో 'నా డబ్బులిచ్చి పట్టుకెళ్లవయ్యా!' అన్నాడు ఖచ్చితంగా

'నాకేంలే ఆచెంబు నాదికాదు పోలీసులు చూస్తే నిన్నే పట్టేస్తారు జాగ్రత్త!' అంటూ పోబోయాడు, గణపతి.

బెదిరిపోయి, సావుకారు గణపతి చెంబు ఇచ్చేశాడు.

* * *

ఇంటిదోవ పట్టాడు గణపతి మళ్లీ కమ్మటివాసన తగిలింది. అన్నట్టు—చెంబులో దాచిపెట్టిన రెండు లడ్డూలు ఉన్నాయి కదూ? —ఏటి దగ్గరికి వచ్చేటప్పటికి ఒక లడ్డూ పూర్తిగా గుటకాయస్వాహా అయింది.



రెండోదాంట్లో చిన్నముక్కమాత్రం మిగిలింది. ఆ కాస్త బల్లకట్టు పాపన్న చేతుల్లో పెట్టాడు.

'ఈ కూస్తంతేనా? నాకొద్దు' అంటూ విసిరికొట్టాడు

'మళ్లీ మాటు ఇస్తానే పూర్తిలడ్డు ఈసారి ఏరుదాటించెయ్, బాబ్బాబూ!—'

'అదేం కుదరదు పదీ పదీ ఇరవై పైసోలు పట్టుకురా, లేకపోతే దాటించను' అనేశాడు, పాపన్న.

ఏం పాలుపోలే, గణపతికి ఇన్ని విఘ్నాలకు కారణం ఏమిటా అని తీవ్రాలోచనలో పడ్డాడు

* * *

పక్కనే చెట్టుకింద వినాయకుడి విగ్రహం అగపడింది.

'అన్నా ఓ వినాయకా!—నువ్వేనేమ, నేనే నువ్వు నీ ప్రసాదంకోసమే కద ఇన్నిపాట్లు అవస్థలు పడ్డాను?—ఎందుకు నామీన ఇంతకోపం? క్షేమంగా నన్నింటికి చేర్చేభారం నీదే!—నీవేగతి గణపతీ!—అంటూ వేడుకున్నాడు.

వినాయకుడికి దయకలిగింది మన గణపతికి చక్కటి ఆలోచన తట్టింది.

మళ్లీ బల్లకట్టు దగ్గరికి వచ్చాడు.

* * *

'ఓ పాపన్నా!—ఇదుగోచూడు— నే నివ్వాడు ఈఏట్లో దూకేస్తున్నా నీకు పాపం చుట్టుకుంటుంది. తప్పదు' అంటూ నదిలో దిగాడు.

పాపన్న భయపడ్డాడు గణపతిని ఏరు దాటించాడు.

* * *

సురక్షితంగా గణపతి ఇల్లుచేరుకున్నాడు.



తక్షణంగా వినాయకుడి పూజ చేసుకుని మళ్లీ సుష్టుగా భోజనంచేశాడు. కానీ చంద్రుణ్ని చూస్తే నీలాప నిందలు వస్తాయని గట్టిగా కళ్లుమూసుకుని గుర్రుపెట్టి నిద్రపోయాడు!—

నీతి: —అపాయంలో ఉపాయానికి వినాయకుణ్ణి తలవండి!! ●









# మట్టిబొమ్మలు



సీరియల్

తాడిగిరి పోతరాజు

### జరిగిన కథ

వెంకట్రామయ్యగారు వో హైస్కూలు సంస్థాపకులు ఆయన కుమారుడు మధు. వారింట్లో పెరిగిన అనాథ ప్రసాద్. ఆ స్కూల్లో పనిచేసే హెడ్మాస్టరు కామయ్య ఆయనకు ఆప్తమిత్రులు ప్రసాద్ తనని గుర్తించక పోవడంతో అంతకంతకు మధుకు దగ్గరవుతూ వుంటుంది కామయ్య మాస్టారమ్మాయి శారద. గ్రామంలో పంచాయతీ ప్రెసిడెంటు ఎన్నికకోసం చర్చజరుగుతుంది. ప్రత్యర్థి వర్గంలోని కామయ్యమాష్టారి మీద శివరామయ్య నిందలుమోపి, స్కూల్లోనుంచి తొలగిస్తాడు ఆయన పాత ఉత్తరాలు తిరగేస్తూండగా వెంకట్రామయ్య రాసిన ఉత్తరం కనిపిస్తుంది. అది చదివి కర్తవ్యాన్ని గుర్తుతెచ్చుకుని శారదను ప్రసాద్‌తో వివాహానికి అంగీకరించమంటాడు.

## 22

దుఃఖంతో ఆమె క్రుంగిపోనారంభించింది హఠాత్తుగాలేచి తండ్రిని కౌగలించుకొని ఏడుస్తూ ఆతని గుండెపై తన శిరస్సును ఆన్చి తన హృదయాంతరాళములలోని రహస్యవేదనలను వెళ్ళబోసిగోవాలనే అనుభూతి కల్గింది. దీర్ఘశ్వాసతో ఆమె వక్షఃస్థలం ఎత్తుగా ఉబ్బింది. పెదవిని కరచి పట్టుకొని కిటికీకేసిచూస్తూ తన అంతర్యాని పైకి పొక్కనివ్వకుంది.

'ఈ విషయంలో మీరు ప్రసాద్‌ను కూడ అడిగి ఆలోచించండినాన్నా' అన్నది.

'అంత అవసరంలేదమ్మా!... ప్రసాద్... అంతర్యం నాకు తెలుసు... అయినా అతను అంగీకరించడేమో అనుకోటానికికూడ నాకు కారణాలేమికనిపించటంలేదు ... ఎందు కలా అడిగావ్?'...సందేహాస్పదంగా ముఖం పెట్టుకొన్నాడు.

'ఏమీలేదునాన్నా!...అడిగితేమంచిదికదాని ...అయినా ఇప్పుడేమంత తొందర వచ్చింది నాన్నా'... ముందుకువంగి ప్రశాంతమైన కంఠంతో అడిగింది.

'శారదా' ... ఆవేదన ఉట్టిపడుతూన్న గొంతు విని ఆమె చప్పున తలెత్తిచూసింది.

'ఈ గుండెజబ్బుతో ... నేను చానాళ్ళు బ్రతకనుతల్లీ...నేను మంచాన పడకముందే ఈ శుభకార్యం ఒకటి నా చేతులమీదుగా జరిగితే నేను నిశ్చింతగా పోతాను ... ఇక పెళ్లివిషయం...మీచేతుల్లో పెడుతున్నాను... మీకు నేను మిగల్చగల్గింది ఈ ఇలు మాత్రమేతల్లీ'...రోజులిలా వస్తాయని నేను ఎప్పుడూ ఊహించలేదమ్మా? ...' ఆగిఆగి మాట్లాడుతున్న ఆయన కంఠం రుద్ధమైపోసాగింది. దైన్యం — వేదనా ప్రస్ఫుటమౌతూన్న అతని కనుపాపల్లో నీరు గిర్రున తిరిగింది.

తండ్రిని క్రుంగదీస్తూన్న మనోవ్యధను అవగతంచేసికొని తల దించేసుకొంది. రెండు మూడు నిముషాలు ఇరువురూ మౌనంగా కూర్చున్నారు. కరుడు గట్టిన నిశబ్దత కాలాన్ని కబళించసాగింది. ఇంకొక నిమిషం అలానే మౌనంగా కూర్చొని పెదవులు విప్పింది —'మంచిదినాన్నా ... మీ ఇష్టం'... అనకల్గింది.

'అమ్మా... శారదా ... నీవు నీ వివాహ విషయంలో ఇంత చక్కని నిర్ణయానికొచ్చినందుకు నాకెంతో సంతోషంగా ఉందమ్మా!' ఆయనముఖంలో సంతోషరేఖలు కనిపించాయి. కట్టలు తెంచుకు వస్తూన్న ఆనందోద్వేగంలో లేచి నిలబడి— 'నీవూ ప్రసాద్ నా కళ్ళముందే ఉంటారు...నీవు ఎక్కడికి వెళ్ళవ్ కదూ నన్ను విడిచి' అంటూ శారద తలను తన ఛాతిపై ఆన్చుకొని ఆమె తలను నిమరసాగాడు.

శారద కనురెప్పలు మంచులో తడిసిన మల్లెపువ్వుల్లా కన్నీటితో మిలమిలలాడాయి.

* * *

ఆవేళ అచ్చమ్మగారు కోడికూతతోనే ప్రక్క దిగింది. జీతగాళ్ళందరినీ 'దరిద్రపు నిద్ర లేవండ్రా' అంటూ పెద్ద పెద్దగ కేకలుపెడుతూ నిద్రలేపింది. కప్పెరకప్పెర చీకటిఉండగనే పనులు ప్రారంభించారు. పెళ్ళి ఇంకా నాల్గురోజులుందనంగానే హడావుడి మొదలైంది. అంతా సందడిగా— రద్దీగా ఉంది.

ఇంట్లోఉన్న సామానంతటిమీదా పాత బట్టలుకప్పి పనిమనుషులు బూజు దులపటం మొదలెట్టారు. అరుగుక్రింద చాకళ్ళు నాల్గుగాబులనిండా సున్నపు రాళ్లుపోసి నానబెడుతున్నారు. బయట పందిరికోసమై ఇద్దరు ముగ్గురు గాతాలు తియ్యటం ప్రారంభించారు. అందరికీ అన్ని పనులూ పురమాయించేప్పటికే భళ్ళున తెల్లవారింది

సూర్యుడు ఎర్రగా గుండ్రని నిప్పుముద్దలా కొండప్రక్కగా తొంగిచూస్తున్నాడు.

'ప్రొద్దు పొడవనే పొడిచిందిగదరా!... ముదనష్టపుముండాకొడుకుల్లార... లేవండ్రా ...లేవండ్రా, అని నెత్తి నోరూ కొట్టుకొంటే, ఇప్పటికిలేచారు ... అరేయ్ — వీరాయ్...తాటాకు కొట్టమని చెప్పొచ్చావా నంబూరుపోయ్,' ... ఆమె అరుగుమీద నిలబడి అరిచింది.

'మొన్ననే చెప్పొచ్చా ... వేకువజామున బళ్ళుకూడ తోలకపొయ్యారు ... ఈపాటికి బళ్ళు తిరిగిరావచ్చు' ఆవు వెనకకాళ్ళకు దాయకడుతూ వాడు సమాధానమిచ్చాడు.

'ఆ...ఇదుగో మీరు నేనొచ్చేప్పటికల్లా గాతాలు కానిచ్చి పందిరి పూర్తిచెయ్యాలి... ఒరేయ్ చాకలి— లేవరా... నానిందాకా ఆ గాబు కెదురుగ్గా కూర్చోకపోతే కుంచెలు కట్టుకోలేవురా ... ఈ వేళ సాయంత్రానికి సున్నం కొట్టటం పూర్తిగావాలి... పనికాకపోతే ఇంకిద్దర్ని పిలుచుకురా' అంటూ

ఆమె బూడిద కచ్చిక పసాపసా నమిలి వేలితో అటూ ఇటూ తిప్పి పండ్లు తోమానని సంతృప్తి పడింది. ముఖం మాత్రం శుభ్రంగా కడుక్కొని పమిట చెరగుతో తుడుచుకొని లోని కెళ్ళింది. తలకు నూనె పెట్టుకొని దువ్వినట్లు గోళ్లతో అలా అలా సర్దుకొని మున్నగా చేతులతో అదుము కుంది.

భోషాణం దగ్గరికెళ్ళి నగలూ—నోట్ల కట్టలన్నీ ఒకసారి చూసికొని తాళంవేసి లాగి చూసుకొంది. దానిపై అంటించిన 'లక్ష్మి' చిత్రాన్ని చూసి దణ్ణం పెట్టి లెంపలేసుకొంది. తాళాలను చీరె చెరగున కట్టుకొని జాగ్రత్తగా బొడ్లో దోపుకొంది

ఏదో తొందర పనులున్నట్టు కంగారు కంగారుగా ఆమె అరుగు దిగుతూ 'ఇదిగో— జానకమ్మా... అబ్బాయిలేస్తే...నేను వచ్చే వరకూ గుంటూరు పోవద్దని చెప్పు'... అంటూ మెట్లుదిగి విసవిసా నడుచుకొంటూ ప్రక్కవీధి కెళ్ళింది.

అక్కడ ఊర్మిళను పెళ్ళికూతుర్ని చేస్తున్నారు.

శుభ్రంగా అలికి ఆరుబయట ముగ్గు గీశారు. నవధాన్యాలూ తెచ్చి ముగ్గుచుట్టూ పోశారు. ఊర్మిళను ఇద్దరు ముదితలు గారాబంగా తీసికొచ్చి పీటపై కూర్చుండ బెట్టారు.

సిగ్గు ముంచుకురాగా, తల పైకెత్త లేక, మోకాటిపై తన చుబుకాన్ని ఆన్చుకొని కూర్చుంది నవ వధువు. శరీరమంతా పసుపుతో నలపసాగారు అమ్మలక్కలు. నలుగు పెడుతున్నంతసేపూ వరసైన మరదళ్ళు జానపదమైన పెళ్లిపాటలు పాడారు. నవ్వించారు—కవ్వించారు. ఛలోక్తులు విసిరారు—ఆపైన లేవదీసి స్నానం చేయించారు.

కొత్తచీర, రవికా కట్టించి నగలు పెట్టారు, కురులు దువ్వి వాలుజడ వేశారు. కాళ్లకు పారాణి పూశారు. కళ్లకు కాటుక గీశారు. బుగ్గపై చుక్క దిద్దారు.

పాయసం తినిపించారు.

ఆశీర్వాదాలు చేశారు.

అచ్చమ్మగారు కోడలికేసి కన్నార్పకుండ చూసింది. ఈ సంతోష సమయంలో పాల్గొనాలనే తను తహతహ లాడుతూ



శొక్కాలు తొడుక్కొని వచ్చింది.

సహజంగా అందమైన ముఖం.

కాటుకరేఖలు దిద్దటం వలన కొత్త కళ వచ్చింది.

కంఠానికి గంధం పూసికొని, కొత్త చీర— రవికా — ఆభరణాలతో వింతుగా కుంకుమపు బొమ్మలా ఉంది ఊర్మిళ.

'పెళ్లి—కళ వచ్చిందే...అదృష్టవంతు రాలివి' అంటూ బుగ్గలు రాకి తలలో మెటికలు విరుచుకొంది,

'వస్తానే ఊర్మిళా ... పిక్కాడ పను లక్కడే ఉన్నాయ్...అ...నాన్న గుంటూరు పోయి వచ్చాడా?...'

'నిన్న రాత్రేవచ్చాడు...' కళ్ళు కాటుకెప లాడించుకొంటూ అంది.

'అయితే నేపోతున్నా...ఇవ్వాళ వాడి బాబాయిగారింట్లో నలుగుపెడ్తామన్నారు... నే నొచ్చేటప్పటికి లేవనేలేదు ...' అనుకొం టూనే త్వరత్వరగా వెళ్లిపోసాగింది.

ఆ మలుపు తిరిగి శివరామయ్యగారింట్లో అడుగుపెట్టబోయ్యేసరికి అతడే డాబా ముందు నిలబడి బజారులోకి చూస్తూ.

'అక్కాయ్...రా...రా ... ఈ శుభరేఖలు ఎవరితో పంపిద్దామా అనుకొంటున్నా ... నువ్వు రానేవచ్చావ్... ఇదిగో...నువు చెప్పి నట్టు వెయ్యిమాత్రమేకొట్టించా...చాలవ్...' అన్నాడు.

'చాలకేం చేసుకోనూ ... కొల్లయి పోతాయి...అందరికీ కబుర్లుపంపామనుకో... శుభరేఖలు పంపలేదనుకొంటారనిగానీ ... అయినా మీ బావ బ్రతికుంటే వాళ్ల కనీ...వీళ్లకని పెద్దపెద్దవాళ్లకుపంపును...' అంటూ పుత్రుని వివాహ శుభలేఖలను పరి శీలనగా అటూ ఇటూ త్రిప్పి చూసి మురిసిపోయింది.

'ఇందులో వాపేరెక్కడుంది ఒకసారి చదువు'...అంటూ కుతూహలాన్ని అణచు కోలేక అతనికి అందించింది.

అతని ముఖం వెలవెలాపోయింది.

ఒక చిన్న సంతకం— మరొక పెద్ద సంతకం— అంటే పూర్తిసంతకం చెయ్య గల్గిన అక్షరాస్యుడనే గానీ అంతకు మినహా ఏవీరాదని ఆమెకు క్షుణ్ణంగా తెలుసు. కానీ తొందరలో సంతోషాన్ని ఆపుకోలేక అలా అడిగింది.

'ఈ క్రిందది—నీ పేరనుకొంటా' అన్నాడు శుభలేఖ క్రిందిభాగం చూస్తూ.

'సరేలే ... అబ్బాయిచేత చదివించు కొంటా...నేనుపోతా' అంటూ ఇల్లంతా కలయ జూసింది.

సున్నాలవి పూర్తిచెయ్యటాన ఇల్లు తెల్లగా కళకళలాడుతోంది. వసారాలో బియ్యం రాసిపోసి పనివాళ్లు రాళ్లుచేస్తు న్నారు. దొడ్డివైపున కొందరు పిండికొడు తున్నారు పాటలు పాడుకొంటూ.

నడి ఇంట్లో గుంటూరునుంచి తెచ్చిన సరకులు చెల్లాచెదరుగా ఉన్నాయి. చాప మీద కొత్తచీరెలూ బట్టలు ఖర్జూరపు పళ్ళూ—ఎండు కొబ్బరిచిప్పలూ— తమల పాకులూ—వక్కలూ ఎన్నెన్నో పసుపుపూసి కొని తాంబూలపుపళ్లాలలో—ఇంటికి పెళ్లి శోభతెచ్చాయి. ఆమె సంతృప్తిగా అన్నిటినీ చూసి.

'నే ... వస్తానబ్బాయ్ ... మరదలితో చెప్పు...లోపల ఏదో పనిమీదున్నట్టుంది .,' అంటూ మెట్లుదిగి మళ్లీ ఏదో జ్ఞాపకం వచ్చినట్లు వెను తిరిగింది. ఏదో రహస్యం మాట్లాడాలన్నట్లు సైగచేసి ప్రక్కకు పిలిచింది.

'నే మరిచేపొయ్యా...పంతులుగారిని పిలు ద్దామా?'...మెల్లగా సందేహాత్మకంగా అడి గింది—గుచ్చిగుచ్చి చూస్తూ.

'పిలవటమెందుకూ? ... ఒక శుభరేఖ పంపిత్తే సరి...రావాలనుకుంటే వత్తాడు... లేకపోతేలేదు'...అంటూ కొద్దిసేపాగి.

'బహుశా రాడనుకొంటా...ఇంకోటి... ఈవారంకాక పైవచ్చే గురువారమే పిల్ల పెళ్లిచేత్తన్నాడు...నువ్వినా్నావా'... అడిగాడు ధోవతి బిగించుకొంటూ.

'విన్నాన్లే...'ఆమె మూతి వంకరగా తిప్పుకొంది.

'వాడు ప్రసాద్ కేగా!...తగిపోయింది... వాడికి ఆస్తిపాస్తులులేవూ...ఇల్లూ వాకిలీ లేదూ...వెనక దిక్కులేదు...వాళ్లకు తప్పితే వేరే ఆధారమెవరూ?...ఇక ఈయనం టావా?...కట్నం కానుక లిచ్చుకోలేడు... గంతకుతగ్గ బొంత...'తుస్కారంగా తీసి పారేసి మాట్లాడింది.

'సరే వస్తారా! ... పంతులు—నీ కెక్కడ కలిశాడు—గుంటూరులోనా?'...

'ఆ... రాత్రి ఆయనా ఆ పెసాదరా ఇద్దరూ వచ్చారు...వాళ్లు దిగిన బస్సుల్లో నే నొచ్చాను...ఏం...ఎందుకూ?...'

'ఏం లేదురా!...అడిగితే రెండుబస్తాలు - బియ్యం ఇద్దామని...'ఏదో పిల్ల పెళ్లిచేస కొంటున్నానంటూ—వస్తాడే'మోననుకొన్నా.. ఊఁ హు...సరే కానియ్యి...వస్తా రా' అంటూ ఆమె పదోసారిచెప్పి మెట్లుదిగింది.

ఇంటికెళ్లేసరికి ముద్దుల కొడుకు ఇంక పక్కదిగలేదని కాఫీ పంపితే చుక్క ముట్టు కోనని శబదంచేసి నిరాహారదీక్ష పట్టాడనీ వార్త చెవినవేశారు.

సిగ్గు పడకుండా కాస్త వినిపించేట్లు మాట్లాడమ్మా!



# మట్టి బొమ్మలు

ఆమె హుటాహుటి మేడమీద కెళ్లింది

పుత్రుడు మంచంపై బోరగిలా పడుకొని దిండులో ముఖం దాచుకొన్నాడు రాత్రి వేసుకొన్న బట్టలు అలానే ఉన్నాయి నలిగిపోయి. గదిలోకి ఆమె వచ్చిన సవ్వడి వినీ కూడ తలతిప్పి ఇటుకేసి చూడలేదు కిటికీలోనుండి ఎండపొడ అతని చెంపపై పడుతోంచి

'అబ్బాయ్ '

. .. ...

'అబ్బాయ్ మధూ ..'

.. ...

'ఒరేయ్ మధూ. '

'ఒరేయ్ ఆమె రెచ్చిపోయి కాళ్లవద్ద దుప్పటిలాగి విసిరికొట్టింది అయినా సమాధానం లేదు. రెప్పలాడించుకొంటూ అటు తిరిగి పడుకున్నాడు ఆమె అతను చూస్తున్న వైపు వెళ్ళింది—ఇటు తిప్పుకున్నాడు తల—ఇటువస్తే మళ్లీ అటుతిప్పుకొన్నాడు

ఆమె విసిగిపోయి కోపం తగ్గించుకొని ప్రేమగా, గారబంగా, మంచంపై కూర్చొని భుజం పట్టుకొని ప్రక్కకు తిప్పటానికి ప్రయత్నిస్తూ.

'ఏమిటీ. నా మీద కోపం వచ్చిందా .. నాతోచెప్పు.. '

చెప్పను—పో—' మరింత బిగునుకు పొయ్యాడు

'లే లే తెలిసిందిలే పెళ్లిబట్టలకు రెండువేలిస్తాననేనా? నీవెన్నంటేఅన్నిస్తా లే నీ ఇష్టప్రకారమే కానివ్వు లే లేచి ఇంత ఎంగిలిపడు లేవరా ? . శుభమా అంటూ పెళ్లిచేస్తుంటే కళకళలాడుతూ ఇంటిముందు తిరగక ఇదేమిట్రా '

'నా ఇష్టప్రకారం ఏది చేస్తున్నారు .. కాబట్టి 'మెల్లగా ఏడుస్తున్నట్లు గొణుక్కున్నాడు

'అంతా నీ ఇష్టప్రకారమే చేస్తాంరా!. లే—లేచి ముందు ఇంతతిని కాఫీ తాగు కళ్లు తిరుగుతాయి అసలే ఎండకాలం లే గుంటూరుపోయి ఎప్పుడొస్తావ్? 'ఎప్పుడు నలుగు పెట్టించుకొంటావ్ ? ' అంటూ అక్కడే మూతపెట్టి ఉన్న ఇడ్లీ పళ్లెం తీసికొని 'మా తండ్రివి కదూ... నేతినిపిస్తా—రా—

'ఆ అను.. నోరు తెరువు' అంటూ రెండేళ్ల పిల్లవాడ్ని బుజ్జగించినట్లు అతన్ని గారబంచేస్తుంటే అతను మరింత మొండికేయసాగాడు

'నే తినను—పో' చేతిని ప్రక్కకు నెట్టాడు విసురుగా.

'తినకపోతే—పో ఏం ?. తిని—నన్ను ద్ధరిస్తావా? నాకోసం తింటున్నావట్రా? .. పాడు పిల్లాడివి నా కడుపున పుట్టావేరా? నీయమ్మ కడుపుమాడ వేధిస్తున్నావు గదరా!'...

ఆమె బ్రతిమాలింది గారాబం చేసింది. నయానా భయానా చెప్పి చూసింది చివరకు అలా విరుచుకుపడింది.. ఓపిక నశించి.

అయినా అతను చలించలేదు ప్రక్కకు తిరిగి పడుకొని ఒకచేతో గచ్చుమీద సున్నాలు చుడుతున్నాడు రెండు నిమిషాలు అలానే కూర్చుండిపోయింది బయట కూలీల కేకలు—పనులు చేస్తున్న చప్పుళ్లు నిర్విరామంగా వినవస్తున్నాయి

'నాన్న . ఉంటే ఇలా చేసేవాడా?',.. గొంతు పెగలించుకొని అన్నాడు. కనుకొలకుల్లోనుండి చెంపలపైకి జారి రెండు అశ్రుబిందువులు ఒలికిపొయ్యాయి.

దివంగతుడైన తన తండ్రిని తలచుకొని తనయుడు అలా కుళ్లికుళ్లి ఏడవటం ఆమె మాతృహృదయం భరించలేకపోయింది కేవలం డబ్బు పుష్టిగా ఇవ్వకపోవటం కారణంగా అతను తనతో చెప్పలేని కోరికలూ—వేడుకలూ, తీర్చుకోలేక తండ్రిని తలచుకొని ఏడుస్తున్నాడన్న ఆలోచనకలిగి కరగిపోయింది.

'అయ్యో.. ఏడుస్తున్నావ్‌రా ఆడపిల్లలాగ నారాత అబ్బ నారకం పిల్లాడివి పుట్టావేరా? ఏడవటం దేనికిరా? పచ్చ పచ్చగా ఇంటిముందు పందిరివేస్తుంటే... ఏంకావాలో చెప్పు మీ నాన్నలేకపోయినంత మాత్రాన నేను నీకు తక్కువచేస్తున్నదేమిటిరా?. ఇదంతా నేను దాచిపెట్టేది దేనికిరా? నా బొందమీదేసి కొట్టుకోటానికి కదరా ?' .. వాత్సల్యపూరితమైన కోపంతో పలికింది.

'దేనికయితే - నాకెందుకు' .లేచికూర్చొని అటు తిరిగి నిర్లక్ష్యంగా పలికాడు

'మూడువేలిస్తా .. చాలా ?'... సంధి కుదుర్చుకోసాగింది.

'మిష్టి మూడువేలు ఎవడిక్కావాలి . మామ, నా బట్టలకని ఇచ్చిన నా అయిదు వేలూ - నావి నాకిచ్చెయ్... నీ డబ్బు నాకేం అక్కర్లేదు'...

ఆ మాటలు ఆమెకు మింగుడు బడ లేదు ఎలా అయితేనేం బలవంతాన గుటక మింగి... 'నా డబ్బా నీ డబ్బా... ఏం మాటలూ . . చిన్నపిల్లవాడిలా... ఎట్టా బతుకుతావో ఏమో ... ఇవిగో భోషాణం తాళాలు...నీ ఇష్టమొచ్చినంత తీసికో ... కానీ నాకు లెక్క చెప్పాలి తెలిసిందా?'... అంటూ చీరె చెరుగున ఉన్న తాళం చేతులు ఊడదీసి చేతిలో పెట్టబోయింది- తాళం చేతులు తీసికోవటం తనకిష్టం లేనట్లు గుప్పిలి గట్టిగా ముడుచుకో సాగాడు— ఆమె బతిమాలుతున్న కొద్దీ .

చివరకు ఆమె బలవంతాన గుప్పిలి విప్పి తాళాలగుత్తి చేతిలో పెట్టింది — మళ్లీ గట్టిగా పిడికిలి మూసుకుపోయింది.

'ఇక తిను పిచ్చి తండ్రీ ... మరి గుంటూరు వెళ్లి త్వరగా రావాలి ఇక సాయంత్రమే నీకు నలుగు అన్ని పనులూ ఇవ్వాళే చూసుకో ... నలుగు పెట్టించుకున్నాక పసుపు కాళ్లతో పొలిమేర దాటకూడదు ... మధ్యాహ్నానికి తిరిగొచ్చేస్తావ్కా.. నాకేమైనా పనులున్నాయా ?.. పొడుపనులు —అన్నీ ఒక్కసారే జ్ఞాపకంరావు' అంటూ తలపట్టుకొంది ఆమెను సంతృప్తి పరచటానికైనట్లు ఆ ప్లేటులో ఉన్న నాల్గు ఇడ్లీలూ నోట్లోకుక్కుకొని— గటగటా ఆ ఆరిపోయిన కాఫీ త్రాగేసి అప్పుడు నోరువిప్పాడు.

'మధ్యాహ్నందాకా దేనికమ్మా . ఇప్పుడు రానూ' అంటూ మెట్లుదిగాడు ఆమె అతనిని అనుసరించింది భోషాణంతీసి జేబుల్లో పట్టినన్ని నోట్లకట్టలు కుక్కాడు. ఆమె ఏమిచెయ్యలేక కళ్లప్పగించి చూస్తూండి పోయింది.

(ఇంకా వుంది)

# ఆంధ్రప్రచిత్రవారపత్రిక

## వనితాలోకం వ్యాసరచన పోటీ

### (ముగింపు తేదీ 16-9-1967)

## మొదటి బహుమతి ... రు. 200
## రెండవ బహుమతి ... రు. 150
## మూడవ బహుమతి ... రు. 100

### ఇవి కాక అయిదు రు. 50 కన్సొలేషన్ బహుమతులు!

13—10—1967 ఆంధ్రసచిత్రవారపత్రిక, దసరాసంచిక, వనితాలోకం ప్రత్యేక సంచికగా వెలువడుతుంది

ఈ సందర్భంలో 'వనితాలోకం వ్యాసరచన పోటీ' ఒకటి నడుపుతున్నాము

పోటీ వ్యాసం వస్తువుగా నేడు మనదేశం ఎదుర్కొనే అతి ముఖ్యసమస్య అయిన జనాభాసమస్యని ఎన్నుకున్నాము. జనాభా పెరుగుదలని అరికట్టకపోయినట్లయితే మనదేశం చాలా కష్టాలని ఎదుర్కొనవలసివస్తుందని నిపుణులు అంటున్నారు దీనిని గుర్తించి మన ప్రభుత్వం '<u>కుటుంబ నియంత్రణ</u>'కి సంబంధించిన పథకాలను అన్నివిధాలా అమలుపరచాలని ప్రయత్నిస్తున్నారు అయితే, ప్రభుత్వం ఎంత ప్రయత్నించినా ప్రజల అంగీకారం, సహకారం అత్యవసరం

నేటి పరిస్థితులలో <u>కుటుంబ నియంత్రణ</u> పథకాలు, ఉద్యమాలు ఎటువంటి అవరోధాలని, సమస్యలని ఎదుర్కొంటున్నాయి? ఈ పథకాలు, ఉద్యమాలు ఎంతవరకు, విజయవంతం కాగలవు? అవి విజయవంతం కావటానికి సామాన్యప్రజలు, <u>ప్రత్యేకంగా వనితలు</u> వహించవలసిన పాత్ర ఏమిటి ?

ఈ ప్రశ్నలకి సరయిన సమాధానాలు కొంతవరకు స్త్రీలే ఇవ్వగలరేమో అనిపిస్తుంది అందుచేతనే ఈ వ్యాసరచన పోటీని వనితాలోకం శీర్షికక్రింద నడుపుతున్నాము రచయిత్రులందరూ సహకరించి ఈ పోటీని జయప్రదం చెయ్యగలరని ఆశిస్తున్నాము

ఈ కింది పట్టికలో భారతదేశం జనాభా పెరుగుదలకి సంబంధించిన వివరాలు స్థూలంగా ఇవ్వబడ్డాయి. సంవత్సరం సుమారు 'పంటసంవత్సరం', అంటే జూన్ చివరికి అనుకోవచ్చు. జనాభా అంకెలు కోట్లు.

| సంవత్సరం ........ | 1964 | 1976 | 1986 |
|---|---|---|---|
| జనాభా .. ......... | 47.2 | 64.8 | 85 6 |

<u>నిబంధనలు</u> 1. ఈ పోటీలో వనితలు మాత్రమే పాల్గొనవచ్చు. 2 వ్యాసాలు స్వంత రచనలు అయిఉండాలి ప్రతి వ్రాతప్రతిలోనూ రచయిత్రి వ్యాసం తన స్వంత రచన అని హామీ ఇవ్వాలి 3 వ్యాసాలు 3 (మూడు) అరఠావు (అంటే ఎక్స్ట్రయిజు పేజీకి రెండు రెటు కల) పేజీలు మించరాదు 4 కాగితానికి ఒక వయిపునే సిరాతో రాయాలి 5 రచయిత్రి పూర్తి పేరు, చిరునామా వ్యాసం చివర రాయాలి వేరే కాగితం మీద రాసి జతపరచరాదు 6 కవరుమీద '<u>వనితాలోకం పోటీకి</u>' అని స్పష్టంగా రాయాలి 7 రచనలు <u>సంపాదకుడు, ఆంధ్రసచిత్రవారపత్రిక, 7, తంబుచెట్టి స్ట్రీట్, మదరాసు—1కి</u> పంపాలి 8 రచనలు మా కార్యాలయానికి 16-9—1967 లోగా చేరాలి. 9 రచనలు ఎట్టి పరిస్థితులలోనూ తిప్పి పంపబడవు అందుచేత రచయిత్రులు తమ రచనలతో స్టాంపులు, స్వంత చిరునామాల కవర్లు పంపరాదు 10 పోటీ తుది నిర్ణయం సంపాదకుడిదే ఈ విషయమయి ఎటువంటి ఉత్తరప్రత్యుత్తరాలూ జరపటం సాధ్యంకాదు. 11 ఫలితాలు 13-10-67 సంచికలో ప్రచురిస్తాము

—సంపాదకుడు

# వారఫలం

**8-9-1967 శుక్రవారం మొదలు 14-9-1967 గురువారం వరకు.**

**మేషం** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాల అనుకొన్నట్లుగా నెరవేరుతాయి రావలసిన డబ్బు సమయానికి అందుతుంది వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి సాహసముతోకూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

**వృషభం:** ప్రయత్నించిన పనులకు ఆటంకాలు రావడం, అనుకోని వ్యవహారాలు నెరవేరడం వంటి సంఘటనలు జరుగుతాయి ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. పోటీవారితో వాదప్రతివాదాలు తగవు. వారాంతంలో అనుకోని చికాకులకు గురికాగలరు బంధుమిత్రులకు కల్పుకొంటారు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు ఆడంబరం కోసం వ్యయం చేస్తారు

**మిధునం.** వ్యాపారంలో మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు ప్రయాణాలు శ్రమమీద ఫలించగలవు రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది సాంఘికకార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి విలాసవస్తువులు కొంటారు

**కర్కాటకం:** మీరు యెంతగానో ఆశించిన వ్యవహారాల్లో ఫలితం సామాన్యంగా ఉంటుంది. సాహసముతోకూడిన వ్యవహారాలు వారం మధ్యలో లాభించగలవు వృత్తిలో కొత్తవారిపోటీని యెదుర్కోవలసి వస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి

**సింహం:** వ్యాపారవిస్తరణ ప్రయత్నాలు ప్రోత్సాకరంగా ఉంటాయి వృత్తిలో పోటీవారి పోటీని యెదుర్కొని అనుకూలతను సాధించగలరు ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతిలభిస్తుంది. మిత్రులకు సహాయం చేస్తారు

స్త్రీలకు— శుభకార్యాల విషయంలో అనుకూల వార్తలను వింటారు ప్రయాణాలోచనలు చేస్తారు

**కన్య:** వృత్తిలో ప్రయోజనంగల వ్యక్తులను కల్సుకొంటారు అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి ఉద్యోగంలకి మిత్రులకు ఉపకారం చేయగలరు పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది. కోర్టు వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది సంతోషకరమైన వార్తలను వింటారు

**తుల** ఇదివరకు మీ కార్యక్రమాలుల్లో యేర్పడిన అవరోధాలు తొలగిపోతాయి నూతన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి రావలసిన డబ్బు సమయానికి అందుతుంది ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి ప్రయాణాలు శ్రమ మీద ఫలిస్తాయి

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. బంధుమిత్రులను కల్సుకొంటారు

**వృశ్చికం** ఇంతవరకు అనుకూలంగా ఉన్న వ్యవహారాల్లోనే కొత్త సమస్యలు తలయెత్తవచ్చును. వృత్తిలో కొత్తవారితో పోటీ యేర్పడుతుంది పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగానే ఉంటుంది అధిక వ్యయం జరుగుతుంది

**ధనుస్సు.** వృత్తి వ్యాపారాల్లో మీకార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి రావలసిన డబ్బు సమయానికి అందుతుంది వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది దైవకార్యాలు నెరవేరుతాయి

**మకరం** ఆదాయం మాట యెలాగఉన్నా, అన్ని వ్యవహారాల్లోను గౌరవప్రాబల్యాలు బాగా ఉంటాయి వ్యాపారంలో ప్రయోజనంగల వ్యక్తులను కల్సుకొంటారు సాహసముతోకూడిన వ్యవహారాలు వారం మధ్యలో లాభిస్తాయి వారాంతంలో అనుకోని, చికాకులు కలుగుతాయి అధికవ్యయం జరుగుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది బంధువులకు సహాయం చేస్తారు

**కుంభం** వ్యాపారంలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి సమయానికి యేదో ఒక విధంగా డబ్బు చేతికి వస్తుంది ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ప్రయాణాలు కొంచెం శ్రమమీద ఫలిస్తాయి

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి అనుకూల వార్తలను వింటారు

**మీనం** వారం ప్రారంభంలోనే వృత్తివ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి సాహసముతోకూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది వృత్తిలో అనుకూలమైన మార్పులు వస్తాయి అధికారులవలన జరుగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు పుణ్యకార్యాలు చేస్తారు.

—మహేష్

# చవితి కార్టూనులు




Jayadev


గణపతీ-విచారంగా
వున్నావ్ దేనికో?
నైవేద్యంలో లోపమా?
బియ్యం దొరకటం
లేదట! కుడుములూ
ఉండ్రాళ్ళూ లేవు!
ఆఖరిన
వంటకాల్లో
పంచదార
చవి చూద్దామ
న్నా లేదు!






ఏయ్ ఆగు! నేను
మనిషిని ..
మగాడ్ని!


మీరు తీసే 'చవితి
చంద్రుడు' చిత్రంలో నాకు
విలన్ వేషం ఇవ్వండి సార్!


వ్యాసమహర్షి! నేను భూలో
కంలో షార్టుహాండు నేర్చుకుని
వస్తా! మీ డిక్టేషన్ రాయలే
క పోతున్నా!!


ఈ కార్టూనులు
చూసి-నవ్వని
వారు అపనిందల
పాలవుదురుగాక!







ఒకసారి మల్లన్నమంత్రి మారు వేషంలో దేశాటన చేస్తుండగా, దారిలో ఒక పేదవాడు కన్పించేడు ఆ పేదవాడు మల్లన్నమంత్రిని సహాయం చేయవలసినదిగా కోరేడు. మల్లన్నమంత్రి అతనికి సహాయం చేద్దామనుకున్నాడు గాని తన దగ్గర డబ్బు యేమీ లేకపోవడంవలన తనతో పాటు కొంత దూరం రమ్మన్నాడు. మల్లన్నమంత్రి పేదవాడు కలిసి ఒక గ్రామం చేరుకొన్నారు.

ఆ గ్రామంలో అప్పుడు శ్రీరామ నవమి ఉత్సవాలు జరుగుతున్నాయి. సాయంత్రం శ్రీరాములవారి విగ్రహాన్ని గరుడవాహనంపై ఊరేగిస్తూ ఆ ఊరు మునసబు యింటికి తీసికొని వచ్చేరు తరువాత అక్కడ హరికథా కాలక్షేపం జరగడంవలన - చాలామంది జనం చేరేరు.

హరికథ అయిపోయిన తరువాత మునసబు యిలాగ అన్నాడు ; 'ఈదినం విగ్రహాలను చూసిన తరువాత నాకు ఒక సందేహం కలిగింది. గరుత్మంతుల వారు రెండు చేతులను వెడల్పుగా ముందుకు చాపివున్నారు. ఆంజనేయుల వారు రెండు చేతులను జోడించి ఉన్నారు. శ్రీరామచంద్రులవారు కుడి చెయ్యి బొటన వ్రేలిని కొంచెం ముందుకు చాపి దానిమీదకు చూపుడు వేలిని వంచేరు. దీనికి కారణం ఏమిటి ?

'శ్రీరాములవారు అభయ హస్తం యిస్తున్నారనీ, ఆంజనేయులవారు నమస్కారం చేస్తున్నారనీ యిలాగ యెవరికి తోచింది వారు చెప్పేరు కాని అవి మునసబుకు నచ్చలేదు. అప్పుడు మునసబు తనకు నచ్చేటట్లుగా సమాధానం చెప్పగలిగినవారికి నూరు వరహాలు బహుమానం యిస్తానన్నాడు, కాని యెవరూ సరియైన సమాధానాన్ని యివ్వలేకపోయారు.

ఈ వ్యవహారాన్నంతా మొదట్నుంచీ చూస్తున్న మల్లన్నమంత్రి ముందుకు వచ్చి యీ విధంగా సమాధానం యిచ్చేడు ;

'గరుత్మంతులవారు. రెండు చేతులను ముందుకు చాపి—మునసబుగారి పొలంలో పొగాకు యింత వెడల్పుగా ఉంటుందని చెబుతున్నారు !

'ఆంజనేయులవారు తమ రెండు చేతులను జోడించి — మునసబుగారి పొలంలో పొగాకు అంత వెడల్పుగా ఉండడమేకాదు, యింత దళసరిగా కూడా ఉంటుందని చెబుతున్నారు !

'శ్రీరామచంద్రులవారు తమ కుడి చేతి బొటనవేలిని కొంచెం ముందుకు చాపి చూపుడు వేలును దానిమీద ఉంచి— మునసబుగారి పొలంలో పొగాకును పొడుం తయారుచేసి యిలాగ పీల్చినట్లయితే బ్రహ్మానందంగా ఉంటుందని చెబుతున్నారు.'

ఈ సమాధానం వినగానే మునసబుకు బ్రహ్మానందం కలిగి మల్లన్న మంత్రికి నూరు వరహాలు బహూకరించేడు. మల్లన్నమంత్రి ఆ నూరు వరహాలను తనతో వచ్చిన పేదవానికి యిచ్చివేసి ముందుకు బయల్దేరాడు.







(క) ఎలుకలు—పిల్లి!

ఇక్కడ 12 ఎలుకలున్నాయి ఒక తెలివైన పిల్లి ఒకటవ ఎలుక దగ్గర బయలుదేరి గీతల వెంట బహు దగ్గర దారిలో




ప్రయాణంచేసి, అన్ని ఎలుకలనూ చంపుకుంటూ ఆఖరున 12వ ఎలుకను చేరుకుంది ఆ దారి ఏదో మీరు తెలుసుకోగలరా?

* * *

(చ) మూడు చదరాలు :

గజం పొడుగున్న కర్రలు నాలుగు, అరగజం పొడుగున్న కర్రలు నాలుగు తీసుకు



వాటితో రెండు చదరాలు తయారుచేయుడం చాలా సులభం

కాని వీటినే ఉపయోగించి మూడు సరిసమానమైన చదరాలు తయారు చేయగలరా? వీటినే ఉపయోగించి నాలుగు సరిసమానమైన చదరాలు చేయడం సులభమే. ప్రయత్నించి చూడండి.

* *




(ట) సరి వరుసలు :

$4 \times 4 = 16$ గదుల చదరం గీసి, పది పైసలు తీసుకుని; ఈ గదులలో నుంచాలి, సరి సంఖ్యలో పైసలున్న వరుసలు అత్యధికంగా ఉండేటట్లు. అడ్డం, నిలువు

| | | | |
|---|---|---|---|
| * | * | * | * |
| * | | * | |
| | * | * | |
| * | | | * |

ఏటవాలు—ఏదైనా సరే వరుసకిందే లెక్క. ఉదాహరణకు ఇక్కడి వరుసలో చూపినట్లు అమరిస్తే, అటువంటి సరి 'వరుసలు' పది ఏర్పడ్డాయి. ఈ పదిపైసలను 16 సరి వరుసలు ఏర్పడేలా అమర్చవచ్చు ఆ పని మీరు చేయగలరేమో ప్రయత్నించండి




(త) ముష్టివాడి డబ్బు

దుర్గగుడి సోపానాల మీద కూర్చున్న ముష్టివాళ్ళల్లో ఒకడు బహుకాలంగా సంపాదించిన డబ్బును 7 సంచులలో పోసి జాగ్రత్త చేశాడు అందులో ప్రతి ఒక్క సంచీలోనూ సరిసమాన సంఖ్యలలో 10,5, 3 2,1 పైసల నాణెములు ఉన్నాయి

ఒకనాడు రాత్రిపూట వాటినన్నింటినీ కిందపోసి, లెక్కపెట్టుకుని 7 సంచులు

(82వ పేజీ చూడండి)




ఆకాశమంతా తిరిగి తిరిగి ఆటలాడి అలసిపోయిన ఎర్రబడిన ముఖంతో సూర్యుడు గుహోన్ముఖుడైనాడు. పశ్చిమ దిక్సతి సూర్యుడ్ని ఒళ్ళోకి తీసుకుంటున్నది పసిపిల్లవాడు చిందర వందరగా తన్నేసిన బొమ్మల్లా చెదిరిపోయి వున్నయి మబ్బులు.

హేమంత శర్వరి తొంగి చూస్తున్నది. సన్నగా చలి ప్రారంభమైంది.

జయలక్ష్మి మరోసారీ వాచీ చూసుకుంది విసుగ్గా. ఆరు పది!

ఏం మనిషనుకోవాలి ఈయన్ని?

ప్రొద్దున మరీ మరీ చెప్పింది నాలుగు గంటలకే రమ్మని, సరేనని చేతిలో చేయివేసి చెప్పివెళ్ళారు. ఆఫీసుకుపోతే ఇంట్లో మనుష్యులు గుర్తుండరు కాబోలు ఈయనేనా ఉద్యోగం చేసేది? మరెవరూ చేయటంలా? పక్కింటి శారదభర్త ఎంత బాంకులో ఉద్యోగమైనా సరిగా మూడున్నరకే వచ్చేశాడు. నాలుగున్నరకల్లా ఆవిడ ఆయన బజారుకు బయలుదేరారు. వాళ్ళిద్దరూ అలా నవ్వుకుంటూ పోతుంటే తను ఈర్ష్యతో చూస్తూ నిల్చుండిపోయింది. నిజానికి ఆయనకి వచ్చే జీతం తమకన్నా తక్కువే! అయితే ఏం? ఆవిడ ముఖంలో ఎప్పుడు తృప్తి, సంతోషం వెలుగుతూ వుంటయి. తనే ఏదో వెలితితో బాధ పడుతుంది రేపు ఆవిడ వచ్చి, 'ఇదిగో జయలక్ష్మి ఈ చీర కొన్నాం బాగుందా, నిన్న సాయంత్రం ఇద్దరం కలిసి వెళ్ళాం. నాదేమీ లేదు అంతా వారి సెలక్షన్. 'ప్రతిసారి పండక్కి ఎందుకు? ఈసారి కొందాం లెండి' అంటే వినలేదు 'కట్టుకోవాల్సిందే' అన్నారు ' అంటుంది.

అంతటితో వూరుకోదు 'మీరేం కొనుక్కోలేదా?' అంటుంది అంత అడిగితే ఏదో సమాధానం చెప్పలేకపోలేదు ప్రతి పండక్కి చీర కొంటేనేనా ఏం హోదా తెలిసేది? కాని ఈ జవాబుతో మనస్సు తృప్తి పడదు. సిగ్గుతో కుమిలిపోతుంది!

అసలు ఈసారైనా తప్పకుండా ఇంటికి వెళ్ళాలనుకుంది నాన్న అమ్మ మరీ మరీ రమ్మని వ్రాశారు. అన్నయ్య క్రిందటిసారి వచ్చినప్పుడు తప్పకుండా రావాలని చెప్పి, ఆయనచేత ఒట్టు వేయించుకుని వెళ్ళాడు. పెళ్ళయి ఇక్కడికి వచ్చిన ఏడాదిలో ఒక్కసారి కూడా వెళ్ళలేదు. అమ్మా నాన్న ఉండబట్టలేక చూసివెళ్ళారు ఈ మనిషితో ఏ సరదాలు తీరతయి. ఆఫీసుంటే వేరే అన్నము నీళ్ళు అక్కర్లేదు. పండుగ ఇరవయి రోజులుండగానే శెలవకోసరం ప్రయత్నించమంది. శ్రీధర్ నవ్వేసి తలూపాడు. తనకి ధైర్యం వచ్చింది.

'అయితే వస్తానని వ్రాసేస్తాను' అంది.

'పోవాలనుకుంటే పోదాం కాని వస్తున్నామని వ్రాయాలా ఏం?'

'అవును. అల్లుడుగారికి పూలదండలతో

స్వాగతం చేయలేరు'

అందరికీ మొన్నకి మొన్న చల్లగా చెప్పే కాదు. శలవ దొరకదని. పైగా కావాలంటే తనని వెళ్ళమంటారు. అంతా అబద్ధం. ఈయన అడిగితే శలవ ఇవ్వరూ? అనలేద గరు. ఇంత కష్టపడి పనిచేస్తారంటే ఈయనకి గొప్ప ఏమిటో ఆ గొప్ప?

జయలక్ష్మి మనస్సు అశాంతితో నిండి పోయింది. నెలరోజులనుంచి ఉత్సాహం కూడబెట్టిన మనస్సు నీళ్ళమూటలా అయింది.

కళ్ళల్లో నీరు తిరిగింది!

అమ్మా వాళ్ళు ఆయన ఉద్యోగం, హోదా చూసి మురిసి పోతుంటారు కాని తనబాధ ఎవరికి తెలుస్తుంది? నిజానికి ఒంటరి తనానికి మించిన శిక్ష వేరే ఏముంది?

ఆయన వస్తారని గంపెడాశతో నాలుగు గంటలకే స్నానంచేసి ఆయన కిష్టమైన గులాబిరంగు షిఫాన్ చీర కట్టుకుంది. పెరట్లో పూసిన సన్న జాజిపూలు కోసుకువచ్చి మాల కట్టుకుని తల్లో పెట్టుకుంది సన్న జాజిపూల పరిమళం మనస్సునిండా నిండి అదోవిధమైన అనుభూతితో పులకించి పోయింది

కాని ఇది అలాగే అయింది. తనని చూసి నవ్వి కాలం క్రమంగా జారి పోతున్నది

జయలక్ష్మి కళ్ళు మరోసారి రెప్పు వాచిని చూసినయి ఏడు కావస్తున్నది

విసుగ్గా కర్టెన్ తొలగించి చూసింది.

మూర్తిగారు, శారద తిరిగి వస్తు న్నారు ఇహ ఇప్పుడే వస్తుందేమో, ఆవిడ చీర చూపించటానికి? ఖర్మ—

జయలక్ష్మి గుండెల్లో ఈర్ష్య తాచు పాములా బుస్సుమంది

తన నిరీక్షణ ఇలా వ్యర్థమైపోయింది, అసలు ఆయనకి తన వునికే గుర్తుండ దేమో ఆఫీసుకుపోతే. ఊహూ! అదేంకాదు, నిర్లక్ష్యం, ఆయన దృష్టిలో తను ఒక దాసి తన డబ్బు, ఉద్యోగం, చదువుచూసి కాళ్ళదగ్గరపడి వుంటాననుకుంటారేమో ఆయన

జయలక్ష్మి కోపం తారస్థాయి చేరుకుంది.

శారద గారింట్లోంచి నవ్వులు వినబడు తున్నాయి జయలక్ష్మి అక్కడ నిల్చోలేక లోపల కొచ్చి అద్దం ముందు కూర్చుంది.

[illegible]

అందాన్ని వెక్కిరించింది. ఆ అందంలోంచి ఆనందం ఆవిర్భవించినప్పుడే దాని విలువ పుష్పకు అందము, వాసనా రెండువుంటే? జయలక్ష్మి హృదయంలో అగ్నిపర్వతం బ్రద్దలయింది. అనంపూర్ణమైన ఈ అనుభూతి, నమాధి చేయబడుతున్న కోరిక ఆమెలోని స్త్రీ సహజమయిన దౌర్బల్యాన్ని రెచ్చగొట్టినయి.

ఈ నిరీక్షణలో ఎంతహాయి! దాని ఫలితాన్ని కూడా పొందగలిగితే అందులో ఎంత తీపి! ఊహే ఇంత మధురంగా వుంటే అది వాస్తవమైతే ఇంకెలా వుంటుందో?

ఈ క్షణాన్ని శాశ్వతంచేసి గుండెల్లో దాచుకుని మురిసిపోవాలనుకున్న జయలక్ష్మి, ఆ అనుభూతి తననుంచి వేరై తననిచూసి పకపక నవ్వుతుంటే నిస్సహాయురాలై దిండులో తలదూర్చి బావురుమంది.

* * *

జయలక్ష్మితో పాటుగా శ్రీధర్ కోసరం నిరీక్షిస్తున్న వ్యక్తి మరొకడున్నాడు. వాడు వాసు శ్రీధర్ ఇంట్లో నౌకరు.

శ్రీధర్ రాకకోసరం ఎదురుచూస్తూ వాకిట్లో పున్నాగ చెట్టుక్రింద కూర్చు న్నాడు. వాడికి ఏమీ తోచటంలేదు. వాడి మనస్సులో భావాలు మంతనమున్నాయి దిగులు వాడి హృదయాన్ని ఆవరించింది చీకటి జాలిగా వాడ్ని ఒడిలోకి తీసుకుంది, పున్నాగపూలు వాడిమట్టూ ఆశల్లా రాలిపోతున్నాయి. ఒక పువ్వును చేతిలోకి తీసుకుని వేలమీద పిచ్చిగీతలు గీస్తూ చూస్తున్నాడు

వాడి హృదయంలో ఒకే ఒక భావం స్థిరంగా కాపురం ఏర్పరుచుకున్నది

అయ్యగారు ఈ రాత్రికి అసలు రారేమో? క్యాంపుకిపోయి, ఏ కేంప్కైనా వెళితే?

వాడి హృదయం బరువెక్కింది మనస్సు ఆవేదనామయంగా చూసింది

కూర్చోలేక లేచి తీసుకుని వీధిలోకి వచ్చాడు సగం కాగి ఆరిపోయిన బీడిని నిక్కరు జేబులోంచి తీసి వెలిగించాడు.

వాడి కళ్ళకు దూరంగా లైటు కన పడింది. అయ్యగారు వస్తున్నారేమో? వాడి కళ్ళు ఆశతో మిలమిల లాడినయి ఉత్సాహంగా చూశాడు కాని అది సైకిలు. ఎవరో? నిరాశతో వెనక్కి తిరిగాడు.

[illegible]

లేకపోలేదు. వాడికి మొన్న మొన్ననే పెళ్ళ యింది. పెళ్ళయిన తరువాత వచ్చిన మొదటి పండుగ ఇది. అందుకని ముందుగా చెప్ప కుండా ఓ చీర కొనుక్కువెళ్ళి భార్యామణిని ఆనందాశ్చర్యాలలో ముంచివేయ్యాలని కోరిక కలిగింది అయితే వాడిదగ్గర డబ్బులేదు నెలకు వచ్చే ఆ కాస్తతో ఏదో నెట్టుకు వస్తున్నాడు. అయినా ఈ ఆనందం కోసరం ఓ పదిహేను రూపాయలైనా ఖర్చు పెట్టా లని నిశ్చయించుకున్నాడు. అందుకని అయ్య గారిని ఓ ఇరవయి రూపాయలు అప్పు అడి గాడు. నెల నెల జీతంలో అయిదు రూపా యలు పట్టుకోమన్నాడు అలా అయితే నాలుగు నెలల్లో బాకీ తీరుతుంది. తనకీ కష్టం వుండదు.

అంతా విని శ్రీధర్ సిగ్గుతో ఎర్రబడిన వాడి ముఖం చూసి నవ్వి, 'సరేలేరా, పండుగ ఇంకా పదిరోజులుందిగా, ఇస్తాలే' అన్నాడు

నిజానికి ఇంతవరకు శ్రీధర్ ని అడిగి లేదనిపించుకున్న రోజులేదు

ఇవ్వాళ ప్రొద్దున్నే బూట్లు పాలిష్ చేస్తుంటే గదిలోంచి మాటలు వినిపిస్తు న్నాయి. సగం తెరిచిన కిటికీలోంచి శ్రీధర్ జయలక్ష్మి కనిపిస్తున్నారు

'ఈ రోజైనా త్వరగా వస్తారా? రోజు వున్నదే ఆఫీసు' అంది జయలక్ష్మి

శ్రీధర్ ఓవల్టిన్ సిప్ చేస్తూ, 'ఏం? ఎందుకని?' అన్నాడు

జయలక్ష్మి పెదవులు మన్మధుని ధను స్సులా వంగినయి

'తెలీనట్లు.' అంది

'నిజంగా తెలీదు. ఏమిటో చెప్పు.'

'దేవు సంక్రాంతి'

ఆమె ముఖం కాంతితో నిండిపోయింది

'చీర కొనాలి.'

'కొనరా? పుట్టింటికి వెళ్ళటం ఎలాగూ లేదు చీరైనా కొనరా?'

శ్రీధర్ నవ్వి 'దేవిగారు ఆజ్ఞాపించటం కాదనటం కూడానా?' అన్నాడు

'ఇష్టం లేకపోతే మానేయండి'

'అదిగో, అప్పుడే కోపంవచ్చింది కోపం వస్తే నువ్వు ఎంత అందంగా వుంటావో తెలుసా? ఆడవాళ్ళకి సిగ్గే సింగారం అన్నారు గాని కోపమే సింగారం అని వుండవల సింది.'

జయలక్ష్మికి నిజంగానే కోపం వచ్చింది.
-తెలుసుకున్నారుగా ధన్యులం. మీ ధీసిస్‌కి డాక్టరేట్ ఇస్తారు. ఏ యూనివర్సిటీకైనా పంపండి !'

'నాకు డాక్టరేట్ అక్కర్లేదు. ఇది కావాలి' అన్నాడు.

వాసుకు షాక్ కొట్టినట్లయింది. వాడి గుండెలు దడదడ లాడినయి. సిగ్గుతో వాడిముఖం ఎర్రబడింది. ఒకవిచిత్రమైన అనుభూతి దేహమంతా కదలాడింది.

'ఛీ, ఛీ, అక్కడ వాసు కూడా వున్నాడు' అంది జయలక్ష్మి బుగ్గలు తుడుచుకుంటూ

'అయితే వాసు లేకపోతే ఇష్టమేనన్న మాట' అన్నాడు శ్రీధర్.

'ఇలా నన్ను మాటల్లో పడేసి వెళ్తారు'

'చిన్నపిల్లవా?'

'ఇంతకీ చీర కొంటారా? కొనరా?'

'గాడ్రెజ్ బీరువాలో ఎంతుందో చూడు. లేకపోతే బాంకినుంచి తీసి పంపుతాను. వాసు తోడు వస్తాడు..'

జయలక్ష్మి ముఖం ముడుచుకున్న పద్మంలా అయింది.

'నాకేమక్కర్లేదు.'

'అదేం. అలక?'

'లేకపోతే? ప్రతిసారీ ఇంతే? ఇద్దరం సరదాగా వెళ్ళి కొనుక్కోవాలనుకుంటే—'

శ్రీధర్ నవ్వేసి, 'ఓయస్ దానికేం, ఇంతపాటి మొగాణ్ని వుండి ఆ మాత్రం

## విలువలు

కోరిక తీర్చలేనూ?' అన్నాడు

'అయితే ఎన్నిగంటలకి వస్తారు?'

'నాలుగు.'

'తప్పకుండా'

'ఈ ముద్దు సాక్షి.'

శ్రీధర్ వెళ్ళబోయేటప్పుడు వాడు అక్కడ లేదు. ఓవల్టీను కప్పుని కడగటానికి వెళ్ళాడు వాడు వచ్చేసరికి శ్రీధర్ స్కూటర్ స్టార్ట్ చేసి వెళ్ళిపోతున్నాడు. ఇక ఎలా అడిగేది? వాడికి మాట పెగల్లేదు. రేపే పండుగ. ఇన్నాళ్లనుంచి అడుగనందుకు మనసులోనే తిట్టుకున్నాడు వాడి కళ్ళ ముందే శ్రీధర్ వెళ్ళిపోయాడు. వాడు నిరాశతో నిలబడిపోయాడు.

* * *

జయలక్ష్మి అద్దం ముందు ఎంతసేపో కూర్చున్నది. ఆ ప్రతిబింబం ఆమెని వెక్కిరిస్తున్నది తలుచుకున్నకొద్దీ ఆమెకు కోపం, ఉక్రోషం అంత కంతకు ఎక్కువైపోతున్నాయి.

''ఇప్పటికైనా తెలుసుకో, నీ విలువయింతే. నీవంటేనే నిర్లక్ష్యం నువ్వెంత ప్రేమిస్తున్నా నీ కోసం అతి స్వల్ప త్యాగాన్ని కూడా చేయలేడతను నువ్వు మాత్రం ప్రతి చిన్న విషయంలోనూ అతని ఆధిక్యతని గుర్తించి గౌరవిస్తావు. కాని అతను నీ ఉనికే గుర్తించడం లేదు.' అంతర్యుద్ధం పరాకాష్ఠ నందుకుంది.




జయలక్ష్మికి తనమీద తనకే జాలి కలిగింది అహం ఎదురుతిరిగింది. ఏదో చెప్పలేని కసి. తను అతనికి అర్ధాంగి కాదు, దాసి !

జయలక్ష్మి వివేకాన్ని కోల్పోయింది. తన భవిష్యత్తునెవరో సమూలంగా పెకలించి వేస్తున్నట్లు అనుభూతి పొందింది. ఆవేశంలో కట్టుకున్న పట్టుచీర విప్పేసి మరో పాతచీర కట్టుకుంది. ఆమె మనస్సు బ్రద్దలైంది. దిండులో తలదూర్చి బావురుమంది.

పున్నాగచెట్టు క్రింద కూర్చున్న వాసు మెల్లగా లోపలికి వచ్చాడు వాడంతకు మునుపు రెండసార్లు వచ్చాడు. ఇంతవరకు అయ్యగారు రాలేదు. వస్తారో రారో తెలీదు. కేంపుకు వెళ్ళారేమొ? రాకపోతే ఎలా? తన మొహం చూసి కొట్లో ఎవరూ అప్పివ్వరు అందులో పండగపూట. వాడి మనస్సులో జాలిగా చూసే భార్య ముఖం కనబడింది నిజానికి చీర కావాలని చంద్రి అడుగలేదు. తనకే బుద్ధి పుట్టింది తన సమర్థతని అది గుర్తించాలని ఆశ. ఆ ఆశలో ఆనందం వుంది దాన్ని పోగొట్టుకోలేదు

ఇన్నాళ్లూ అయ్యగారే ఇస్తారని వూరుకున్నాడు మరిచిపోయారో ఏమో? అమ్మగారి నడిగితే? ఇస్తారో? యివ్వరో? కనీసం అమ్మగారి దగ్గర వుండకపోతుందా? అడిగి చూస్తే !

తీరా గది దగ్గరకు వచ్చేసరికి అడిగే ధైర్యం లేకపోయింది. అమ్మగార్ని ఇంత వరకు ఎప్పుడు అడగలేదు. అదీగాక అమ్మగారదోలా వున్నారు. ఎంతోసేపు మధనపడి తన బలహీనతకి తనే తిట్టుకుని వెళ్ళిపోయాడు. కాని మనసులో ఆరాటం ఆపలేకపోతున్నాడు. బాధ అణచుకోవటం చాలా కష్టం. ఏమైతే అయిందని వచ్చాడు

జయలక్ష్మి మరో వైపు తిరిగి పడుకుంది. వాడు రెండుసార్లు రావటం వెళ్ళటం ఆమెకి తెలీదు. ఆమె కళ్ళు వర్షిస్తున్నాయని వాసుకి తెలీదు.

'అమ్మగారు' అన్నాడు.

జయలక్ష్మి చప్పున కళ్ళు తుడుచుకుని లేచి కూర్చుంది.

'ఏం?' అంది.

[illegible] ఇంకా రాలేదమ్మా

# ఆమె చదువు తృప్తికరంగా లేదన్నారు!




ఆ అమ్మాయి మొదట్లో
ఎంతో తెలివిగా వుండేది
ఆ తరవాతే ఆమె
నిర్లక్ష్యంగా మొద్దుగా
తయారయింది
అందువల్ల డాక్టర్ని
సంప్రదించాను



ఇప్పుడు పరిస్థితి వేరు
ఆమె ఉత్సాహంతో
ఉబ్బిపోతున్నది –
ప్రశ్నలకు జవాబు
లివ్వడంలో అందరిలో
ఆమెయే మొదటిది
హార్లిక్స్ ఆమెను
గురించిన సమస్యను
పరిష్కారం చేసింది



## హార్లిక్స్ వాడిన తరవాత చక్కని తెలివితేటలు...ఎంతో చురుకుదనం!

పెరిగే పిల్లలకు హార్లిక్స్ దివ్యమైనది వాళ్లు శీఘ్రంగా వినియోగ పరిచే శక్తిని యిచ్చేందుకు చాలా సార్లు వాళ్ళ మామూలు ఆహారములోని పోషకత్వము చాలదు హార్లిక్స్ పిల్లలకు అదనపు పోషకత్వాన్ని యిస్తుంది దీనికి కారణం అది శ్రేష్ఠమైన సహజ ఆహార పదార్థాలతో సులువుగా జీర్ణమయ్యేలా తయారు చెయ్య బడడమే పిల్లల చక్కని పెరుగుదలకు డాక్టర్లు వారికి హార్లిక్స్‌ను సిఫారసు చేస్తారు మీ పిల్లలకు కూడ హార్లిక్స్ కావాలి!




గోధుమ పిండి మరియు
మాల్టెడ్ బార్లీల
పోషకవంతమైన
సారములు మరియు పూర్తి
మీగడ గల పాలతో
చేయబడినది.



# హార్లిక్స్

## అదనపు శక్తిని కలిగించును!

HL.5841.

'[illegible]. ఏం వెళ్ళిపోతావా?'

వాడు మాట్లాడలేదు. మాటలు మనసు లోనే ఆగిపోయినయి

'పో పరవాలేదు నేనుండగలను'

వాసుకేం చెప్పటానికి తోచలేదు.

జయలక్ష్మి వాడికేదో కావాలని గ్రహించింది. అయినా తనంతతానుగా 'ఏం కావాలిరా' అని అడుగలేదు. అడిగివుంటే వాడికి చెప్పటం సులభమయ్యేది.

'అమ్మగారు.'

'అమ్మగారు అమ్మగారు అనకపోతే ఏం కావాలో చెప్పరాదూ?'

వాసు చిన్నబుచ్చుకున్నాడు అసలు ఆవిడ్ని అడుగకూడదనుకుంటూనే వచ్చాడు. ఆవిడ కెందుకంత కోపం?

'ఇరవయి రూపాయిలు కావాలమ్మగారు'

'ఎందుకు ?'

'కావాలమ్మగారు.'

'ఎందుకో చెప్పకూడదా?'

'చీరకొనాలమ్మగారు' అన్నాడు సిగ్గుపడుతూ.

జయలక్ష్మికి గుండెల్లో శూలం పెట్టి పొడిచినట్లయింది.

'చీరా ?' అంది తీరలోయిన గొంతుతో.

'అవునమ్మగారు.'

'అయ్యగారిని అడుగలేకపోయావా ?'

'అడిగానమ్మగారు. నెల జీతంలో అయిదు రూపాయలు పట్టుకో మన్నారు. వస్తే ఇస్తానన్నారు.'

'ఇంకేం తీసుకో.'

# విలువలు

'అయ్యగారు రాలేదమ్మగారు'

జయలక్ష్మికి ఈర్ష్య కలిగింది.

'ఏమో, ఎన్నింటికి వస్తారో? అయినా ఇరవయి రూపాయలకేం చీరవస్తుందిరా కనీసం యాభయి అరవయి అయినా పెట్టాలి' అని వాడిని నిరుత్సాహ పరచటానికి ప్రయత్నించింది

వాసు జాలిగా నవ్వాడు.

'అంత డబ్బు పెట్టి కొనగలనా?' అన్నట్లుంది ఆనవ్వు

'మీ దగ్గరుంటే ఇయ్యండమ్మా'.

జయలక్ష్మి అదోలా నవ్వింది

'నిజమే! కాని నా దగ్గర ఎక్కడుంటుందిరా? అంతా అయ్యగారే చూసుకుంటారాయే.' అంది

నిజానికి జయలక్ష్మి దగ్గర డబ్బు లేక పోలేదు కాని తనకులేని సంతోషం వాళ్ళు పొందటం ఆమె కిష్టంలేదు చీర కొంటానన్నప్పుడే అసూయ జనించింది వాడు చీరకికాక మరి దేనికడిగినా ఇచ్చివుండేదేమో?

వాసు తల వంచుకుని వచ్చేశాడు వాడికి జీవితంమీద అసహ్యం కలిగింది తన అసమర్థతకి ఏడుపు వచ్చింది చీకట్లో వాడిముఖం మరింత నల్లబడింది.

అయితే వాడ్ని అదృష్టం వదిలిపెట్టలేదు, వాడు పున్నాగ చెట్టుక్రింద రెండు నిముషాలు కూర్చున్నాడో లేదో శ్రీధర్ వచ్చాడు స్కూటర్ లైటు వాడిమీద పడింది

శ్రీధర్ వాడ్ని చూశాడు

'ఏరా, ఇంకా వున్నావా? వెళ్ళకపోయావా?' అన్నాడు.

వాసు శ్రీధర్‌వంక జాలిగా చూశాడు.

శ్రీధర్‌కి గుర్తు వచ్చింది.

'అవును, నువ్వు డబ్బుకావాలన్నావుగదూ! మర్చిపోయాను ఇంకా బట్టలకొట్లు తెరిచే వున్నయి ఇదిగో— అంటూ పర్సు తీసి రెండు పదిరూపాయల నోట్లు చేతిలో పెట్టాడు

వాసు కళ్ళు కృతజ్ఞతతో మెరిసాయి. ఆనందంతో వాడికి మాటలు కరువయినయి. రెండు చేతులు జోడించి శ్రీధర్‌కి నమస్కారం చేశాడు

'పోయిరారా' అన్నాడు శ్రీధర్ ఆప్యాయంగా బుజంతట్టి

'వస్తానయ్యా'

వాసు వెళ్ళిపోయినాడు

'జయా!' ఉషారుగా ఈల వేసుకుంటూ వచ్చాడు

జయలక్ష్మి పలుకలేదు

'అలిగితివా, సఖీ ప్రియ—' రాగయుక్తంగా పాడుతూ జయలక్ష్మిని తన వైపుకు త్రిప్పుకోపోయాడు.

జయలక్ష్మి చెయ్యి విదిలించుకుంది

'కోపమే ఎందుకబ్బా?' అని కాసేపు ఆలోచించి 'ఓ, నాలుగు గంటలకే వస్తానని రాలేదనా? సారీ జయా. ఏంచేయను? అనుకోకుండా పని తగిలింది అప్పటికీ అయిదు గంటలకల్లా పని పూర్తిచేసి నిలబడ్డాను ఇంతలో మా ఆఫీసరు, భార్య బజారు రమ్మని కూర్చున్నారు ఏం చేయను చెప్పు? ఎలా తప్పించుకుందా మనుకున్నా వదలందే.'

జయలక్ష్మి వినదలచుకోలేదు. కాని వింటున్నది.

ఎంత చక్కని కథ చెబుతారు?

'వాళ్ళతో బజారు వెళ్ళి వచ్చేసరికి ఆలస్యమైపోయింది ఇంతకీ చీర లేకపోతే గదా? చీర తెచ్చాను చూడు, ఎంత బాగుందో? నీ కిష్టమైన కలర్ ఇటు చూడు మరి—' జయలక్ష్మి కళ్ళు తెరవలేదు.

'మై గుడ్‌నెస్ ప్రణయ కలహమా?

[illegible]



మరి కొంతసేపు బ్రతిమాలుదును గానీ ఆక లేస్తుంది కావాలంటే అన్నం తిన్న తరువాత తెల్లవార్లు బ్రతిమాలమన్నా సరే. జయా, ప్లీజ్—'

'అవును. మీ ఆఫీసర్ చేసిన మాత్రం నేను చేయలేదు. వారికున్న విలువ నాకు లేదు. నేను మీ దృష్టిలో పని చేసే యంత్రాన్ని' అంది గద్గదస్వరంతో.

'అరె ఏడుస్తున్నావా ? ఎందుకు? చీర తెచ్చాగా ?'

'ఆఁ తెచ్చారు. కాని నా కోరికని దాదాపు సమాధి చేశారు. మనిద్దరం వెళ్లి తెచ్చుకుందా మనుకున్నాను. మీ ప్రక్కన అలా నడుస్తుంటే ఎంత తీయని అనుభూతి కలుగుతుందో, లోకం అసూయతో మన వంక చూస్తుంటే నాకెంత తృప్తి కలుగుతుందో అవేవి దక్కకుండా చేశారు'

శ్రీధర్ మాట్లాడలేదు. అతనికి జయలక్ష్మి బాధ అర్థమైంది.

'మీ చీర నాకు వద్దు నేనసలు కట్టుకోను' అంది.

ఆమె మనస్సు కోపంతో నిండి పోతున్నది.

'బాగుంది. అయితే నేను కట్టుకోవాల్సిందే. అరె, అలా నలపకు. కొట్టువాడు తీసుకోడు. అసలు చూడకుండానే వద్దనేస్తే ఎలా ? దాని ఖరీదెంతో తెలుసా? నూటపది రూపాయలు. మా ఆఫీసరు భార్య కూడా మెచ్చుకుంది.

'అయితే ఇది కూడా ఆఫీసర్ భార్యకో లేకపోతే వాను మీకోసరం ఎదురుచూస్తున్నాడు. వాడికో ఇవ్వండి !'

ఈ ఒక్కమాటతో అతనికి జయలక్ష్మి పైన కోపం వచ్చింది. అయితే ఆమె సంగతి తెలుసు. తనేమైనా అంటే మరీ రెచ్చిపోతుంది.

'వాను నిన్ను డబ్బడిగాడా?'

'అందరికి ఇచ్చేందుకు నా దగ్గర డబ్బుంటుందా ఏం?'

ఆమె ప్రతి మాట బుసకొడుతున్నది.

'నీ దెంత మిథ్యా సంస్కారం జయా !' అనుకున్నాడు ఆమె బలహీనతకు జాలి పడుతూ.

'నిజంగా చెప్పండి. నా ఉనికిని మీరు గుర్తించనప్పుడు నాకు బాధ కాక యేం మిగులుతోంది ? నేను స్త్రీని, నాకూ ఆశలు, అవసరాలు, కోరికలు వుంటాయని మీ కొకనాడైనా అనిపిస్తుందా?' అంది ఏడుస్తూ.

అతను నిర్ఘాంతపోయాడు.

'జయా ! ఎంత నీచంగా అంచనా వేస్తున్నావు నన్ను ? నా వ్యక్తిత్వం మీద అంత అపనమ్మకమా ? నీ కోరికలేం తీర్చలేదు? ఈ రోజువరకు నీకేం తక్కువ చేశాను?'

'మనశ్శాంతి తప్ప'

శ్రీధర్ విసుగ్గా లేచి షర్టు విప్పుకుంటూ 'అది నీ తెలివి తక్కువ. ఈ రోజు త్వరగా రాలేకపోయాను. కాదనను. కాని రావాలని

లేక కాదు. నేను అక్కడి స్వతంత్రుడ్ని కాదు. మన అవసరం ఎలాంటిదో మనతోటి వాళ్లది కూడా అలాంటిదే ననుకుంటాను. లేకపోతే వర్కంతా ఏ శర్మనెత్తినో పడేసి వద్దును దాన్ని నువ్వు మహాపరాధంగా పరిగణిస్తా వనుకోలేదు చదువుకున్న దానివి నా పరిస్థితి నర్థం చేసుకోగలవనుకుంటాను'

జయ మాట్లాడలేదు

'సరె, రేపు నువ్వే తెలుసుకుంటావు. నే కోరేది ఒకటి. మనిషికి చిక్కు సమస్య మనస్సు లేనిపోనివి వూహించి మనస్సు పాడు చేసుకోకు నాకు ఆకలి వేస్తోంది. అన్నం పెట్టు.'

'ఇంకా వండలేదు'

'ఇంకా ?' అన్నాడు ఆశ్చర్యంగా.

'ఇప్పటిదాకా మీ కథ, ఇంతకు ముందు దాకా మీ వాసు కథ వినటంతో సరిపోయింది ఇప్పుడు వండుతాను'

'వాసుకి డబ్బిస్తా వనుకున్నాను. ఇప్పటి దాకా నాకోసరం కూర్చున్నాడు'

'నా దగ్గ రేమన్నా డబ్బుచెట్టు వుందా?'

శ్రీధర్ ఇంక మాట్లాడలేద. అతని మనస్సంతా చికాకుగా అయిపోయింది.

రేపు పండుగ. ఆఫీసుకి శలవు ఎంతో ఉత్సాహంతో వచ్చాడు. నిజానికి ఇప్పటి కైనా రాగలిగాడు. అదంతా జయ కెలా తెలుస్తుంది? ఏమిటో ఒక్కోరోజు ఇలాగే ప్రసరిస్తుంది. అర్థం కాదు జయ మనస్తత్వం

శ్రీధర్ వాకిట్లో పడక కుర్చీలో పడుకుని సిగరెట్ వెలిగించాడు.

* * *

శ్రీధర్ భోంచేసి పడుకోటానికి వెళ్ళబోతూ అప్రయత్నంగా భార్య బీరువాతెరిచి చూశాడు అందులో నూటఇరవై రూపాయలున్నాయి

శ్రీధర్ భారంగా నిట్టూర్చాడు.

సరిగా ఈ సమయానికి వాసు పందొమ్మిది రూపాయలుపెట్టి చీర కొనుక్కుని ఇంటి కెళ్లాడు. చంద్రి వాడికోసరం వేయి కళ్లతో ఎదురుచూస్తూ నిలుచుంది.

'ఏటయింది. యింత ఆలీసెం?' అంది ఆత్రంగా. వాడిముఖం రెండు చేతులతో తడుముతూ.

'నీకేటి తెచ్చానో చెప్పుకో?'

'నాకెట్టా తెలుత్తది?'

వెన్నెల దాని కళ్లలో ప్రతిఫలించి పక్కున నవ్వింది.

వాడు చేతిలోని చీరతీసి 'సూడు, ఎట్టుందో?' అన్నాడు.

దాని గుండెల్లో ఆనందం కట్టలు తెంచుకుంది.

'శాబాబా గుంది ఎంతపెట్టి తెచ్చినావు?'

'ఎంతయిందో నీకేటి? అయ్యగారిచ్చారు నెలనెలా పట్టుకోమన్నా, అయ్యగారిది మా మంచి మనసు.'

'ఇందుకేనా ఇంతాలీసెం ?'

'అవును' అని ఉదయంనుంచి వాడింత ఆరాట పడింది చెబుతుంటే దాని కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

'ఏం మరోప్పుడు కొనకూడదా? మన మేటి కలిగినోళ్లమా?' అంది వాడిగుండెల్లో తలదాచుకుని ఆ గుండెలస్పందన దాని చెవుల్లో మధురంగా మార్మోగుతున్నది. దానికి ఆ చీరంతా వాడి ప్రేమామయ హృదయంలాగే కనిపించింది ఈ ఆత్మీయతతో మరింత బలంగా వాడి హృదయానికి అంటుకు పోయింది

ఆ రాత్రి జయ నిద్రపోలేదు చాలాసేపు. ఆమె కన్నీళ్ళు దిండులో తలదాచుకున్నాయి.

మరునాడు సాయంత్రం కాపటంతోటే వాసు చంద్రిని తీసుకుని వచ్చాడు

శ్రీధర్ ఉత్సాహంగా పడక కుర్చీలోంచి ముందుకి వంగి కూర్చున్నాడు.

'దండాలయ్య' అంది చంద్రి

'రేత్తిరి కొన్నాబాబు చీర'

దాని ముఖం నిండా సిగ్గు తెరలు కమ్ముకుంటున్నాయి.

అది తలవంచుకునే 'దండాలు బాబు.' అంది.

శ్రీధర్‌కి ఆనందం కలిగింది అంతలో తమ ఇంట్లో పరిస్థితి గుర్తు వచ్చింది జయ చీర కట్టుకోనేలేదు అప్పటికి తను రెండు సార్లు చెప్పి చూశాడు జయ వినలేదు

'నువ్వు డబ్బు ఇవ్వక్కర్లేదురా!' అన్నాడు.

'అదేంటి బాబు' అన్నాడు ఆశ్చర్యంతో.

'అంతేలేరా! మా చెల్లెలువస్తే చీర పెట్టనూ. ఇప్పుడూ అంతే అనుకుంటాను. పో—'

వాడికి అయ్యగారికి ఎలా కృతజ్ఞత చెప్పాలో అర్థంకాలేదు. మనసు మాట్లాడే మాటలు కన్నీళ్లు. శ్రీధర్ పాదాలమీద పడినయి,

'ఛీ ఛీ, ఇదేమిట్రా' అన్నాడు శ్రీధర్.

'లేదుబాబు' అన్నాడు వాసు కళ్లు తుడుచుకొని.

'అమ్మగారిని సూసొత్తా.' అంది చంద్రి లోపలికి వెళ్లబోతూ,

'అమ్మగారు పడుకున్నారు. మరోసారి చూపించవచ్చులే పోయిరండి ఇంటికేనా?' అన్నాడు శ్రీధర్.

'కాదుబాబు సినిమా చూపించమని పాణం తీత్తావుంది'

శ్రీధర్ నవ్వి 'భార్యంటే ఏమను



కున్నావు? పోయొరండి" అన్నాడు.

వాళ్ళిద్దరూ నవ్వుకుంటూ వెళ్ళి పోయారు.

శ్రీధర్ ఆనందంతో అటే చూస్తూ కూర్చున్నాడు.

జయలక్ష్మి అంతా వింటునే వుంది

ఒక్క క్షణంలో అంతా తిరిగి పోయింది ఎంత విశాల హృదయం అతనిది? తనెలా ప్రవర్తించింది?

అతను రాలేదనే బాధపడింది కాని అతని బాధ నర్థం చేసుకోలేదు అప్పటికీ అతను ఖరీదైన చీర తెచ్చాడు, తనని కట్టుకోమని బ్రతిమాలాడు. తను కట్టుకోనన్నప్పుడు అవమానంతో నిండిపోయిన అతనిముఖం చూస్తే తన కెందుకు జాలి కలుకలేదు! తన విలువను అతను గుర్తించలేదనేగాని అతని విలువను తను గుర్తించిందా? అసలాక్షణమే అటువంటిదేమొ? తను విచక్షణా జ్ఞానాన్ని కోల్పోయింది. శ్రీధర్ తన ఏ కోరిక తీర్చలేదు? కనీసం వాసుకున్న కృతజ్ఞత కూడా తనకు లేదేమొ?

అతనిముందు తన అల్పత్వం ఋజువు చేసుకుంది కాని అదృష్టవశాత్తు అతను తన సర్వస్వం 'గనుక సరిపోయింది' మరొక రైతే ఏమై వుండేది?

జయలక్ష్మి మనసు సిగ్గుతో చితికి పోయింది ఆమె మనస్సుకుపట్టిన మబ్బులు చెదిరిపోసాగినయి పశ్చాత్తాపంతో ఆమె నరాలు దహించుకుపోయినయి హృదయంలో శ్రీధర్‌పై ప్రేమగట్లు తెంచుకుంది

అతని మమతని గుర్తించక పోవటం తన దురదృష్టం ప్రతి చిన్న విషయానికి అతన్నుంచి త్యాగాన్నాశించటం తన తెలివి తక్కువ. దానికి అతని ప్రేమకు ముడి పెట్టటం తన అజ్ఞానం. తనది మిథ్యా సంస్కారంకాదా? అదృష్టంకొద్దీ అతనికి తను దూరం కాలేదు

ఆమె కళ్లలో ముత్యాల బిందువులు నిలిచినయి అద్దంలో ఆమె ప్రతిబింబం వణికి పోతున్నది!

ఆమె కన్నీటి బిందువులగుండా శ్రీధర్ జారిపోతున్నాడు. ఆ కన్నీరే ఆమె మానసిక భారాన్ని తొలగించింది

ఆమె మనస్సు తేలిక పడింది

కూర్చున్నవాడల్లా శ్రీధర్ గాజులచప్పుడు విని వెనక్కి తిరిగి చూశాడు

జయలక్ష్మి పసుపుకాళ్లతో శ్రీధర్ తెచ్చిన కొత్తచీర కట్టుకుని వచ్చి అతని కాళ్లకి నమస్కారంచేసి, అంతలో సిగ్గు ముంచుకురాగా అతనికి ముఖం చూపలేక లోపలికి పారిపోయింది ●

**అభియోగాలలో వింతలు**

# ఎనిమిదివేల పౌన్లతో తృప్తిపడిన రెండవ భార్య

ఐరెన్ ఫాన్‌స్టోన్ వయస్సు 46 సంవత్సరాలు—నర్సుగా పని చేస్తున్నది 92 సంవత్సరాల వయస్సు రోగిని ఎనిమిది నెలల కిందట ఈ నర్సు వివాహమాడింది ఆ తరువాత ఆ రోగి మరణించాడు అతని వీలునామా ప్రకారం పౌ 20 000 లు తనకు వస్తుందని ఫాన్‌స్టోన్ ఆశపడినది కానీ, ఫాన్‌స్టోన్‌కు ఇంతకు ముందొకసారి పెండ్లయిందని రుజావు కావడంతో—పాపం — పౌ 8,000 లతో తృప్తి పడవలసి వచ్చినది

ఫాన్‌స్టోన్ ఇట్లా చెప్పింది 'ఇదంతా చాలా విసుగు పుట్టిస్తోంది ఎటో అటు తేల్చుకుందా మనుకున్నాను '

అంతకు ముందు జరిగిన పెండ్లిని చట్ట ప్రకారం రద్దు చేయించుకోకుండానే డాక్టర్ ఆర్థర్ టిదర్లీని వివాహమాడిన నేరానికి ఫాన్‌స్టోన్ తొమ్మిది నెలల జైలు శిక్ష అనుభవించి క్రిందటి నెలలో విడుదలయినది ఈ రెండో పెండ్లి జరక్క ముందు ఆమెకు నలుగురు బిడ్డలున్నారు

డాక్టరు ఆర్థర్ టిదర్లీ శాస్త్రవేత్త స్వస్థలం హాంప్‌షైర్ విన్‌చెస్టర్ చేరువలోని ఇచెన్ అబ్బాస్ ఈ వివాహం తరువాత డాక్టరు టిదర్లీ వ్రాసిన వీలునామా కిందటి నవంబరులో ప్రకటితమైనది సుంకము పోగా మిగిలిన ఆస్తి విలువ పౌ 68,106 లు

ఈ వీలునామా ప్రధాన భాగస్థులలో ఒకరుగా తనకు పౌ 20,000లు వస్తుందని ఫాన్‌స్టోన్ ఆశపడినది రెండవ భాగస్థురాలు డాక్టరు టిదర్లీ కుమార్తె శ్రీమతి ఐలీన్‌మాస్టిన్

ఫాన్‌స్టోన్ తన కథ ఇట్లా చెప్పింది 'డబ్బుకోసమే ఆశపడి ఒక వృద్ధుణ్ణి కట్టుకున్నానని లోకం అంటుందని తెలుసు నాకు కానీ అది నిజంకాదు నన్ను బ్రతిమాలాడు నేను ఒప్పుకుంటే మరి కొంతకాలం బ్రతుకుతాడేమోనని అంగీకరించాను టిదర్లీని నేను ప్రేమించాను

'కానీ ఈ ప్రేమాయణం పర్యవసానంగా నేను చాలా నష్టపడవలసి వచ్చినది డాక్టరు టిదర్లీని చేసుకున్న ఫలితంగా నా యింటినీ మోటారుకారూ వదులుకొనవలసి వచ్చింది జైలుశిక్ష పడింది

'నా కొడుకూ ముగ్గురు కూతుళ్ళూ ఎదురు తిరిగారు వీధిలో కనిపించినా స్నేహితులు ముఖం తప్పించుకు పోతున్నారు ఉండడానికి కొంప దొరకడంలేదు ఉద్యోగం దొరకడం లేదు నేను పంపే దరఖాస్తులలో చాలా వాటికి సమాధానాలైనా రావడం లేదు

వీలునామా ప్రకారం పౌ 20,000లు వస్తవని ఆశపడ్డాను ఎందుకని రావో ఇప్పటికీ నాకు అర్థం కావడం లేదు కానీ ఈ గొడవంతా దేనికి? పౌ 8,000లు తీసుకుని, కొత్త జీవితం ప్రారంభించుదామనుకుంటున్నాను కానీ పౌ 8,000లు ఏ మూలకు?'

రిజిస్ట్రార్ కార్యాలయంలో డాక్టరు టిదర్లీతో కలిసి తీయించుకున్న ఫోటోను ఫాన్‌స్టోన్ చూపించి ఇప్పటికీ తను శ్రీమతి టిదర్లీగానే వ్యవహరిస్తున్నానన్నది ఇంకా యిట్లా చెప్పింది 'నాకు పెండ్లయిందయ్యా బాబూ అని చెప్పాను నీ పెండ్లి యేం బాగాలేదు నువ్వు సుఖపడడం లేదు నన్ను చేసుకోవలసిందేనని డాక్టరు టిదర్లీ పట్టుపట్టారు అదే యింట్లో వుంటున్న అతని కూతురూ అల్లుడూ వూళ్ళో లేనప్పుడు మా పెళ్లి జరిగినది

ఫాన్‌స్టోన్ మొదటి వివాహం — ఆమె 18సంవత్సరాల వయస్సున జరిగింది 1959లో రద్దయింది ఆ వివాహం 1964లో ఫాన్‌స్టోన్‌తో ఆమె పెండ్లి జరిగింది ఆ తరువాత వారిద్దరూ విడిపోయారు

1965లో శ్రీమతి టిదర్లీ మరణించక ముందు ఆ దంపతులిద్దరికీ యీ నర్సు ఉపచారం చేసేది

—వి ఎస్ అవధాని ●



# వార్తల్లో తమాషా

కేంద్ర మంత్రులకు అయ్యే
సాలుసరి ఖర్చు రూ. 22 లక్షలు




రూ 50 లక్షల
అపహరణ




అల్లరుల అణచివేతకు
హెలికాప్టర్ల ప్రయోగం

హాంగ్ కాంగ్ అధికారుల చర్య










## * దినఫలం *

నక్షత్రం రెండూ బాగున్నాయి
మీరు 40 పైసలు పెట్టి పత్రిక కొని చదువు
తారు! లేక మరొకరిది తీసి చదువుతారు!!

# మార్కెట్ ధరలు




## …య్యార దిగుమతులు




## పౌష్ట్య పనకాల కొరత వరపడా




## కనబడుట లేదు



ఇతనిని తీసుకువచ్చి మాకు కప్పగించువారు తగురీతిగ సన్మానింపబడుదురు

ఇట్లు మంచం పట్టిన తల్లి,

## రైళ్ల రాకపోకలు

మద్రాసు సెంట్రల్

రైళ్ళు వచ్చునా! పోవునా టైమింగ్స్ మాత్రం చెప్పలేము!

క్రీడారంగం

## ఎమ్.సి.సి. స్కూల్స్ పై భారత స్కూల్స్ జట్టు ఘనవిజయం




## ఆకాశవాణి

వార్తా బాధ:

కార్యక్రమాలు బెజవాడ నుంచి రిలే

విజయవాడ

కార్యక్రమాలు హైదరాబాదు నుంచి రిలే

# నేటి మన భారతదేశంలోనిది ఆధునికకళా - అనుకరణకళా ?

'సర్వవ్యాప్తియగు పరమేశ్వరునకు
సత్యమగు కళకూ హద్దులు లేవు'
అన్నారు పెద్దలు.

కళ దైవస్వరూపం 'కళ' అనేమాట వినగానే అనూహ్యంగా అపూర్వ రామణీయక ముగ్ధమోహన రూపము మన మనోనేత్రానికి గోచరిస్తుంది

చిత్రకళ అనాదిది ఆదిమానవుని విజ్ఞానాంకురములు రేఖలతో ఆరంభమై కాలక్రమమున మహావికాసమును పొందినవి. వారిచే చిత్రింపబడిన రూపాలు ప్రాచీన గుహాకుడ్యములపై గోచరిస్తున్నవి. సంస్కరణ రహితమైన ఆరేఖలూ, వర్ణాలూ కాలానుగుణ్యముగా మానవ మేధస్సు ద్వారా స్వతఃసిద్ధతకు వచ్చాయి (Realistic)

ప్రస్తుత పరిస్థితులనుబట్టి ప్రపంచం ప్రతివిషయంలోనూ పురోగమించిలది అలాగే చిత్రకళా జగత్తులోకూడా గొప్ప విప్లవముత్పన్నమయింది ఆ మహోన్నత సంచలనంవల్ల వినూత్న ప్రక్రియలు జరిగి, వివిధరూపాల్లో చిత్రకళ వెలిసింది ఈ మార్పునే ఆధునిక చిత్రకళ (Modernart) అన్నారు ఎక్స్‌ప్రెస్సివ్ఆర్ట్, ఎక్స్‌ప్రెషనిజం, ఫావిజం, క్యూబిజం, డాడాయిజం అని పలు రకాల పేర్లు పెట్టారు ఈ ఆధునిక చిత్రకళ మొదట పాశ్చాత్య దేశాలలో ఆరంభమైంది క్రమక్రమంగా దాని ప్రభావం అన్ని దేశాలలోనూ వ్యాపించింది

మన భారతావనిలో మొట్టమొదట ఆధునిక చిత్రకళను ప్రారంభించినవారు 'శ్రీ నందలాల్ బోస్' అని సగర్వంగా చెప్పవచ్చును

ప్రస్తుతం మనదేశంలో ఈ ఆధునిక చిత్రకళ బహుళ ప్రచారంలోఉన్నది కళ, కళాకారులు అభ్యున్నతికి రావడం దేశానికి మంచిదే, కాని మనదేశంలోని ఆధునిక చిత్రకళను పాశ్చాత్యుల ఆధునిక చిత్రకళతో పోల్చిచూస్తే, మనకళ కేవలం వారికళకు అనుకరణగా (ఛాయగా) ప్రస్ఫుటిస్తుందే కాని స్వప్రత్యేకత అంతగా గోచరించడం లేదు ఏదో కొద్దిమంది సుసాధన చిత్రకారుల చిత్రాలు మాత్రం వారి ప్రత్యేకతను తెలుపుతున్నాయి. మంచి కళాఖండాలుగా నిలబడ గల్గుతున్నాయి. మన ఆధునిక చిత్రకళ పాశ్చాత్యులకళకు అనుకరణ కళగా గోచరించుటకు కొన్ని కారణాలున్నాయి. ముఖ్యంగా చిత్రకళా విద్యార్థులు ప్రారంభదశలోనే క్రమ, రీతిబద్ధంగా చిత్రకళను అభ్యసించకుండా ఒకేసారి ఆధునిక చిత్రకళావరణలోనికి దూకుతున్నారు. అలా తొందరపడ్డం మూలంగా మహా భయంకర చిత్రాలు రూపొందుతున్నాయి. బలహీనమైన పునాదిలేని భవనపుస్థితి ఎలాంటిదో, కొందరి ఈ ఆధునిక చిత్రకారుల చిత్రాల స్థాయికూడా అలాంటిదే వారు వాడిన అనుకరణ రేఖలు, వర్ణాలూ తమ బలహీనతను పేలవత్వాన్ని బహిర్గత పర్చుకుంటున్నాయి ఇలాగే మనదేశంలో దాదాపు చాలమంది చిత్రకారులు అనుకరణవాదులై పోయారు

పికాసో వంటి ప్రఖ్యాత చిత్రకారుల చిత్రరచనలను చూచి అవేరంగులూ, అవేరేఖలూ తస్కరించి ఏదో ఒక చిత్రం వేసి 'బ్లూ పెయింటింగ్'అనో, రెడ్ పెయింటింగ్ అనో, బ్లాక్ పెయింటింగ్ అనో పేర్లు పెట్టి గొప్ప ఆధునిక కళా ఖండాలని ప్రదర్శించు కుంటున్నారు, నేటి ఆధునిక చిత్రకారులు కొందరు 'పిల్లి కళ్ళు మూసుకొని పాలుత్రాగుతూ తననెవరూ చూడలేదను కుంటుంది' ప్రజలంత గ్రుడ్డివారా?

పూర్వం ఒక రాజున్నాట్ట. ఆయన ఒకరోజు మంత్రితో 'మహామంత్రీ? మన ప్రజలెలాంటివారు?' అన్నాడు

'గొర్రెలవంటివారు ప్రభూ!' అన్నాడు మంత్రిగారు రాజుగారు కొంచెం ఆగ్రహోచిత్తుడై 'ఏమిటీ అలాగన్నావ్?' అన్నాడు, 'ప్రభూ! తమరాగ్రహించక నేనుచేసినట్లు తమరనుకరిస్తే మన ప్రజల బుద్ధి కుశలతను తమకు ప్రత్యక్షంగా చూపిస్తా'నన్నాడు మంత్రి

అందు కంగీకరించిన రాజును తనవెంట బెట్టుకొని, నగరి వెలుపలినదికి వెళ్ళాడు మంత్రి నదిలో తను స్నానంచేసి, ఒడ్డున కట్టివేయబడిన ఒక గాడిద చుట్టూ ముమ్మారు ప్రదక్షిణచేసి దానితోకనున్న వెంట్రుకలలో కొన్నిపీకి, కన్నుల కద్దుకొని తలపై వేసుకున్నాడు మంత్రిసరతు కొడంబడినరాజు, మంత్రిలాగే చేశాడు. 'మహారాజులాంటి వారే యిలా చేశారంటే-ఇందేదో పుణ్యముంటుంద'ని ఎంచి, ఆరేవు కొచ్చిన పెద్దాచిన్నా ప్రతిఒక్కరూ అలాగే చేశారు. పైగా పట్నంలో ప్రచారం కూడా చేశారు. నగరి వాసులంతా తండోపతండాలుగా 'అదేమిటా'ని ఆలోచించకుండా గొర్రెలమందలా అనుకరించారు వారి అజ్ఞానానికి రాజు విచారించాడు. మారు పలుకకుండా మంత్రితో సౌధము చేరుకున్నాడు.

అంతటి హీనస్థితికి దిగజారిపోయింది, మనదేశపు ఆధునిక చిత్రకళ. ఎవరో గొప్పవారు చేశారు, 'నేనుకూడా చేయాలి' అని తొందరపడటం పొరపాటు. ఆ చిత్రకారులు ఎంతటి కృషిచేశారో, ఎన్ని సాధకబాధకాలను భవించి ఆస్థితికివచ్చారో తెలుసుకోకుండా మూర్ఖంగా ప్రవర్తించడం అనుచితం ఏవో పేడలా వాలుగు రంగులు పులిమినంత మాత్రాన ఆధునిక పెయింటింగ్ అనిపించుకుంటుందా?

'విల్లుబట్టిన ప్రతివాడూ వేటకాడేనా?'

ముఖ్యంగా చిత్రకళా విద్యార్థులు బాగా కృషిచేయాలి విషయం తెలుసుకోవాలి. పురోగమించాలి అప్పుడే వినూత్న చిత్రరాజములు వెలువడతాయి వాడిన ప్రతి రంగులోనూ, గీసిన ప్రతిరేఖలోను చిత్రకారుని గొప్ప అనుభవం గోచరిస్తుంది ఆ చిత్రం పదికాలాలపాటు నిలబడు గల్గుతుంది.

మనదేశంలో ఎందరో ఉత్తమ చిత్రకారులు అజ్ఞాతంగా ఉండిపోయారు మన ప్రభుత్వం, కళాభ్యున్నతిని కోరే సంస్థలూ వర్గభేద రహితంగా, నిష్పక్షపాత బుద్ధితో మంచి చిత్రకారులను ఎన్నుకొని, వారికి తగిన వసతులు కల్పిస్తే జాతిరత్నాల వంటి ఉత్తమ చిత్రకారులు ఎందరో తయారౌతారు. ఇప్పటికే చాలమంది చిత్రకారులను సదవకాశాలను కల్పించిన మన ప్రభుత్వం శ్లాఘనీయమైనది ఇంకా అభివృద్ధిపరిస్తే ఎన్నో ఉత్తమ ఆధునిక చిత్రకళాఖండాలు వినూత్న ప్రక్రియలతో వెలువడతాయి. మన సంస్కృతిని కొనియాడుతుంది అదే మన ఆధునిక చిత్రకళా ప్రగతి.

-గెనిసెట్టి ●

# క్రొత్త
## టినోపాల్ యొక్క మితవ్యయ ప్యాక్




టినోపాల్ యిపుడు క్రొత్త మితవ్యయ ప్యాకులో కూడా దొరుకుతుంది. ఇప్పుడు బట్టలను యిది వకటి కంటె తక్కువ ధరలో తెలుపు చేయవచ్చును—టినోపాల్ యొక్క క్రొత్త మితవ్యయ ప్యాకుతో—నేడే కొనండి. ఒక ప్యాక్ చాలా రోజులు వచ్చును—చాలా పొదుపుచేయును. మీ కుటుంబము యొక్క బట్టలను ఎప్పుడునూ టినోపాల్‌తోనే తెలుపుచేయుడు. శాస్త్రయుక్తమైన తెలుపుచేయువస్తువు. చెంచాలో నాల్గవవంతు ఒక బాల్చీడు బట్టలను తెలుపు చేయును.

**సర్వోత్తమ తెలుపుకోసం టినోపాల్**

ఏరుకొనుటకు మూడు టినోపాల్ ప్యాకులు:




బాల్చీకి సరిపోయే పొట్లము




రెగ్యులర్ ప్యాక్




క్రొత్త మితవ్యయ ప్యాక్



®'టినోపాల్' జె. ఆర్. గెగీ, ఎస్. ఎ. బాల్, స్విట్జర్లెండ్ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు

సుహృద్ గైగీ లిమిటెడ్, పోస్టు బాక్సు నంబరు 965, బొంబాయి-1 (బి.ఆర్.)

shilpi sgt 27a/67 tl




'టప్' మని తలమీద ఏదో పడటంతో చదువుతూన్న భాగవతాన్ని ప్రక్కన పెట్టి, తల తడుముకున్నాడు, సీతారామయ్య చేతిలోకి ఒక గడ్డిపోచ వచ్చింది. ఓసారి మీదికి చూసి సీతారామయ్య గుప్తంగా నవ్వుకున్నాడు. ఆ నవ్వులో ఉండవల్సిన సహజత్వం లేదు. ఆ స్థానంలో ఏదో వెలితి, పూడుకుపోయిన బాధ, ఆలోచనల కెరటాలు చోటు చేసుకున్నాయి. ప్రస్తుతాన్ని వదిలి పూర్వాన్ని గుర్తు చేసిన ఆ గడ్డిపోచ అతని చేతినుండి దూరంగా విసిరేయబడింది. అందుకోసమే నిరీక్షిస్తున్నట్లుగా ఆ గడ్డిపోచని రివ్వున వచ్చి అందుకుని గూటిని చేరుకుంది పిచ్చుక. అలా అది కొన్ని వందలసార్లు చేస్తూంది.

వానా హైరానాపడి గూటికోసం గడ్డిపోచలు తేవటం, వాటిని చూరు మధ్య వాసం మీద నిల్పబోతే అవి విలవిల పడిపోవటం, మళ్ళీమళ్ళీ ఇదే పని! పెట్టే గూటికి ఆదిలోనే విఘాతం వస్తుందని తెలిసి వాటికా తాపత్రయం దేనికి? ఆ గూడు ఎప్పటికైనా నిలుస్తుందని తమ కష్టానికి ఫలం దక్కకపోదని ఆత్మవిశ్వాసమా, వాటికి? లేక ప్రతిఫలాపేక్ష లేని ఒకవిధమైన వ్యాసంగమా వాటికది ? ! ... ఏమైనా పాపం, వాటిది ఎవ్వరూ మెచ్చని కష్టం...

మరో గడ్డిపరక ... కాదు! పీచు ఒళ్ళో వచ్చి పడింది. సీతారామయ్య నిర్జీవంగా నవ్వుకున్నాడు. దాదాపు బోసిగా ఉన్న వాసం చివర్న ఆడ, మగ పిచ్చుకలు రెండూ గోలగా అరుస్తున్నాయి గెంతుతున్నాయి. అటే చూస్తూండిపోయాడు సీతారామయ్య.

* * *

'చెల్లి పుట్టింది!'

తెలుగు పీరియడు [illegible] ఈ వార్త సీతారామయ్య చెవిన పడింది. అయిదోక్లాసులో, నాలుగో బెంచీ మీద, రెండో వరసన కూర్చున్న సీతారామయ్య అనే పదేళ్ళ అబ్బాయి గభాలున లేచి మాస్టారేదో అనబోతే, వినిపించుకోకుండా ఇంటికి పరుగుతీశాడు. తెలుగు మాస్టారు తెల్లబోతూ ఉండిపోయారు.

సీతారామయ్య అంత ఉత్సాహికుడు కావటానికి కారణం అతని తర్వాత తల్లికి మరి సంతానం లేకపోవటమూ, అతనికి చెల్లి కావాలనే బలమైన కాంక్షానూ.

అతడి స్నేహితులు బుచ్చిబాబు, సోమిశెట్టి, కన్నారావూ వీళ్ళందరికీ ఒక్కొక్కరూ, ఇద్దరూ చెల్లెళ్ళున్నారు. వాళ్ళకి చెల్లెళ్ళుంటే తనకేమిటని సీతారామయ్య పూరుకునే వాడేమోగాని వాళ్ళలా అతడిని వూరుకోనివ్వలేదు.

'ఎంచక్కా మాకు ఇంతమంది చెల్లాయి

లున్నారు. నీకు చెల్లాయిలు తమ్ముళ్లు ఎవరూ లేరు. ఒంటిపిల్లి రాకాసివి.'

ఇలా రకరకాలుగా ఆతడిని గేలిచేసే వాళ్లు. సీతారామయ్యకి వెంటనే పౌరుషం తన్నుకు వచ్చేది. తనకీ చెల్లాయి వుంటే వీళ్లిలా వెక్కిరిద్దురా? అనుకునేవాడు.

సీతారామయ్యకి చెల్లి కావాలనే కోరిక తీవ్రమవడానికి మరో సంఘటన కూడా తోడయింది.

బుచ్చిబాబుకీ సీతారామయ్యకీ ఓనాడు ఏదో విషయం మీద జగడం వచ్చి, అది పెరిగి కొట్లాటలోకి దిగింది. స్వతహా బలిష్టుడైన సీతారామయ్య చేతిలో బుచ్చిబాబు చావుదెబ్బలు తినేవాడే, గాని, ఆ ఇద్దరూ ఊహించని విధంగా బుచ్చిబాబు నలుగురు చెల్లెళ్లు ఒక్కుమ్మడిన వచ్చి, సీతారామయ్యని ఒక్కడిని చేసి! అన్నతో కలిసి అతడిని మెత్తగా తన్నారు. ఆ అయిదుగురి ముందు తనబలం చాలలేదు, సీతారామయ్యకు.

ఎన్ని శక్తులున్నా ఏ వ్యక్తీ ప్రపంచంలో నాకేమని ఒక్కడూ బ్రతకలేడు. ఏదో ఒక ఆసరా...సర్వదా అతడి క్షేమం కోరే ప్రాణి ఉండాలి. వెనక నీడలా నిలిచి, నీకు నేనున్నాననే ధైర్యం ఏర్పరచినపుడు, ఎన్ని ఒడిదుడుకుల్ని కూడా ఆ వ్యక్తి నిర్భయంగా, సుకరంగా దాటగలడు!

ఇంతవరకు అప్పుడు సీతారామయ్య ఆలోచించకపోయినా, తన వారనే మనిషి ఒకరు తోడు ఉండటం అత్యవసరం అనిపించింది అతనికి.

తనకున్న లోటుని, అసమర్థతను పదే పదే వెల్లడిచేసి, హేళనచేసే స్నేహితులను ఏమీ చెయ్యలేక, నాన్న ఎదుట తన కోరికను బయటపెట్టడానికి జంకు గనక, అమ్మ మీదికి దండయాత్ర చేసేవాడు.

'అమ్మా, నాకు చెల్లి కావాలే'

'నువు నాకు చెల్లినిస్తావా, లేదా చెప్పమ్మా'

తన నోటివెంబడి ఈ ప్రశ్న విన్న నాలుగైదుసార్లూ తల్లి ముసిముసిగా నవ్వుకోవటమూ, మౌనంగా వుండిపోవటమూ సీతారామయ్యకు ఉడుకుమోత్తనం తెప్పించింది. నిరాహారదీక్ష చేశాడు. మౌనవ్రతం పట్టాడు. ఎంత సమరం సాగించినా తల్లీ, తండ్రీ బ్రతిమాలటమూ, ఓదార్చటమూ, మందలించటమే చేస్తున్నారుగాని, చెల్లినిచ్చే ఉద్దేశం కనపరచరెందుచేత ? అని తీవ్రంగా మథనపడ్డాడు. చివరికి, తను వాంఛించింది లభ్యమవనపుడు మనిషిలో చోటుచేసుకొనే నిస్పృహ సీతారామయ్యను ఆవరించింది.

ఇలా ఉండగా, ఓనాడు సీతారామయ్య తల్లి, అతను బడినుంచి వచ్చేసరికి చెప్పనే చెప్పింది తియ్యని కబురు. ఎగిరి గంతేశాడు. పుస్తకాలు ఆఫళాన పడేసి, తిప్పున ఇంట్లోంచి పరిగెత్తి, గర్వంగా స్నేహితులందరితో చెప్పేశాడు. వాళ్లు నవ్వారు.

'చెల్లే పుడుతుందని నీకెలా తెలుసోయ్? మా రెండో చెల్లి పుట్టినపుడు మా ఇంట్లో అందరం నాకు తమ్ముడు పుడతాడని పందాలు కూడా వేసుకున్నాం. చివరికేమయింది?' అన్నాడు వాళ్లలో ఒకడు.

సీతారామయ్య చిన్ని గుండెలో సంతోషమంతా ఇగిరిపోయింది.

ఆ రాత్రి అన్నం తింటున్నపుడు తల్లితో అన్నాడు: 'అమ్మా, నాకు తమ్ముడు పుడితే వాణ్ణి చంపేస్తాను. నాకు చెల్లే కావాలి.'

'ఛా! వెధవకానా! ఎవరయితేనేం ? పోనీ చెల్లే పుడుతుందిలే. ఊరుకో' ఆవిడ నవ్వుతూ కసిరింది కొడుకుని.

సీతారామయ్య ముందుగా ఏర్పాటు చేసుకున్నప్రకారం అతడికి చెల్లే పుట్టిందనే వార్తని ఇంట్లో పనిచేసే కుర్రాడు మోసుకొచ్చి అతడి చెవిన వేశాడు. ఏ వార్తకోసమైతే సీతారామయ్య ఇన్నాళ్లుగా ఎదురుచూస్తున్నాడో, అదే వినిపించినపుడు తను ఉన్నది బడిఅయితేమటుకు అక్కడ ఎలా నిల్చి ఉండగలడు ?

బడినుంచి పదినిముషాల్లో ఇల్లు చేరుకున్న సీతారామయ్య చెల్లిని చూడాలనే తహతహలో గుమ్మానికి కాలుతగిలి బోర్లాపడ్డాడు. అప్పుడే లోపల్నుంచి వచ్చిన అమ్మమ్మ 'అయ్యోపాపం' అనకుండా 'అఖండుడివిరా అన్నమాట నెగ్గించుకున్నావు' అంటూ లేవదీసింది. సీతారామయ్య మణుకు సర్దుకొంటూ అమ్మగదిలోకి వెళ్లాడు. తెల్లటి పక్కమీద బంగారపు బొమ్మలా మెరిసిపోతుంది చెల్లాయి. వెంటనే ఎత్తుకుని ముద్దుపెట్టుకోవాలనిపించినా, తన మురికి చేతులతో తాకితే మాసిపోతుందేమో అనుకొని అప్పటికి వూరుకున్నాడు. ఆ రోజునుంచి తన అపురూపమైన చెల్లెల్ని పైవాళ్లనెవర్నీ ముట్టనిచ్చేవాడు కాడు. కన్నుచాటయి ఎవరేనా పాపని చేరితే నానాహంగామా చేసేవాడు. పాపపేరు వాణి.

వాణి మూడేళ్లదై వుండగా ఆ పిల్లకి ఓనాడు ఫెళ్ళున జ్వరం వచ్చింది. ఇంట్లో అందరూ పిల్లచుట్టూ మూగి కంగారు పడుతూంటే సీతారామయ్య అక్కడ ఉండకపోవడం తండ్రికి విస్మయం కలిగించింది. 'ఇదేమిటి ? చెల్లి చెల్లంటూ తిరిగే వీడు ఎక్కడికిపోయాడు చెప్మా!' అనుకొని ఇల్లంతా వెతికారు. దేముడుగదిలో రెండు చేతులు జోడించి కళ్లుమూసుకు నిలుచున్నాడు సీతారామయ్య. 'ఏరా, ఇక్కడేం చేస్తున్నా' వంటే, 'చెల్లికి నేగిరం జ్వరం తగ్గించెయ్యమని దేవుణ్ణి ప్రార్థిస్తున్నా'నన్నాడు.

'వీడికెంత ఆపేక్షో చెల్లెలిమీద, చూశారా!' అని ఆ ఇంట్లో ఆశ్చర్యంగా చెప్పుకున్నారు అంతా.

వాణి ఆరేళ్లదయింది. ఇప్పుడు చెల్లి తప్ప వేరేలోకములేదు సీతారామయ్యకు. ఆటా, చదువూ అన్నీ ఆపిల్లతోనే. బడినుంచిరాగానే 'ఒరే అన్నయ్యా' అంటూ వాణి ఎదురువెళుతుంది. పుస్తకాలు అక్కడే వదిలేసి చెల్లెల్ని గభాలున ఎత్తేసుకొని ముద్దులవర్షం కురిపిస్తాడు. తన పుస్తకాలు దగ్గరపెట్టి చెల్లికి చదువు నేర్పడానికి, ఆమెను తనతో సమానస్థాయిదాకి తెచ్చేయటానికి, సీతారామయ్య పడే తంటాలు చూస్తే ఆ తల్లిదండ్రులికి గర్వం, ఆనందం ఒక్కుమ్మడిన కలిగేవి.

గవర్నమెంటు గుమాస్తా చేస్తున్న విశ్వపతికి తను ఉన్నా లేకపోయినా కొడుకు కూతురుకేమీ లోటువెయ్యడన్న ధీమా! వాడి అభిమానం చూస్తే తను తిన్నా, తినకున్నా చెల్లెల్ని సుఖపెట్టగలడన్న స్థయిర్యం కలిగేవి. 'అవి చాలవేనాకు?'అని అని అతను గర్వంగా చెప్పుకొంటే ఏమన లేక సజల నేత్రాలతో చూసేది భార్య!

సీతారామయ్య ఎస్సెల్సీ దాటేసరికి వాణి పుస్తకం పూర్తిచేసింది. సీతారామయ్య ఇంటరులో చేరాడు.

ఇంటరు పూర్తయేలోపునే అతను తన తలకి మించిన బరువైన సమస్యల్ని ఎదుర్కొనవలసివచ్చింది. మహమ్మారిలా ఆ ఊర్లో విరుచుకుపడిన కలరా అనేకమందితో బాటు సీతారామయ్య తండ్రినీ కబళించి

వేసింది. ఇంటి కప్పు కూలిపోయిందా విశ్వ పతి బ్రతికున్నరోజుల్లో వచ్చే ఆదాయం ఖాలక, ఇల్లు గడవటానికిచేసిన అప్పులికి పరిహారంగా ఉన్న ఇల్లు చెల్లు అయింది.

గాలివాన ఉధృతానికి ఏటో దిక్కుచేరిన పక్షికూటమిలాగా ఒక అద్దెపంచలో తల దాచుకున్నారా ముగ్గురూ. ఇహ పైసాకి చెల్లనమకున్న సీతారామయ్యకు కారు చీక టిలో కాంతిరేఖలాగా ఉద్యోగం దొరికింది. గుట్టుచప్పుట్టుగా రోజులు వెళ్ళబుచ్చు తున్నారు కాలం సవ్యంగా సాగితే, మనిషికి సమస్యలే లేకపోతే అది జీవితమే అనబడ దేమో! అంతలోనే మరొక దెబ్బ!' చెల్లినో ఇంటిదాన్ని చెయ్యవలసిన పూచీ నీకే ఉన్న'' దని చెప్పి ఓ అర్ధరాత్రి అనుకోకుండా వచ్చే పిలుపుని అందుకుని వెళ్ళిపోయింది, సీతారామయ్య తల్లి!

కష్టాలు మానవులికి రాకపోతే మానవతికి విలువెక్కడ? ఉన్నాయా?

ఇబ్బందులు పేకదొంతర్లులాగ ఒక దానిపై ఒకటి చెప్పి మరీ పడతాయా అని చిన్నప్పుడు అమ్మమ్మ చెప్పే కబుర్లు ఒక్కొక్కటే అనుభవంలోకి వచ్చి పడు తూంటే తలబొప్పి కడుతూంది పాపం, సీతారామయ్యకి పైకి ఏడ్వటానికయినా చెల్లె లికి అవకాశం ఉంది. తనకదీలేదు! దాని ముందు కళ్ళనీరు పెట్టుకుంటే బెంబే లెత్తిపోతుందని చాటుగానే కుమిలేవాడు. ఇరవై ఏళ్ళకే అరవై ఏళ్ళ అనుభవాల్ని

# పాపం సీతారామయ్య

సంతరించుకున్నాడు, మానసికంగా బడుగైన సీతారామయ్య!

పుత్తడిబొమ్మ అవనీ, సుగుణాలరాశి అవనీ, మూడుముళ్ళు మెడలో పడటానికి ఈ అర్హతలెందుకూ పనికిరావు. పెళ్ళికొడుకు లతో సీతారామయ్య సమరం సాగిస్తుండగానే వాణి పైటకట్టింది. ఇప్పుడామెలోకం పోకడని అర్థం చేసుకోగలుగుతూంది. అన్నతో 'ఎందుకురా ఈ తిప్పలన్నీ మన్వింత ఇబ్బందిపడుతూ నాకు పెళ్ళిచెయ్యకపోతే జరగదా ఏమిటి మనకు? నన్ను ఇంకా చది వించు. ఉద్యోగంచేస్తాను' అంటూంది. అన్న గారు నవ్వి ఊరుకునేవాడు. అతనికి తెలును కబుర్లు వాస్తవం ముందు నిలువవని.

తనకి చాలామంది స్నేహితులున్నారు అశేషమైన ఆశయాలకోసం అశ్రులుచావే వాళ్ళున్నారు. స్టేజిలెక్కి గొంతులు చించు కునేవాళ్ళున్నారు. తను చెప్పే ఆశయం కోసం, స్నేహితుడు అనే సత్సంకల్పబుద్ధితో అతడి చెల్లెల్ని మనువాడే మొనగాడేలేడు.

సీతారామయ్య గొర్రెతోక జీతంలోనే అష్టకష్టాలుపడి వెయ్యిరూపాయలు కూడ గట్టి, మరికొంత అప్పుచేసి ఓ సంబంధం తెచ్చాడు. పెళ్ళికొడుకు మూలగకపోయినా అత్తమామలు చిర్రుబుర్రులాడారు. ఆడబడు చులు ముష్టికట్నం అంటూ మూతులు మూరెడటూ బారెడటూ ఆడించారు. ఎలాగే

మన్నా పెళ్ళిమాత్రం ఆగిపోలేదు. అందుకు ఆనందించాడు సీతారామయ్య ఇటు ఎవరూ లేనందున అత్తవారివేపే పంద విస్తళ్ళు లేచాయి.

అత్తగారి హయాంలో వాణి నరకం అనుభ వించింది. ఇంటెడు చాకిరీ, ఏపనిలోనూ సంతృప్తి కనపరచకపోగా సాధింపులు,మనసుని చిల్లులు పొడిచే దూషణలు ఆమెకు అత్త వారింట్లో లభించేవి. అత్తవారింటికి సాగ నంపుతూ వాణికి ఇరవై కవర్లు, కార్డులు వగైరా సరంజామా చేతికి ఇచ్చాడు సీతా రామయ్య తరవాత చెల్లెలునుండి తనకు ఒక్క ఉత్తరమైనా రాలేదే అని వాపో యాడు. పెళ్ళయిన మొదటి పండుగకి చెల్లెల్నీ బావమరిదిని ఆహ్వానించబోగా అవ మానం ఎదురయింది కట్నం తప్పితే ఒక్క లాంఛనమైనా చెల్లించని ఆ దౌర్భాగ్యపు పుట్టింటికి వెళ్ళకపోతే ఏ మొచ్చింది అని వాణిని అత్తగారు ఆపివేసినట్లు ఆమెనుండి ఉత్తరం వచ్చింది.

చెల్లెల్ని చూడకుండా ఒక్కగంటయినా ఉండలేని సీతారామయ్య పండగకి పిలవటం పేరుతోనైనా చెల్లెల్నితెచ్చి పదిరోజులు ఉంచుకోవచ్చు అని పడిన ఆశ నిరాశే అయింది ఇక ఉండబట్టక చెల్లెలికి బావ మరిదికి కొన్ని బట్టలు పట్టుకుని అత్త వారింటికే ప్రయాణమయ్యాడు.

ఏదో పనిమీద కొంగుకు చేతులు తుడుచు కుంటూ సావిట్లోకి వస్తున్న వాణి, గుమ్మం అవతల పంచె కట్టుకు నిల్చున్న అన్నగార్ని చూచి సంతోషం ముప్పిరిగొనగా 'అన్నయ్యా!'' అంటూ ముందుకి వెళ్ళ బోయింది అంతలో అత్తగారు మహం కాళిలా వచ్చి ఇద్దరికీ నడుమ నిల్చుని తలు పులు భళ్ళున మూసేసింది.

తనకి జరిగిన ఈ అవమానం సీతారామ య్యను కలతపరచలేదుగాని, ఆరెండు నిము షాల వ్యవధిలోనూ కనిపించిన చెల్లెలిరూపం అతడిని కంటతడిపెట్టించింది.

ఎముకలు తేలి, కళ్ళు లోతుకుపోయి అస్థిపంజరంలా కనిపిస్తున్న వాణి, తను అపురూపంగా చూచుకొన్న వాణేనా అను కొంటూ, పిచ్చివాడిలా అయిపోయి తిరుగు ముఖం పట్టాడు.

బావ భద్రాచలంకి బందరు బదిలీ అయిం దని సీతారామయ్యకి తెలిసింది. చీకట్లో



కొట్టుకుంటున్న వాడికి ఏదో వెలుగు కని పించినట్లు ఆనందించాడు భార్య తీసుకుని భద్రాచలం బయల్దేరిన పదిరోజులకే తనూ బందరుకి మకాం మార్చేసుకున్నాడు సీతారామయ్యకు అత్తగారితో వైరంగాని బావతో ఎన్నడూ వైరంలేదు బావ తమిం ట్లోనే ఉండమన్నాడని ఇంకా మురిసి పోయాడు

ఉదయం బజారుపని తర్వాత ఉద్యోగం సాయంత్రం చెల్లెమ్మ పిల్లల్ని ఆడించటం

చెల్లెమ్మ సామీప్యంలో ఉండగలిగే అదృష్టం పట్టిందన్న తృప్తి, ఇంతకంటే వేరే ఏం కావాలనే నిర్విచారంతో దినాలు, మాసాలు, సంవత్సరాలు దొర్లించేస్తున్నాడు, సీతారామయ్య, వాణి అత్తవారింటికి కాపు రానికి వెళ్ళిన రోజుల్లో ఏమీచక క్షణం ఒక యుగంలా గడపిన సీతారామయ్యకు ఇప్పుడు తన గురించి ఆలోచించుకుందికి కూడా తీరుబడి లేనంత త్వరితంగా కాలం పరిగెడుతూంది

'ఏమండోయ్ సీతారామయ్యగారూ, ఎటు ఇలా బయల్దేరారు?'

'ఇదుగో ఈ చంటిదానికి నిన్న రాత్రి నుంచి ఒకటే జ్వరం, డాక్టరుకి చూపిద్దా మని తీసుకువెళుతున్నాను'. .

మరోకసారి రోడ్డుమీద—'అంత హడా వుడిగా పరిగెడుతున్నారేం, సీతరామయ్య గారూ ఇంట్లో ఎవరికైనా '

'అబ్బెబ్బే అదేం లేదులెండి, ఈ కూరల వెధవలున్నారు చూశారూ బజా రికి వెళ్ళడానికి బద్ధకించి వాడికలు పెట్టు కుంటే వాళ్ళిష్టం మొచ్చిన ధరలు చెబుతూ, చచ్చుపీ, పుచ్చుపీ అంటగడు తున్నారు పదడుగులు నడిచి తెచ్చుకుంటే ఈ బాధలుండవు చూడండి మరి పన్నెండు అరగంటలో తిరిగి రాకపోతే ఆఫీసు కందను .' పరిగెడుతూనే జవాబు

పెద్ద మేనకోడలు పడేళ్ళదాన్ని ఫస్టు ఫారంలో చేర్పించాలి

కడసారి దానికి హాస్పిటల్ నుంచి మందు తేవాలి

ఎడపిల్లవాడిని—ఇంట్లో వుంటే తల్లిని పనిచేసుకో నివ్వడు గనక — ఎక్కడైనా షికారు తిప్పి తీసుకురావాలి

మధ్య మధ్య చెల్లెమ్మ కొన్నప్పుడు— వంట వచ్చినవాడు కావటాన ఆ డ్యూటీ అతి తనదే !

ఊపిరి తిరగని పనులతో సీతారామయ్య చిక్కి సగమవుతున్నా, 'ఏరా, అన్నయ్యా మా సంసారంతోనే నీ జీవితాన్ని తెల్లవా ర్చేసుకుంటున్నావు నీ సంగ తెప్పుడు చూచు కుంటావు' అని చెల్లెమ్మగానీ, బావగారు గానీ అడగరేమని ఇరుగూ, పొరుగూ చెవులు కొరుక్కునేవారు.

అవేమీ తనకు పట్టనట్టు తిరుగు తున్న సీతారామయ్యను ఒకరు సాహసించి అడిగేశారు కూడా నవ్వేసి 'ఆఁ నేను తప్పుకుంటే చెల్లెమ్మొక్కర్తీ అంత సంసా రంతో ఎలా నెట్టుకొస్తుంది' అన్నాడు సీతారామయ్య

ఎదురింటి సుబ్బయ్య పెళ్ళాంతో 'చూశావటే ఆ నిబ్బరం ఏదీ—మీతమ్ము డూ ఉన్నాడు, ఎందుకూ అటునుంచి నన్నే ఊడ్చేస్తున్నాడు' అన్నాడు 'చాల్లెండి. మీ గడుసు కబుర్లకేమొచ్చె ఆ సీతారామయ్య కెందుకొచ్చిన తిప్పలవి ? ఏనాటికైనా తన వాళ్ళవుతారు గాని అంత్యకాలం వస్తే ఈ చెల్లెలూ పిల్లలూ కాలుకా, చెయ్యికా ఆసరా అయ్యేది? వంట్లో ఓపికా, చేతిలో డబ్బూ ఉన్నన్నాళ్ళు అలా పీక్కుతింటారు ' విరు చుకు పడింది సుబ్బయ్య పెళ్ళాం.

నాలుగు పదులు నిండిన సీతారామయ్యకి ఒక సంబంధం కుదుర్చుకొని వచ్చాడు బావమరిది అమ్మాయికి నా అన్నవాళ్ళెవరూ లేరు టైపిస్టు పని చేస్తున్న ఆఅమ్మాయి సీతారామయ్యకు ఈడే అవుతుంది సీతారా మయ్య ఈ వివాహానికి యిష్టపడితే అంతా కలిసి ఒకే ఒక కప్పు క్రింద తోడు నీడగా ఉండవచ్చు బావమరది చెప్పిన భోగట్టా విని, చెల్లెలి బలవంతం మీద వెళ్ళి ఆ అమ్మాయిని చూసి వచ్చాడు, సీతారామయ్య. త్వరలోనే ఆ యింట్లో ఒక గది సీతారా మయ్య దంపతులకు ప్రత్యేకించబడింది

ఇప్పుడు సీతారామయ్యకు కాలం ఎంత మధురంగా గడుస్తూందో, అంత అసం తృప్తిగానూ నడుస్తూంది భద్రాచలం, వాణి విసరే విసుర్లు, వెలిబుచ్చే అసంతృప్త ధోరణులు, బయల్పరిచే నర్మగర్భ సంభా షణలు ఆ దంపతులను ఉక్కిరి బిక్కిరి చేస్తున్నవి తమ ఉనికి వాళ్ళకి అంత కిట్టనపుడు పట్టుదలగా ఈ పెళ్ళి జరిపించడం దేనికి ? లోకం నోళ్ళు మూయించడానికా ?

స్వతహా అభిమాని అయిన సీతారామయ్య భార్య కామేశ్వరి, తానిది సహించలేక, తగినట్టు వెంటవెంటనే జవాబులు ఇచ్చేది

రాయీ, రాయీ రాపిడి అవాలేగాని, అగ్గి ఎంతసేపటిలో పుట్టారి ?

నాలుగురోజులకోమారైనా ఆ ఇంట్లో ప్రచ్ఛన్నసమరం జరిగేది

కామేశ్వరి ఓనాడు భర్తని అడిగేసింది. 'మన కష్టం మనం పడుతూ ఎందు కొచ్చిందీ కొలువు ? ఈ ఇల్లు వదిలిపోదాం కసుర్లు తినడానికి, చాకిరీ చెయ్యడానికి మీకైతే చెల్లెలూ, పిల్లలేమోగాని, నాకేమీ కారు వీళ్ళు.'



# పాపం సీతారామయ్య

సీతారామయ్యకు చెల్లెళ్ళ, పిల్లల్ని విడిచి వెళ్ళటం ఇష్టంలేదు ప్రీటికీ మాటికీ జగడాలతో హోరెత్తే ఆ ఇంట్లో మసలటమూ ఇష్టంలేకపోతూందీమధ్య తటస్థంగా వుండి పోయిన భర్త వైఖరిని చేతకానితనంగా ఎంచి 'ఇహ నేను వీళ్ళతో అడ్జెస్ట్ అయివుండ లేను మీ ఇష్టం. నాతో వస్తేరండి లేకుంటే ఉండండి' అని బయల్దేరింది కామేశ్వరి భార్యకు ఇక అభ్యంతరం చెప్పలేక తనూ ప్రయాణమయ్యాడు సీతారామయ్య

భద్రాచలం బావగారిమీద ఎగిరిపడ్డాడు. 'ఇంతకాలం నా ఇంటవుండి నా పిల్లలు ఎదిగేవేళకు నీ త్రోవ నువు చూసుకుంటు న్నావు. కృతఘ్నత మంచిదికాదు' అని నిందించాడు.

ఆవాక్కయిన సీతారామయ్య అడుగు కదపనేలేకపోయాడు

'చెల్లెలి పంచన చేరినవాడివి పౌరుషం, అభిమానం లేని మగాడివి!' అని ఛీత్కారం చేసి వెళ్ళిపోయింది కామేశ్వరి

'పోతే పోయింది. లోపలికి రా మంచికీ, మర్యాదకూ విలువ ఇవ్వటం ఎంతమందికి చాతనౌవుతుందిలే' అని అన్నగారి చెయ్యి పట్టుకుని ఇంట్లోకి తీసుకువెళ్ళింది వాణి కళ్ళనీళ్ళు పెట్టుకొని 'అమ్మా, నాన్నా వుంటే నన్నిలా నడిసముద్రంలో ఓడలా వదిలేద్దురా నువ్వు ఉన్నందుకు వాళ్ళలేని లోటు పూడ్చవలసిన బాధ్యత నీకు ఉందం టావా, లేదురా?' అంటుంటే కరిగి నీరయ్యాడు సీతారామయ్య

అవిధంగా సీతారామయ్య దాంపత్యం మూన్నాళ్ళ ముచ్చటయింది.

సీతారామయ్య చెల్లెలూ, బావమరిదీ చెప్పినట్టు కామేశ్వరి మర్యాదా, మన్ననా లేని ఆడదనీ భర్తకు గౌరవం ఇవ్వనేర్వని దంటే నమ్మాడుగాని, స్త్రీ తన భర్తలో అన్ని అవగుణాలకంటే ఎక్కువగా చేతకాని తనాన్నే క్షమించలేదని గ్రహించలేక పోయాడు.

మరొక పదేళ్ళ కాలంలో కలిసి పోయాయి. పిల్లలు పెద్దవాళ్ళయ్యారు వయసు పెరిగి బుద్ధి మందగించినదేమో, వాళ్ళ పెంచిన మేనమామనే ద్వేషించారు దూషించారు

సీతారామయ్య, భద్రాచలం చెరొక అయిదువేలు వేసుకొని కట్టించిన డాబా ఇల్లు, అతను పిల్లలకోసం ముచ్చటపడి కొన్న బీరువాలలో ఒకటి సీతారామయ్యను ఆ ఇంటినుంచి నడిపించడానికి కారణ మయ్యాయి 'ఖర్మం చాలక' అన్నట్టు దొంగలుపడి బీరువా ఎత్తుకుపోయారు గాలివానావచ్చి కొత్తడాబా చిల్లుపడింది

'ఎప్పటికైనా పరాయివాడివే అనిపించా వులే, మామయ్యా' అన్నాడు పెద్ద మేనల్లుడు

మిగిలిన బీరువాకూడ తీసేసుకో!' అని [illegible]

'ఎవరిల్లో అన్నట్టు చూస్తూ వూరు కుంటే ఇల్లు తగలబడక ఏమవుతుంది? ఎంత సొమ్ము తినేశాడో, ఏమిటో, ఆ మేస్త్రీ వెధవ!'

పెద్ద మేనకోడలు మామయ్యకి వినిపిం చేలా తల్లిదగ్గర అరిచింది.

సీతారామయ్యలో సహనం చచ్చిపోయింది. నాలిక తడిచేసుకొని 'అయితే ఇదంతా నా కోసమట్రా చేశానూ' అని అరిచాడు, కీచుగా.

'కాక, మరేమిటి? పైకి మాకే అంతా పెడుతున్నట్టు నటన! లోకం దృష్టిలో సర్వం త్యజించిన పెద్దమనిషి అని అని పించుకోవాలని తాపత్రయం! ఈ చేత్తో ఇచ్చి, ఆ చేత్తో చాటుగా పెళ్ళానికి చేర వేస్తున్నావని ఎవరనుకుంటారు?'

తల్లీ, తండ్రీ అక్కడ ఉండగానే పెద్ద మేనల్లుడు ధైర్యంగా మాటలు విసరడం సీతారామయ్యకే ఏవగింపు కలిగించింది

'సరి! మీరందరు కలిసి నా కిన్నాళ్ళ కైనా బుద్ధి గరపించారు ఒరే గోవిందా! నాపొరుగు మీకు కిట్టనపుడు ఇన్నిరోజులెందుకు తిరుగుళ్ళలేకపోతే, సొమ్మని ఒక్కముక్క చెప్ప రాదుట్రా' అనేసి, ఇంటికీ, తనకీ ఋణా నుబంధం తీరిపోయిందనుకుని చెప్పేశాడు.

కామేశ్వరి పనిచేసే ఆఫీసుకి వెళ్ళి వాకబు చెయ్యగా, ఆవిడ ఎనిమిదేళ్ళ క్రితమే హైద్రాబాదు బదిలీ అయి వెళ్ళిపోయిం దని తెలిసింది.

అడ్రసు సంపాదించి, తన ఇల్లు వెదు క్కుంటూ వచ్చిన భర్తను చూచి కామేశ్వరి ఆశ్చర్యపోయింది ఏదో ఒకనాటికి అతను తన ఉనికి వెదుక్కుంటూ వస్తాడన్న భావన ఆమెకు అప్పుడే కలిగినా, తనది భ్రమేమో అని వూరుకుంది తన ఆలోచన తప్పలేదన్న గర్వం, ఆనందం ఆమెకిప్పుడు కలిగాయి ఆర్ద్రమైన హృదయంతో ఆ అమాయకుణ్ణి మరల తన జీవితంలోకి ఆహ్వా నించింది

ఆ తరువాత నాలుగేళ్ళు ఏం గడిచాయో, అంతే! కామేశ్వరికి మసూచి సోకి భర్త చేతుల్లో చనిపోయింది.

*　　*

'టక్' మని మరొక గడ్డిపోచ పడింది.



'పోస్ట్!' ఉలిక్కిపడి, లేచి వెళ్లి అదిరే గుండెతో టెలిగ్రాం అందుకున్నాడు సీతారామయ్య.

'వాణికి సీరియస్‌గా ఉన్నది ప్రతి నిముషానికీ మిమ్మల్నే కలవరిస్తున్నది. వెంటనే బయల్దేరి రావాలసిని కోరుతున్నాను.

—భద్రాచలం.

గాభరాగా పంచె సర్దుకుని, చొక్కా వేసుకుని, చెప్పుల్లో కాళ్లు దూర్చాడు, సీతారామయ్య, 'వస్తున్నాను' అని పైరిచ్చేందుకు.

ధప్పుమని పడిపోయిన గూటిని చూస్తూ, గోల చేస్తున్నాయి పిచ్చుకలు రెక్కలు టట టటమని కొట్టుకుని మరిన్ని గడ్డిపోచలు తెచ్చేందుకు అవతలికి రివ్వున ఎగిరి పోయాయని. ●

**జరిగిన కథ**

శంకరం మాస్టారి ప్రభావంవల్ల వేణు ప్రవర్తన పూర్తిగా మారిపోయింది. అతని అక్కయ్య జ్యోతికి ఆనందరావుతో వివాహమవుతుంది. ప్రాణస్నేహితులయిన జ్యోతి, రమణలు చాలకాలానికి కలుసుకుంటారు. రమణ భర్త వెంకట్రావు. పార్టీ రాజకీయాలతో విరోధివర్గాలయిన కుటుంబాలవాళ్ళవి. సెలవుల నెపంమీద వేణు సుశీలను చూడ్డానికి జ్యోతి యింటికి వెళ్తుంటాడు. తన మీద ఆదినుంచి శత్రుత్వం వహించినా, వరదరాజులు హాస్పిటల్లో వుండడాన్ని విని కలతపడి శంకరంగారు భార్యతోసహా ఆయన్ని చూడ్డానికి వెళ్తారు. వేణు సుశీలను వివాహం చేసుకుంటానని వాగ్దానం చేస్తాడు.

## 20

పార్వతి త్వరత్వరగా వంటా వార్పూ ముగించుకుని, తలదువ్వి ముడివేసుకుంది... వున్నవాటిల్లో కాస్త మంచి చీర తీసి కట్టుకుని పుస్తకాలు తీసుకుంటుంటే, సీతమ్మగారు, 'ఆరు కావస్తోంది...మెగా వెళ్ళంటే నే చూసుకుంటాగానీ, త్వరగా ప్రైవేటుకు వెళ్ళమ్మా...' అని మరోమారు హెచ్చరించింది ..

'అయింది వదినా..వెళ్తున్నాగానీ... ఆ కుంపటిమీద కూర మగ్గుతోంది... కాస్త చూస్తారు గదా?...' అని చెప్పి బయలుదేరింది పార్వతి...

పార్వతి యింటర్మీడియెట్ ఫస్టుక్లాసులో పాసయ్యాక, శంకరంగారు పార్వతి చదువు గురించి ఎక్కువ శ్రద్ధ తీసుకోడం మొదలెట్టారు ఇంగ్లీషు డ్రామా చెప్పడానికీ, లిటరేచరు యింగ్లీషు చెప్పడానికీ ఆయన పార్వతికి ట్యూషనుకూడా ఏర్పాటు చేశారు . ట్యూషనంటే ట్యూషనుకాదు... శంకరంగారి లెక్చరరు మూర్తిగారు పార్వతి యింటరు పాసయిందని విని చాలా సంతోషించారు ఆయనకు శంకరం గారంటే మంచి అభిమానం ..అందుకనే, 'ఆవిడ స్వయంగా చదువుకోడం కంటె, తీరికున్నప్పుడు వస్తే, డ్రామా చెబుతాను.' అని తనంత తానుగా అన్నారు.. శంకరంగారికి, తమ లెక్చరరుగారిమీద మంచి గౌరవం. . ఆయన స్వయంగా శ్రద్ధ తీసుకుని చెబుతానంటే, యిక పార్వతికి తప్పక క్లాసు వస్తుందనుకున్న శంకరంగారు, పార్వతి ఎందుకులే వద్దన్నా వినిపించుకోకుండా, బలవంతం చేశారు...

సీరియల్



ఆ లెక్చరరుగారు ప్రొద్దున్నే బి ఎస్సీ వాళ్ళకు ప్రైవేట్లుచెబుతారు సాయంత్రం కాలేజినుంచీ రాగానే, ట్యుటోరియల్ కాలేజిలో ఒక అవరు తీసుకుంటారు. అందుకని ఆయనకు తీరిక సాయంత్రం ఆరు అయ్యాకనే .అందుకనే పార్వతి త్వరగా వంట ముగించుకుని, ఆరుగంటలకు వెళ్ళి, ఓగంట పాఠం చెప్పించుకునేది ..ఈరోజు శంకరంగారు వూళ్లో లేరు. ఏదో పనిమీద హెడ్మాస్టరు పంపితే హైద్రాబాద్ వెళ్ళి వున్నారు...ఆయన వెళ్ళేటప్పుడు కూడా, 'ట్యూషనుకు తప్పకుండా వెళ్ళమని' మరీ మరీ చెప్పివెళ్ళారు...

ట్యూషనుకు బయలుదేరిన పార్వతి మనసులో ఎన్నో ఆలోచనలు గిర్రు గిర్రున తిరుగుతున్నాయి. .అన్నిటికంటె వదినగారు యింత యిదిగా మారిపోవడం ఆమెకు మరీ ఆశ్చర్యంగా వుంది . 'పాపం చాలా మంచిది. అప్పుడెందుకో కోపం వచ్చింది గానీ...' అనుకుంది ..అబ్బబ్బ! ఎన్ని ఆటంకాలు యీ చదువుకు? అనుకుంది పార్వతి . అటెండెన్సు ఎగ్జామినేషన్ ఫీజు కట్టడానికి డబ్బు లేకపోయింది ఇక తనదగ్గర మిగిలిపోయిన ఒకే ఒక్క నగ ఆ ప్రధానపుంగరం తాకట్టుపెట్టి డబ్బుతెస్తాను యిమ్మని అడిగినా భర్త!...పార్వతికి కష్టంవేసింది...

'మనిషికి విద్య, వినయమూ యీ రెంటికి మించిన ఆభరణాలే లేవు ...నువ్వెందుకు దీనికోసం యింత ప్రాకులాడుతావు?' అని కోప్పడ్డారాయన. కానీ తను ఆయనకు ఎలా చెప్పగలదు?—అది తమ తొలిచూపుల కానవాలుగా దాన్ని భద్రం చేసుకుందని!... దాన్ని ప్రాణంకంటె ఎక్కువగా చూచుకుంటోందని... పరీక్ష పేరుతో దాన్ని తన నుండీ దూరం చేస్తానంటే తను సహించలేక పోయింది...

'పోనీండి – డబ్బు చిక్కినపుడే పరీక్షకు వెళతాను...ఇప్పుడెందుకు? అయినా విద్యకు పరమార్థం విజ్ఞాన సముపార్జన కానీ డిగ్రీలు కాదని మీరేగా యిదివరలో అనేవారు ..ఇప్పుడొద్దులే..' అని అభ్యంతరం చెప్పింది తను...

'బాగుంది! గీటురాయిమీదనే బంగారం వన్నె తెలుస్తుంది.. కష్టాలకు తట్టుకున్నప్పుడే మనిషికున్న ఆత్మవిశ్వాసం బయటపడుతుంది—అలాగే పరీక్షకు నిలబడ్డప్పుడే మనం నేర్చుకున్నచదువు ఏమిటో తెలుసుకోగలుగుతాం...

'పుస్తకం మొత్తం మీద రెండు 'క్వస్చన్సు'—రెండు 'యానిటేషన్సు' అన్సరు చెయ్యగానే పుస్తకమంతా మనకు తెలిసిపోయినట్లేనా?...' అని ఎదురు ప్రశ్న వేసింది తను...దానికాయన నవ్వుతూ, 'అన్నమంతా పట్టిచూస్తావా, వుడికిందీ లేందీ తెలుసుకోడానికి?' అన్నారు. అయినా తన మనసొప్పలేదు వుంగరం యివ్వడానికి... అది కనిపెట్టి ఆయన ..'పోనీ, నీకంతగా యిష్టం లేకపోతే నేనే ఎక్కడన్నా తిప్పలు పడతాను.' అన్నారు . అప్పుడనిపించింది తనకు ఛీ! ఏమిటి తన మూర్ఖపు పట్టుదల!...ఆయన తిప్పలు పడడమంటే—అభిమానం తాకట్టుపెట్టి స్నేహితులదగ్గర అప్పు తేవల్సిందేగా? అయినా మనిషినీ మనిషినీ బంధించేది మనసు...ఆ మనసూ మనసూ ఒకటయ్యాక యివన్నీ బాహ్యాడంబరాలుగానే మిగిలిపోతయి అయినా దేముడు మేలుచేస్తే ఆ తాకట్టు విడిపించుకోవచ్చు' అనుకుని వెంటనే ఆ వుంగరం తెచ్చి ఆయన చేతిలో పెట్టింది...

ఇన్ని ఒడుదుడుకులు తప్పుకుని యిప్పటిదాకా ఎలాగో సాగుతూనేవుంది తన చదువు.

అనుకుని నవ్వుకుంటూ వెళ్తోంది పార్వతి ..

'ఏవమ్మో!. పార్వతమ్మా!...ఎందాకానేంటి బయలుదేరావ్? ..ఏదో పరధ్యానగా కూడా వున్నట్లున్నావే? . వాకిట్లో నిలబడివున్న మహాలక్షమ్మగారు పలుకరించింది ...

పార్వతికి ఆశ్చర్యం వేసింది—ఈమధ్య వీళ్ళెవ్వరూ పలుకరించటంలేదు తనను . ఏ పేరంటంలోనో తటస్థపడ్డా ముభావంగానే వుంటున్నారు ఇవ్వాళ తనమీద ఎందుకో యింత శ్రద్ధ వచ్చింది! పైగా పక్కనే కమలమ్మగారు కూడా వుంది!... అనుకుంటూ, 'ఇక్కడికేనండి అదుగో ఆ యింట్లో లెక్చరరుగారిదగ్గర ట్యూషను చెప్పించుకుంటున్నాను ..' అంది

'ప్రైవేటా!...ఎంతిస్తున్నావేం వాలకు? .'

'ఇంతని యింకా ఖచ్చితంగా చెప్పలేదు . మావారికి ఆయన మేష్టరుగారు .. ఆ అభిమానంకొద్దీ వచ్చి చెప్పించుకోమన్నారు ..' అని చెప్పి, 'వస్తానండి వేళయింది .' అంటూ వెళ్ళిపోయింది పార్వతి

ఇంకా రెండు గజాలు కూడా దాటకముందే .

'నువ్వుకూడా చదవ్వమ్మా మహాలక్షమ్మా! బి ఎ అయిపోవచ్చు ఈ రోజుల్లో మూలకూర్చున్న ముసలమ్మలు కూడా బి య్యేలే! ' అంది కమలమ్మగారు వ్యంగ్యంగా .

'ఆఁ నాకెందుకులేమ్మా ఇక అదొక్కటే తక్కువైంది! 'అరవైయేళ్ళు వచ్చాక చదువుకోక మట్టి కొట్టుకుంటానా' అన్నట్లు...' అంది మహాలక్షమ్మగారు పెద్దగా. ఆవిడ గొంతెత్తితే ఫర్లాంగు దూరం సులువుగా వినిపిస్తుంది . వాళ్ళ మాటలన్నీ పార్వతి చెవుల పడుతూనే వున్నయి...పడాలనే వాళ్ళ ప్రయాసకూడా!. .

'అయ్యో! మనకల్లా పిల్లిల్లా చెప్పే వాళ్ళు వుండొద్దూ ప్రేమగా?.. అయినా మనమా వేషాలు వెయ్యగలమా ఛస్తే మాత్రం! ... అవ్వ ఆ చుట్టూ ! ఆ బొట్టూ !... పోగా ఆ పుస్తకాలూ, యీ వేళప్పుడు బయలుదేరింది చూడండి... పైగా చదువుట! చదువు! ! ఛీ ఆ వంక చూడండి! ... ఆడదయి పుట్టాక సిగ్గు వదిలేస్తే సరా?' అంటూ కమలమ్మగారు తుర్రుక్కున పుమ్మేసిందిసే.

'అయినా ఆ మొగుడ్ననుకోవాలి కమలమ్మగారూ!... చూస్తూ చూస్తూ చెవులు తెగిన దద్దమ్మలా వూరుకున్నాడు వీళ్ల రాసక్రీడలు పట్టించుకోకుకుండా!...'

'మరే అతడో చవట!...మావాడు కుర్రకుంక ఏదో తెలిక చేస్తే, అస్పత్రికల్లా వచ్చారు మొహాన నవ్వడానికి! . పిల్లి కళ్ళు మూసుకు పాలు తాగుతూ లోకం చూడలేదనుకుంటుందిట!...'

పార్వతి యిక ముందుకు నడవలేకపోయింది ... రెండిళ్ళవతల లెక్చరరుగారి యిల్లుంది...అయినా వెళ్ళబుద్ధి పుట్టలేదు పార్వతికి . హుటాహుటి తిరిగి యింటికి వెళ్ళిపోయింది... 'ఏమ్మా! ..మేష్టరుగారు లేరా?' అని అడిగిన అత్తగారికి, 'తలనొప్పిగా వుంటే వచ్చేశానండీ...' అని చెప్పి మంచం మీద వాలిపోయింది...

ఛీ!. ఏమిటీ అపవాదులు!... యాభై ఏళ్ళు దాటిన మేష్టరుగారి వయసెక్కడ? తన వయసెక్కడ?... తన ఆరాధ్య దైవమైన భర్తకు ఆయన గురువు తనకు పూజ్యులైన వారికి ఆయన పూజ్యులు .. తన తండ్రిలాంటి వారాయన ... ఇలాంటి



# పూర్వాసంధ్యా ప్రవర్తతే..

మాటలనడానికి యీ లోకానికి కళ్లు పోయినయ్యా!. ఒక స్త్రీ ఒక పురుషుడు మాట్లాడుకుంటే మరో దృష్టితో చూడనే చూడదా యీ లోకం! .. విద్యాదానం చేసే మేష్టారుగారు ఆయన . ఛీ! నోట వుచ్చరించరాని . కనీసం వూహించను గూడా వూహించరాని సంబంధం కడ్తారా? . ఈ లోకానికి కళ్లులేవు .విచక్షణ అంతకంటె లేదు...

ఆలోచిస్తున్న పార్వతికి యీ లోకానికి నిప్పంటించెయ్యాలని పించింది ... తన తల నేలకేసి కొట్టుకోవాలనిపించింది!. .కళ్లంట ధారాప్రవాహంలా కన్నీరు కారిపోతుంది ... అత్తగారూ ఆడబిడ్డా చూడకుండా ముసుగు తన్ని పడుకుంది పార్వతి ... అసలు అపవాదును భరించడమే కష్టం .అందులోనూ ఆడదానికి తన శీలం మీద వచ్చిన అపవాదును భరించడమంటే చిత్రవధ భరించినట్లే వుంటుంది . అందులోనూ పవిత్రమైన, గురుపీఠం మీద పెట్టి తనూ తన భర్తా పూజించే మేష్టరుగారితో ... అయినా వాకేం నేనే తప్పూ ఎరగను...మనసా వాచా కర్మణా తను ఏ తప్పూ చెయ్యలేదు...అనవసరంగా అపవాదులు వేసిన వీళ్లకు ... వీళ్లకు.. తన వుసురు ... తన కన్నీళ్ళు .. తగలక పోవు అనుకుంది పార్వతి ఆ ఆవేశంలో... ఆ బాధలో...

అయినా అసలు తప్పు తనదే .. ఆయన యివన్నీ ఆలోచించే మొదట్లో చదువొద్దూ ఏం వొద్దు అన్నారు .తనే మొండిపట్టు పట్టి, యీ చదువు మొదలెట్టి యింత దూరం అపవాదులు తెచ్చుకుంది! అన్నిటికంటె ముందు యిది ఆయన చెవి సోకితే రేపు?... ఎంత చదువుకున్న వాళ్లయినా మగవాళ్ళు యిలాంటివి త్వరగా నమ్మేస్తారు? . ఆయన కూడా అనుమానిస్తే తన బ్రతుకేం కావాలి? . తన కాపురం ఏమవుతుంది? హె భగవాన్!...

లోలోపల ఏడుస్తూ అలాగే పడుకుంది పార్వతి... ఆ రాత్రి భోజనం చెయ్యలేదు . జ్వరం ఏమన్నా తగిలిందేమోనని నుదురు పట్టుకు చూచించి సీతమ్మగారు...నుదురు వెచ్చగా తగిలింది.. జ్వరముందని అన్నం తినమని కూడా బలవంతం చెయ్యలేదు సీతమ్మగారు .. పార్వతికి ఆ రాత్రంతా నిద్రపట్ట లేదు... అసలయినా వాళ్లందరికీ తన మీద ఎందుకింత కోపం? ... తను వీళ్లకేం ద్రోహం చేసింది?...తన తప్పల్లా ఒక్కటే . అదే తీరని తృష్ణ! విద్యా తృష్ణ!... దానికిన్ని అపవాదులా?... అదే తన బ్రతుకును నాశనం చేసింది... ఏమో ఆయన నమ్మరని ఏం నమ్మకం?...అయినా అలాగే అనుమానిస్తే యిక తను బ్రతికేందుకు?... తన వచ్చుటి కాపరంలో తనే చిచ్చు పెట్టుకుంది...

అర్ధరాత్రి, అమావాస్య చీకటి . దగ్గరలో వున్న సర్కారు బావి తన్నుపిలుస్తోంది.. లోకం వేసిన నీలాపనిందలు నాలో దాక్కుని కడిగేసుకోమని గంగమ్మ పిలుస్తున్నట్లయింది పార్వతికి. చప్పున దుప్పటి తొలగించి లేచిన పార్వతిని, 'ఏమ్మా! నిద్రపట్టినట్టులేదే?... ఎక్కడకమ్మా లేచావు?.. నేను పట్టుకోనా?...' అంటూ పలకరించింది సీతమ్మగారు ..

దీనికూడా స్వాతంత్ర్యం లేదా?.. అనుకుంటూ పడుకున్న పార్వతికి మరో ఆలోచన వచ్చింది .. 'తను ఆత్మహత్య చేసుకుంటే లోకం ఏమంటుంది! ... తన రహస్యం బట్టబయలైందని ప్రాణాలు తీసుకుందని, మళ్లీ వీళ్లంతా పనిగట్టుకు ప్రచారం చెయ్యరా?' అనుకుని చేసేది లేక బరువుగా నిట్టూర్చింది పార్వతి...

రెండు రోజులు గడిచాయి శంకరంగారు వూరు నుండీ వచ్చారు. .పార్వతీ ముభావం, ఆ గంభీరతకు కారణం ఏమిటో ఆయన తెల్సుకోలేక పొయ్యారు . అక్కను చాటుగా పిల్చి అడిగారు... 'పార్వతి ఎందుకలా వుంటోందని?'

'ఏమోరా నువ్వెళ్లిన నాటి సాయంత్రం ప్రైవేటుకని వెళ్లి మళ్లీ వెంటనే తిరిగి వచ్చేసింది తల నొప్పని ... అప్పటి నుండీ అలాగే వుంటోం'దని చెప్పిందావిడ శంకరంగారికి ఏమీ తోచలేదు . . ఆ సాయంత్రం బజారు నుండీ వస్తుంటే లెక్చరరుగారు పిల్చి, 'అమ్మాయి మూడు రోజుల్నుండి చదువుకోడానికి రావటం లేదేమని' అడిగారు .

అయితే పార్వతి ప్రైవేటు కూడా వెళ్లటం లేదన్నమాట!... అనుకుని ఆశ్చర్యపోయినా, పైకి కన్పించకుండా 'నేనీ మధ్య వూళ్లోలేను మేషరూ! ఇవ్వాళే వచ్చాను . ఒంట్లో బాగున్నట్టులేదు పార్వతికి ... నే కనుక్కుంటానులెండి...' అని చెప్పి యింటికి వచ్చేశారు...

ఆ రాత్రి పార్వతిని అడిగారు, 'చదువుకోడానికి వెళ్లటం లేదుటగా?' అని...

'లేదు ' ముక్తసరిగా చెప్పింది పార్వతి.

'కారణం?'

'ఏమీలేదు. నాకు చదువుకోవాలనిపించలేదు . మానేశాను. అంతే. '

'మానెయ్యాలని పించడానికి క్కా...



# పూర్వాసంధ్యా ప్రవర్తతే...

కారణం వుండాలిగా?...'

'...'

'అక్కయ్య మళ్ళీ ఏమన్నా అన్నదా?.'

'అబ్బే లేదండీ .. ఆవిడ యీ మధ్య ఎంతో ప్రోత్సాహిస్తున్నది కూడా నా అదృష్టమే దానికి కారణం ఇంకెవ్వరూ కాదు నేను పెట్టిపుట్ట లేదు అంతే' కనుకొలకుల్లో నీళ్ళుతిరుగుతుంటే, ఆపుకోడానికి విశ్వప్రయత్నంచేస్తూ అంది పార్వతి .. గొంతు రుద్ధమైంది అలా అంటున్నప్పుడు. .

పార్వతి ఏదో బాధను హాలాహలంలాగా మింగాలని చూస్తోందని గ్రహించారు శంకరంగారు . అదేదో తెలుసుకోవాలంటే ఆ బాధను రాబట్టాలంటే ఆయన కొక్కటే మార్గం కన్పించింది .

'పార్వతీ! .. నేను నీదగ్గర యింతదాకా ఏ విషయమూ దాచలేదు . నాతో చెప్ప గూడని విషయాలు గూడా కొన్ని నీకున్నయి అని యిప్పుడే తెల్సుకున్నాను .సరే నీకిష్టం లేకపోతే నాతో చెప్పగూడనివైతే చెప్ప వద్దులే నేను బలవంతం చెయ్యను..' అన్నారు నిష్ఠూరంగా ..

'అంత మాటనకండీ! మీకు పుణ్యముంటుంది' పార్వతి ఏడుస్తూ, మంచం మీద కూర్చున్న ఆయన ఒడిలో తల పెట్టుకుని, 'అంతమాటనకండీ . మీ రలా అన్ననాడు భరించగల శక్తిలేదు మీ పార్వతిలో .' అంటూ జరిగిందంతా చెప్పేసింది.

ఏమైతే అదయిందనీ...

'పార్వతీ! .'

అంతదాకా నిర్మలంగా వున్న ఆకాశం ఒక్క వురుము వురిమినట్లయి వులిక్కిపడి చూసింది పార్వతి, శంకరంగారి మొఖంలోకి

ఆయన మొఖం జేవురించింది.. కళ్ళు విస్ఫులింగాల్లా మెరుస్తున్నయి తీవ్రమైన కోపంలో ఆయన శరీరమంతా కంపిస్తోంది

ఏన్నడూ కోపంరానివాళ్ళకు కోపమొస్తే వాళ్ళను కన్నెత్తి ఎవ్వరూ చూడలేరు . ప్రళయకాల రుద్రుడిలా వున్న శంకరంగారిని చూచి నిలువెల్లా వొణికిపోయింది పార్వతి హే! భగవాన్!.. ఈయన కూడా తన్ను అనుమానిస్తున్నారా? .ఇక తన గతి ఏంకావాలి! పార్వతికి ప్రపంచమే చీకటనిపించింది ఒక్కసారిగా శంకరంగారి కాళ్ళ మీద పడిపోయి 'మీ పాదాలసాక్షి! నేనే పాపమూ ఎరుగనండీ ..నన్ను నమ్మండీ' అన్నది ఆక్రోశిస్తూ...

'కాదు పార్వతీ! ఎవరు? .. ఎవరా అన్న వాళ్ళు?, చెప్పు వాళ్ళ సంగతేదో తేల్చుకుంటాను. .' అన్నారు తీవ్రంగా కంపించే స్వరంతో పార్వతి మనసు అప్పటికి కాస్త కుదుటబడ్డది...అలాగే ఆయన పాదాలను తన వెచ్చని కన్నీటితో కడుగుతూ తల పెట్టుకుని వెక్కివెక్కి ఏడుస్తోంది

శంకరంగారు కాస్సేపటికి తమ కోపాన్ని నిగ్రహించుకున్నారు పార్వతిని లేవదీసి తన ఒళ్ళోకి తీసుకుంటూ, 'పార్వతీ! ఇందుకా యింతగా బాధపడుతున్నావ్?.. అలా ఏడుస్తున్నావ్? ఇదేనా యిన్నాళ్ళు కాపురం చేసి నువ్వు నన్ను అర్థంచేసుకుంది? ఎవరో ఏవో అన్నారని నేనూ నిన్ను శంకిస్తానని భయపడుతున్నావా? ముందా కళ్ళనీళ్ళు తుడుచుకో పారూ! ఇలాంటి వుడతూపులకే నువ్వు బెంబేలు పడుతుంటే ముందు నా కవమానంగా వుంది .' అంటూ శంకరంగారు పార్వతి కళ్ళుతుడిచి హృదయానికి హత్తుకున్నారు . గుండెలమీదనుంచి పెద్ద బరువుదింపినట్లు హాయిగా గాలి పీల్చుకుంది పార్వతి

'మీరు హిమాలయోన్నత శృంగంలాంటివారు .కనీసం మిమ్మల్ని అర్థం చేసుకోగల సంస్కారం కూడా లేదు నాకు మీరు లోకం పోకడ తెల్సినవారు కనుక మొదట యీ చదువొద్దన్నారు ... నేనే మూర్ఖురాల్ని మొదటి నుండి మిమ్మల్ని నొప్పిస్తూనే వున్నాను . మీరు వున్నట్లుండి, అంత భయంకరంగా మారిపోతే, మీరూ నన్ను అపార్థం చేసుకున్నారేమో నని క్రుంగిపొయ్యాను చాలు మీరు అర్థం చేసుకోగల్గితే చాలు నాకు' అంటూ తృప్తిగా గాలి పీల్చుకుంది పార్వతి

'నిష్కళంకులైన వారిపైనా, ఆయిలోనూ ప్రియాతి ప్రియమైన వాళ్ళమీద యిలాంటి అపవాదులు వినవల్సి వచ్చినప్పుడు ఎలాంటి వాళ్ళకైనా కోపం వస్తుంది పారూ అది సహజం అలా కోపగించుకుని ప్రయోజనం లేదనుకో .అయినా లోకంలో రకరకాల వ్యక్తులు మన అభివృద్ధిని, బాగును చూసి సంతోషించే వాళ్ళు కొంత మందైతే, ఓర్వలేని వాళ్ళు కొంతమంది .. వాళ్ళను మనం మార్చలేం' అన్నారు...

'ఏమోనండి .. ఇప్పటికి జరిగింది చాలు నలుగురూ నాలుగు విధాలుగా అంటుంటే భరించగల మనో దారుఢ్యం నాకులేదు .. ఇక యీ చదువుకు స్వస్తి చెప్పి, మీ సేవ చేసుకుంటూ హాయిగా కాలం గడుపుతాను .'

'అదుగో ఆమాటంటేనే నే ఒప్పుకోను. మనం చేసే ప్రతి పనినీ అందరూ హర్షించాలనీ, ఆమోదించాలనీ అనుకోడం కంటె వెర్రిపని యింకోటి వుండదు అలా చేస్తే జీవితంలో ఏదీ సాధించలేం . ఎవరికి తోచినట్లు వాళ్ళు అనుకుంటారు ... అనుకోని



మనకేం పోయింది! .. అసలు మనం వాళ్ల మాటల్ని లక్ష్యపెట్టకుండా వుంటే విసుగేసి మన విషయం పట్టించుకోడమే మానేస్తారు ఆఖరికి ..' అన్నారు శంకరం గారు .

పార్వతి యింకా అయిష్టంగానే చూసింది.'

'ఏం పారూ!.. ఇంకా ఆలోచిస్తున్నావ్!... నా మాటమీద ఏ మాత్రం గౌరవమున్నా నువు చదువు పూర్తి చెయ్యాలిసిందే .. నీలో ప్రతిభ వుంది చురుకైన మెదడుంది. కష్టపడి చదివే పట్టుదలా వుంది . ఇన్ని వుండి నీలోని ప్రతిభ నురుగున పడిపోడం నా కిష్టంలేదు . స్వయంగా చదివి యింటర్మీడియెట్‌లో ఫస్టుక్లాసు తెచ్చుకున్నావ్ ఇప్పుడూ తప్పకుండా క్లాసు తెచ్చుకోగలవు ఇదయ్యాక ఎమ్మే కూడా చదవాలి నువు మా నాన్నగారు బ్రతికున్నప్పుడే నాకు లెక్చరరు అవాలని వుండేది నా కోరిక ఎలానూ ఫలించలేదు... కనీసం నువ్వయినా ఫలించని నా ఆశయాన్ని సఫలం చెయ్యిపారూ! .. అన్నారు పార్వతి చేతిని తన చేతిలోకి తీసుకుంటూ శంకరం గారు ...

'ఎమ్మేనా?! ఒద్దండీ . దయచేసి నన్ను అలాంటి వాటికి ప్రోద్బలం చెయ్యకండీ .. భర్తకంటే కూడా ఎక్కువ చదువు చదువుతోందని మళ్లీ లోకం ఆడిపోసుకుంటుంది. దయచేసి నన్ను నిర్బంధించకండి ... మీ అందర్నీ యింత నొప్పించాను గాబట్టి ఆ బి. ఎ పూర్తి చేస్తాను మీరు చెప్పినట్లు .. అంతే .. అంతకంటె వద్దు' పార్వతి బ్రతిమిలాడింది.

'ఏయ్ పారూ!...ఇదివరలో ఒకసారి ఏమన్నావో జ్ఞాపకం వుందా...

'మీ ఆశయాల్ను నా ఆశయాలు కావా .. వాటిని ఆచరణలో పెట్టడానికి నేను చెయ్యగల్గిన సాయం చెయ్యగూడదా' అన్నావ్ ..మరి యిప్పుడేమైనయి ఆ మాటలు! . నా ఆశల్ని సఫలం చెయ్యాల్సిన బాధ్యత నీది కాదా?...' అన్నారు కాలికి బంధంవేసినట్లు శంకరంగారు..

పార్వతి ఏమీ మాట్లాడలేకపోయింది. . తర్వాత శంకరంగారి విశాల వక్షఃస్థలంలో తలదాచుకుంటూ... 'ఈమాటు శంకరుడిదే విజయం ..అయినా మీ ఆశీర్వాదమూ, ప్రోత్సాహమూ యిలాగే లభిస్తుంటే మీ ఆశల్ని సఫలం చెయ్యడం నాకూ ఆనందమే ' అన్నది మెల్లిగా. మబ్బులు విడిచిన చంద్రుడు యిద్దరిమీదా వెన్నెల కురిపించాడు ఆశీర్వదిస్తున్నట్లు...

* * *

'హల్లో!.. డేవిడ్! ..'

హల్లో!! 'హోటలు మెట్లెక్కుతున్న డేవిడ్ ఒక్క అంగలో వచ్చి, తనను 'విష్' చేస్తున్న మిత్రులను కౌగలించుకున్నాడు... వెంటనే తన వెంటనే వున్న భార్యవైపు తిరిగి, 'లీలా! వీళ్లే నా ఫ్రెండ్స్ .. ఇతడు వేణుగోపాల్ . ఇతడు ఫ్రాంక్లిన్... ఇద్దరూ ఎమ్మెస్సీ ప్రీవియస్ చదువుతున్నారు యిక్కడ యూనివర్శిటీలో . 'అని పరిచయం చేస్తుండగానే, విజిటర్స్ హాల్లో మరో రెండు కుర్చీల్లో కూర్చున్న యువతి లేచివచ్చి' ఆర్ యు మిసెస్ లీలా డేవిడ్!.' అంటూ పల్కరించింది లీలను.

'మీరేనా మిస్, ఉష! ... అయామ్ వెరీ గ్లాడ్‌టు మీట్‌యు.. అంటూ సంతోషంగా ఆమెతో కరచాలన చేసింది లీల ..

'ఈమే మిస్, ఉష ... మారోజీ అక్క చెప్పిందీ ' ప్రొఫెసర్ గారి అమ్మాయనీ; ఎమ్మే ప్రీవియస్ చదువుతోందనీ, లెటర్ వ్రాస్తానని . 'అవిడన్న మాట.' అంటూ ఉషను భర్తకు పరిచయం చేసింది లీల .

'ఈమె మిస్ సత్యవతి వారూమ్ మేట్' అంటూ తనతో వచ్చిన స్నేహితురాల్ని కూడా పరిచయం చేసింది ఉష .., డేవిడ్ తన మిత్రుల్ని కూడా పరిచయం చేశాడు

## అల్లాటప్పయ్య



# పహారాన్సంధ్యా ప్రవర్తతే..

పరస్పర అభివందనలు పూర్తయినయి ..

లీలా! నీవా మిత్రులతో పహా పైకి పోదాం పద .. రూమ్‌లో మాట్లాడకో వచ్చు.. ' అంటూ పైకితీసుకెళ్లాడుడేవిడ్ .

'రోజీ వుత్తరం నిన్ననే అందింది .. మే మిద్దరం యీ హోటలుకి వచ్చి అరగంట పైనే అయింది స్టేషనుకు రాలేకపోయి నందుకు చాలా బాధగా వుంది...' అంది ఉష, రూమ్ తలుపు తాళం తీస్తున్న లీలతో ..

'ఆలస్యమైతే 'కాన్వొకేషను గౌన్స్' దొరకవంటేను కనుక్కోడానికి వెళ్లాం ' అని చెప్పింది లీల.

'బోయ్'ని పిల్చి ఆరు కాఫీకి ఆర్డరిచ్చిన డేవిడ్, 'వేణూ!. అయితే మన ప్రోగ్రాం ఏమిటో చెప్పండి . అనవసరంగా ఆలస్య మెందుకు ? ' అన్నాడు .

'హార్బరు చూడ్డానికి పర్మిషను కూడా పటు కొచ్చాం. ఇక మీదే ఆలస్యం '

'నో నో మిస్టర్ వేణుగోపాల్ !' .. అంటున్న ఉషను మధ్యలోనే ఆపి 'అంత శ్రమ తీసుకో నవసరంలేదు మిస్ ఉషా! . సింపుల్‌గా వేణూ అనండి చాలు...' అన్నాడు వేణు—

'థాంక్యూ మిస్టర్ వేణూ!.. వీళ్లిద్దరూ మనకు 'కామన్ గెస్ట్సు' లీలకు ఊరు చూడ్డం మహా సరదా . 'యూని వర్శిటీ కాంపస్' అంతా తప్పక చూపించ మని రోజీ లెటర్ వ్రాసింది నాకు... కాబట్టి ...'

'నో నో.. ఈ పూట హార్బరుకు వెళ్లాల్సిందే మధ్యాహ్నం అంటే వీలుకాదు సాయంత్రం నాలుగు గంటలకల్లా యూనివర్శిటీ చేరుకోకపోతే కాన్వొకేషనుకు అందుకోలేము .' అన్నాడు ఫ్రాంక్లిన్...

'పోనిండి లీల మాతో వస్తారు మీరూ ఆయన కలిసి వెళ్ళండి ..' ఇంతదాకా మౌనంగా వున్న సత్యవతి సలహా యిచ్చింది .

'ఇదోండి ... మనం మనం ఓ ఎగ్రి మెంటుకు వద్దాం అదేమిటంటే ఈ పూట హార్బరుకు వెళదాం తర్వాత భోజనం ముగించుకుని 'కాంపస్' చేరుకుంటే సాయంత్రందాకా అన్నీ చూడొచ్చు .. మా ఆర్ట్సు కాలేజి మీరు చూపండి మిస్ ఉషా .వాళ్ళ సైన్స్ కాలేజి వాళ్ళు చూపిస్తారు. బైదిబై . ఓ చిన్న షరతు కూడా మీరూ మేము అంతా కలిసే వెళ్లాలి అన్ని చోట్లకూ ' అంటూ రాజీ మార్గం ప్రతిపాదించాడు డేవిడ్ .

'నాకూ హార్బరు చూడాలని వుంది . ఏ మంటావ్ ఉషా !! ' అని లీల అడిగిన దానికి 'ఆల్‌రైట్ ! అలాగే కానీండి '' అంటూ తన సమ్మతి తెలిపింది ఉష ఖాళీ కాఫీగ్లాసు టేబిల్‌మీద పెడుతూ.

'అయితే ఒక్క ఐదు నిముషాలుండండి .. డ్రెస్ మార్చుకువస్తాను .' అని చెప్పి లోపలికి వెళ్ళింది లీల .

'మీది యీ వూరేనా ? . లేక హాస్టల్లో వుండి చదువుకుంటున్నారా ? ' పేపరు చూస్తున్న వేణును ప్రశ్నించింది ఉష.

'లేదండీ హాస్టల్లో వుంటున్నాం...' అని జవాబిచ్చాడు వేణు'

సన్నగా నాజూగ్గా, మేలిమి బంగారు ఛాయలో వున్న ఉషను చూడగానే వేణు మనసులో సుశీల మెదిలింది సుశీల యింత రంగు లేకపోయినా కళ్ళు యింకా అందంగా వుంటయి అనుకున్నాడు తనవైపే చూస్తూ కూచున్న ఉషను చూసి, 'మీ నాన్నగారు ప్రొఫెసరు అన్నారు పేరు తెలుసుకో వచ్చాండి ?' అని అడిగాడు .

'చంద్రశేఖరంగారు '

'ఆఁ చంద్రశేఖరంగారి అ – – మీరు ? .' విస్మయ చకితులై మిత్రు లిద్దరూ ఒకరి మొఖా లొకరు చూచు కున్నారు వేణు, ఫ్రాంక్లిన్ ..

'మరి మీరు ఎమ్ ఎ చదువుతున్నా రేమండీ ? ! '

'ఏం చదవకూడదుటండీ ? ..' ఎదురు ప్రశ్న వేసింది ఉష నవ్వుతూ .

ఇంతలోనే లీలా, డేవిడ్ యిద్దరూ వచ్చేశారు అంతా కలిసి బయలుదేరారు .. సిటీబస్ ఎక్కి, డాల్ఫిన్స్ నోస్ కొండకు వెళ్ళేరోడ్డు దగ్గర దిగారు మలుపు తిరిగి డాక్‌యార్డ్ ' రోడ్డునడుస్తున్నారు అంతా...

ప్రొద్దుటిపూట ఎండలో సముద్రం మిలమిలా మెరుస్తోంది , అలలు వువ్వెత్తున లేచిపడుతున్నాయి ఉష రోడ్డు చివరగా, సముద్రానికి రోడ్డుకూ మధ్యగావున్న చిన్న పిట్టగోడపక్కగా నడుస్తోంది సన్నని నీటి తుంపరులు ఉషమీద పడుతున్నయి . హోరు మంటున్న సముద్రపుఘోష వీటి నన్నిటినీ మరిచి ఆ ప్రొద్దుటి పూట పది గంటల వేళప్పటి ఎండలో, రత్నాలు కుప్పలు పోసినట్లుగా, వెలుగు చిమ్ముతున్న ఆ సముద్రాన్ని తన్మయురాలై చూస్తూ నిలబడింది ఉష ఆ అగాధమైన సముద్రం, విరిగిపడే అలలు, రవ్వలు కుప్పలు పోసినట్లుగా మెరిసే ఆ సము ద్రాన్ని రోజూ చూస్తూనే వుంటుంది ఉష . అయినాయింకాచూడాలనేఅనిపిస్తుంది .

'మిస్ ఉషా! కొంచెం యిటు తిర గండి .. కేమేరా ఎడ్జెస్టు చేసుకుంటున్న వేణు అడగడంతో ఉష తిరిగి చూచింది. కేమేరా 'క్లిక్' మంది.

'మా ఉషకు ఫోటోల పిచ్చి ఎక్కువ లెండి .' అన్నది నవ్వుతూ సత్యవతి

అంతాముందుకుపొగారు. (ఇంకావుంది)



# అమెరికన్ కుటుంబాలు



భోగవరపు రామకృష్ణారావ్

న్యూయార్క్‌లో వందస్తుల భవనం చూసి అబ్బురపడి, చికాగోలో క్షవరానికి ముప్ఫై రూపాయలని విస్తుపోయి, నయాగరా సౌందర్యానికి ముగ్ధుడయి, హాలీవుడ్ నైట్ క్లబ్బులో అర్ధ నగ్ననృత్యానికి అవురా అనుకుని, ఇండియా వెళ్ళిపోయి, 'అహా! నే జూసిన అమెరికా' అనుకుంటే నిజంగా అమెరికా సందర్శించినట్టు కాదు

ఏదేశంలోనయినా ముఖ్యమైనది ప్రజలు అమెరికా సందర్శించే ప్రతి విదేశీయుడూ యీ దేశంలో ప్రజలతో కలిసి కొంతకాలం నివసిస్తే దేశాన్ని, ప్రజల్ని సరియైన దృక్పథంలో అర్థంచేసుకోడానికి వీలవుతుంది కనీసం అమెరికన్ కుటుంబాలతో కొన్ని రోజులు గడపగలిగితే తెలిసినన్ని విషయాలు మరోలా తెలీవు

నేను క్రితం వేసవిలో యీ దేశంలోని నగరాలు సందర్శిస్తూ అయిదారుచోట్ల అమెరికన్ కుటుంబాలకు అతిథిగా కొద్ది రోజులు గడిపే అవకాశాన్ని సద్వినియోగం చేసుకుని చాలా విషయాలు తెలుసుకున్నాను నా అనుభవాలతో యీ వ్యాసం రాస్తున్నాను.

నే నతిథిగా వెళ్ళిన అయిదుకుటుంబాలూ 'మధ్యతరగతి'కి చెందినవనే చెప్పాలి నిజానికి మనదేశంలోలాగ అమెరికాలో మూడుతరగతుల్లేవు. ఈదేశంలో యే వృత్తి అయినా గౌరవప్రదమే గెజెటెడాఫీసర్లు, గుమస్తాలూ—యిలాంటి విభజనకూడా అరుదే! మంగలి కుళాయిలు బాగుచేసేవాడు వీధులు తుడిచేవాడూ తరచు యూనివర్సిటీ ప్రొఫెసర్లకంటే ఎక్కువే సంపాదిస్తుంటారు ఎలిమెంటరీస్కూళ్లో ఏబీసీడీలుచెప్పే పంతులమ్మకూ, యూనివర్సిటీలో అసిస్టెంటు ప్రొఫెసర్‌కి జీతంలో పెద్ద తేడావుండదు

కాడిలాక్‌కారు, కలర్ టెలివిజన్‌లాటివి కొన్ని హోదాలకు చిహ్నాలుగావున్నా—సామాన్యంగా యేకుటుంబంలోనయినా కనీస సౌకర్యాలు విధిగా వుంటాయి నేను చూసిన కుటుంబాల్లో కొందరికి రెండేసికార్లున్నాయి రెండెందుకని నేనాశ్చర్యపోయాను సెయింట్ లూయిస్‌లో గృహిణి సుసనే నవ్వి 'భలే వాడివే, మా ఆయన కారులో ఆఫీసుకుపోతే—నేను పిల్లల్ని స్కూలుకెలా దింపుతాను? మార్కెట్టుకెళ్ళి కూరలెలా కొనుక్కొస్తాను చెప్పు—రెండోకార్లేకపోతే' అంది నిజమే! మన యిళ్లలో రెండేసి, మూడేసి సైకిళ్లున్నవాళ్లు లేరా అనిపించి, వూరుకున్నాను

డెట్రాయిట్ కుటుంబానికి స్వంత స్విమ్మింగ్ పూల్ వుంది ఓ పూటంతా వాళ్ల పిల్లలతో యీత నేర్చుకొంటూ సరదాగా గడిపాను పోలీసు సార్జెంటుగా పని చేస్తున్న ఆల్బెర్టో స్విమ్మింగ్‌పూల్ ఎంత అవసరమో వివరించాడు. ముఖ్యంగా తన పిల్లల వ్యాయామానికి యీతలాంటిది మరొకటి లేదన్నాడు. కానీ, ఆ స్విమ్మింగ్ పూల్ నిర్వహణకు అయ్యే ఖర్చు విని ఆశ్చర్యపోయాను ఆ మొత్తంతో ఓ మధ్య తరగతి కుటుంబం తెగ హాయిగా బ్రతక వచ్చు

చాలా కుటుంబాలకి స్వంత యిల్లు కొనుక్కోగలతాహతున్నా కొందరు బ్యాంకు నుండి అప్పు తీసుకుని వాయిదాల పద్ధతిలో యిళ్లు కొనుక్కుంటారు మరికొందరు ముఖ్యంగా ఉద్యోగరీత్యా వూళ్లు పుచ్చుకు తిరిగేవారు సొంతింటికంటె అద్దిల్లే సుఖమనుకుంటారు అద్దెలు బాగా విపరీతమయినా మంచం, పరుపునుండి రెఫ్రిజిరేటరుదాకా అన్ని సౌకర్యాలతో దొరుకుతా యద్దిళ్లు.

ఇహ సొంతిళ్లున్నవాళ్ళకి యింట్లో సుమారు ప్రతి వ్యక్తికి ఒక గది చొప్పున వుంటుంది. పెద్దవాళ్ళకి విడి గదులుండడం బాగానే వుంటుందిగానీ, అయిదారేళ్ళ పిల్లలకి కూడా వేర్వేరు గదులుండడం చాలా ఆశ్చర్యం మా యింట్లో — చిన్నప్పుడు వొక పెద్ద గదిలో జంపఖానా వేసి నలుగురైదుగురం తమ్ముళ్ళం కలిసి పడుకొనేవాళ్ళం. అమెరికన్ల వుద్దేశ్యంలో అది మంచి పద్ధతి కానేకాదు వ్యక్తిత్వం సరియైన మార్గంలో పెరగాలంటె—చిన్నప్పట్నుంచీ స్వతంత్రంగా బ్రతగ్గలగడం రావాలట శాన్‌డియాగో కుటుంబంలో 'బెకీ' అనే ఆరునెలల పాప ఒక్కతె తన గదిలో నిద్రపోతుంటె 'దారుణం' అన్నాన్నేను ఆ పిల్లతల్లి నార్మా నవ్వి 'దాంట్లో తప్పేం లేదు ఓ రాత్రి వేళ యేడిస్తే లేచివెళ్లి నే చూస్కుంటా గదా' అన్నది అదేం విచిత్రమో గాని, ఆ పాప అర్ధరాత్రి గాదు పట్టపగలు కూడా ఏడవడం నే చూళ్లేదు వాళ్లింట్లో వున్న గదుల్లెక్కపెట్టి, 'మరి బెకీ తర్వాత ఇంకో పాపాయి పుడితే ఏం చేస్తారు?' అనడిగాను. 'డబ్బుంటే యింకో గది కడతాం' అంది నార్మా వాళ్లాయన ఎలక్ట్రానిక్సు కంపెనీలో యింజనీర్

మనల్ని ముగ్ధుల్ని చేసేది వీళ్ల పరిశుభ్రత డబ్బేకనక వుంటే యిల్లూ, పరిసరాలూ ఎంత శుభ్రంగా నయినా వుంచుకోవచ్చునన్న మాట కొంతవరకే నిజం. స్తోమత వుండి కూడా నానా భీభత్సంగా ఇళ్లు వదిలేసే కుటుంబాలు మనదేశంలో ఎన్ని లేవు? శుభ్రత, కంటికింపుగా పరిసరాల నుంచుకోవడం పిల్లలు చిన్నప్పటి నుంచీ నేర్చుకుంటా రిక్కడ కాలిఫోర్నియాలో తొమ్మిదిమంది పిల్లలున్న సంసారం ఒకటి చూశాను వాళ్లు రోమన్ కాథలిక్‌లు కృత్రిమంగా కుటుంబ నియంత్రణ చేసుకోడాని కంగీకరించనిదా మతం. వాళ్లు

# అమెరికన్ కుటుంబాలు

ఇల్లును చూసి నేనెంతో ముగ్ధుణ్ణయ్యాను మన యిళ్ళల్లో ముఖం చూసుకునే అద్దాలు కూడా అంత శుభ్రంగా ఉండవు డెన్వర్ కుటుంబంలో జాన్ అనే అతను అతనిభార్య ఎలిజబెత్ అబ్బాయి బాబ్— యిల్లు తుడవడంనుంచి తోటపనివరకు అన్నీ వాళ్ళే చేసుకుంటారు

సెయింట్ లూయిస్‌లో సుసన్, 'మీదేశంలో లాగ మాకు పనిమనుషులుండరు అన్ని పనులూ మేమే చేసుకోవాలి' అన్నది అమెరికాలో 'పనిమనిషి' వుండడం అరుదన్నమాట యదార్థమేగానీ, అన్నిపనులూ వాళ్ళే చేసుకోవాలన్నదిమాత్రం పూర్తి నిజంకాదు వీళ్ళకు మెషిన్లున్నాయి మన యిళ్ళల్లో గంపెడు బట్టలు ముందేసుకుని, చేతులు నడుం విరిగి ముక్కలయ్యేలా వుతికి ఆరేసి శ్రమపడితే— అమెరికన్ గృహిణి పాతబట్టలన్నీ మెషిన్‌లో పడేసి స్విచ్‌వేసి, ఓ నవల చదువుకుంటూ కూర్చుంటుంది అరగంటలో మాసినబట్టలు వుతికి, ఆరేసి బయటకు వస్తాయి తడిసిన కట్టెపుల్లలూ, పొగలో వుక్కిరిబిక్కిరిచేసే బొగ్గులూ, చేతులు వడేలా, విసినికర్ర చిరిగేలా మంట రాజుకునేలా విసరడాలూ, కంపుకొట్టే కిరోసిన్ స్టవ్‌లు— యీచికాకులు అమెరికన్‌గృహిణికి లేవు ఎలక్ట్రిక్, లేక గ్యాస్‌పొయ్యిలు నాలుగైనా లేని వంటిల్లని చూళ్ళేదిక్కడ ఇహ చేతులరిగి, ముక్కలాడిపోయేలా మోపెడంట్లగిన్నెలు తోమేపనిలేదు వాళ్ళకి అంట్లగిన్నెలన్నీ మెషిన్లో పడేస్తే కాస్సేపట్లో తళతళలాడుతూ బయటికి వస్తాయి ఎన్ని వుతుకులకయినా మడతలు చెడని బట్టలు విరివిగా దొరుకుతాయి గనుక గృహిణికి యిస్త్రీ శ్రమకూడా తక్కువే

క్రొత్తగా కాపురంపెట్టినరోజుల్లో తీరిక యెక్కువుండడంవల్ల, డబ్బు అవసరంవల్ల, భార్య యేదైనా వుద్యోగం చేయడం కద్దు పిల్లలతో సంసారం పెరుగుతున్నకొద్దీ గృహిణికి వుద్యోగం చేయడం వీలు పడదు నేను అతిథిగా గడిపిన ఆరు కుటుంబాల్లో యిద్దరు గృహిణులు మాత్రమే వుద్యోగాలు చేస్తున్నారు

మనకు అమెరికన్ కుటుంబాల్లో విచిత్రంగా కన్పించే విషయం సమిష్టి కుటుంబ పద్ధతి లేకపోవడం ఇక్కడ భర్త, భార్య పిల్లలు, అంతే! ఓ కుటుంబం సైజు. మన వైపు యీ సైజుకి వృద్ధులయిన తలిదండ్రులు. మొగుడొదిలేసిన మేనత్త, పురిటికొచ్చిన పెద్దకూతురు, నాయనమ్మ, వుంటే అమ్మమ్మ — యిలా బలగం పెరిగిపోతుంది సమిష్టికుటుంబంలో లాభనష్టాల సంగతెలావున్నా — యీపద్ధతి యెవరికీ నచ్చదు బోస్టన్‌కుటుంబంలో 'జిమ్' తలిదండ్రులు ఎక్కడో ముప్ఫయి మైళ్ల దూరంలో వుంటున్నారు ఇద్దరూ బాగా వృద్ధులు ఆయనకొచ్చే పెన్షన్‌మీదే బ్రతుకుతున్నారు అప్పుడప్పుడు జిమ్, అతని భార్య కేథీ కారులో వెళ్ళివాళ్ళను చూసొస్తుంటారు. సెయింట్ లూయిస్‌లో సుసన్ చెప్పిన విషయం మరీ ఆశ్చర్యంగా వుంది. 'వ్యాపారరీత్యా జార్జి మా మావగారున్నవూరెళ్తే హోటల్లో బసచేసి, వాళ్ళింటికి వెళ్ళి చూసొచ్చేస్తుంటారు' అన్నదావిడ. అదేం అనడిగాను. 'వాళ్ళింట్లో బసచెయ్యడం ఏంబావుంటుంది? వెళ్ళినపుడల్లా' అని సుసన్ చెప్పింది.



వృద్ధాప్యంలో తలిదండ్రులు వొంటరిగా బ్రతకాల్సి రావడం కాస్త అమానుషంగా తోచింది నాకు చాలామంది వొంటరితనం మాట నిజమే నంటారు గానీ, ఒకానొక మామ్మగారేమందంటే, 'మా అబ్బాయితో ఉంటూ, దాదిలా వాడి పిల్లల్ని సంరక్షిస్తూ ఆ బాదరబందీ అంతా ఎవరు పడతారు బాబూ! మేమిద్దరమిలా స్వేచ్ఛగా వుండడం హాయిగా వుంది' అని.

చిన్నప్పటినుండే పిల్లలు స్వతంత్రంగా అన్ని పనులూ చేసుకోవడం నేర్చుకొంటారక్కడని చెప్పానుకదా సామాన్యంగా పదహారేళ్లు దాటేసరికి తల్లిదండ్రులకు పిల్లల బాధ్యత తీరినట్లే. ఆ వయసుకి పిల్లలు హైస్కూలుచదువులు పూర్తి చేసి, కాలేజిల్లో ప్రవేశిస్తారు వాళ్లే చిన్న చిన్న ఉద్యోగాలు చేసుకుంటూ జీతాలు కట్టుకుంటూ కాలేజి చదువులు పూర్తిచేస్తారు. మా రూమ్మేటు జెఫ్ యీ మధ్య ఎమ్మే పూర్తి చేశాడు అతను తన పదహారో యేట తరువాత తన తలిదండ్రుల వద్ద నుంచో డాలరయినా తీసుకోలేదట ఇహ అమ్మాయిలక్కూడా పార్టటయిముద్యోగాలు దొరుకుతాయి కాలేజి వున్న వూర్లోనే వున్నా—తలిదండ్రులతో నివసిస్తే స్వేచ్ఛ వుండదని తరచు పిల్లలు వేరే అద్దె గదుల్లోనో, హాస్టల్సులోనో నివసిస్తారు.

కుటుంబంలో ఎదిగినాడపిల్ల తలిదండ్రులకు 'గుండెలమీద కుంపటి' అయి కూర్చోదు 'చూశావా! గుర్రంలా ఎదిగినమ్మాయి కింకా పెళ్ళయినా చేయలేదు' అని యిరుగుపొరుగులు గుసగుసలాడరు. తలిదండ్రులు సంబంధాలు వెతికి పిల్లలకు ముడిపెట్టే పద్ధతి మాటికి కనీసం ఒక్కటి కూడా వుండడం అనుమానమే. ప్రస్తుతం అమెరికాలో విపరీతమైన లైంగిక స్వేచ్ఛ వుంది కాలేజి జీవితంలోని విద్యార్థులూ, విద్యార్థినులూ విశృంఖల విహారం చేస్తారు 'డేటింగ్' ఆచారం వుండటం వలన అమ్మాయిలూ, అబ్బాయిలూ తమ తమ జీవితాలకు అనువయిన భాగస్వామిని ఎంచుకొంటారు. ఇందులో తలిదండ్రుల బాధ్యత యేమీ వుండదు. 'నా పెళ్ళికి మీరు తప్పక రావాలి' అని తలిదండ్రులతో చెప్పే ఫక్కీలో వుంటుంది.




కట్నాలూ, ఆడంబరాలూ వుండవు గనక మనిళ్ళలోలాగ ప్రతి అమ్మాయి పెళ్ళికి వున్నాస్తిని తెగనమ్ముకోడం, అది లేనివారు అప్పుల పాలవడం లాంటి దౌర్భాగ్యాలు పట్టవు వాళ్ళకి.

భార్యా భర్తల మధ్య, తలిదండ్రులూ పిల్లల మధ్య ఆపేక్షలూ, అనురాగాలూ, ప్రేమా, మమతా యెక్కడయినా వొకటే గాని, అమెరికన్లు ప్రేమకు బాహ్య ప్రకటన యివ్వడం అనవసరంగా భావిస్తారనిపిస్తుంది నలభై యేళ్ళు దాటుతున్నా భార్యాభర్తలు పదిమంది చుట్టూ వున్నారనన్నా లేకుండా వొకరినొకరు 'హనీ' అని పిల్చుకోడం, ప్రతి చిన్నసందర్భానికి ముద్దులు పెట్టుకోడం ... యిత్యాదులు మనకు కాస్త ఎబ్బెట్టుగా వుంటాయి కాని అది వాళ్ళఆచారం ముఖ్యంగా వో పెద్ద కుటుంబంలో తండ్రి ఆఫీసుకు వెళ్ళేటప్పుడో పిల్లలు స్కూలుకు వెళ్ళేటపుడో, చుట్టాలువచ్చి, వెళ్ళబోయే ముందోచూడాలి తంతు.

న్యూయార్క్ కుటుంబంతో వున్నపుడు వొక యిరవైయ్యేళ్ళమ్మాయి — వాళ్ళ చుట్టం—చూడ్డానికొచ్చింది వెళ్ళిపోతూ వరసగా అందరికీ 'బై—బై' ముద్దులిచ్చేస్తూ—అదేవూపులో నాకూ వొకటిచ్చేసి వెళ్ళిపోయింది సిగ్గుతో నావొళ్ళు ముడుచుకుపోయింది కొన్నిరోజులుపాటు అద్దంలో ముఖం చూసుకునేసరికి సిగ్గుతో చచ్చేవాణ్ణి.

అమెరికన్ కుటుంబాల్లో విడాకులు మనం అనుకుంటున్నంత, వింటున్నంత— తరచుకాదు. హాలీవుడ్ తారలకయితే ఎన్ని సార్లు విడాకులిస్తే అంత గ్లామరేగానీ సామాన్య కుటుంబాల్లో విడాకులు చాలా సమస్యలు తెచ్చిపెడుతుంది. న్యూయార్కులో నేనతిథిగా గడపిన కుటుంబం దురదృష్టవశాత్తు యిలాంటి చరిత్రకు చెందినదే! జూడి — డెన్నిస్ కొన్ని సంవత్సరాలక్రితం విడాకులిచ్చుకున్నారట. కారణం అడగడానికి సాహసం లేకపోయింది నాకు ఆవిడ న్యూయార్క్‌లో జర్నలిస్టుగా పనిచేస్తోంది ఆయన మరోవూళ్ళో ఒక హోటలు మేనేజరుగా వుంటున్నాడు వాళ్ళకి ముగ్గురు పిల్లలు. పెద్దవాడు కాలిఫోర్నియాలో చదువుకుంటున్నాడెవరిమీదా ఆధారపడకుండా మిగతా యిద్దరిలో అమ్మాయి తల్లితో, అబ్బాయి తండ్రితో వుంటున్నారు. పిల్లలు అడపాతడపా కలుసుకుంటూనే వుంటారుగానీ— జూడీ, డెన్నిస్‌లు కలుసుకుంటున్నట్టులేదు. నేను ముఖాముఖీ వివరాలడగలేదుగానీ — జూడీ వంటరి బ్రతుకులో యేమంత ఆనందంగా వుండటం లేదని గ్రహించాను.

అమెరికన్ కుటుంబాల్లో ముఖ్యంగా గమనించాల్సిన మరోవిషయం పిల్లల పెంపకం తలిదండ్రులు అతిగారాబం చెయ్యరు. చిన్న వయస్సునుండి పిల్లలు వాళ్ళ పనులు వాళ్ళు చేసుకోవాలి అల్లరిచేస్తే అమెరికన్ తల్లులు తమపిల్లల్ని కొడతారా! నాకూ తెలుసుకోవాలని కుతూహలంవేసి, డెట్రాయిట్‌లో ఆల్బర్ట్ భార్యను అడిగాను, 'పిల్లల్ని కొడతారా వాళ్ళల్లరిచేస్తే' అని నే నాప్రశ్న అడిగినప్పుడు ఆప్రశ్నావిడకు వినబడనంత అల్లరిచేస్తున్నారు పిల్లలు ఆవిడ అమాంతం లేచివెళ్ళి పిల్లలకి శక్తివంచనా లేకుండా రెండేసి, మూడేసి దెబ్బలంటించి, తిరిగివచ్చి కూర్చుంటూ, 'ఆ! ఏమిటడిగావ్' అంది. నా ప్రశ్నకు ప్రత్యక్షసమాధానం దొరికిందిగా ఆప్రశ్న మళ్ళీ అడగలేదు.



ఇక — అమెరికన్ పిల్లలు అదే వయసులోవున్న మన పిల్లలకంటే ఎక్కువ తెలుసు ననిపించేట్టు మాట్లాడుతారు, ప్రవర్తిస్తారు. విద్యావిధానంలో తేడా వుండడం మాట నిజమే కానీ అసలు పాత్ర టెలివిజన్‌దని చెప్పాలి టెలివిజన్ అందరికీ అందుబాటులో వుంటుంది. 'పిల్లలు రకరకాల ప్రోగ్రాములు చూసి, మంచీ—చెడూ రెండూ నేర్చుకొనే అవకాశం వుంది ఓసారి డెన్వర్ కుటుంబంతో కార్లో వస్తూంటే దార్లో వో నైట్‌క్లబ్ కన్పించింది వాళ్ళబ్బాయి బాబ్— 'ఏయ్ రావ్! నువ్వెప్పుడయినా 'గో—గో' డాన్సు చూశావా?' అనడిగాడు నే నాశ్చర్యపోయి 'లే'దన్నాను. 'భలే మజాగా వుంటుందిలే' అన్నాడు తను తన్మయుడై

అతని వయస్సు పదకొండు!

శాన్ డియాగో కుటుంబంలో పదేళ్ళ రిచర్డ్‌కీ, అతని తల్లి నార్మాకూ జరిగిన సంభాషణ నాకు రోమాంచం కలుగజేసింది.

'అలా జరగదనకమ్మా. ఈ రోజుల్లో యెన్ని చూట్టం లేదు? నువ్వు, నాన్నా విడాకులిచ్చుకుంటే మా భవిష్యత్తు ఏమిటి చెప్పు?' అంటున్నాడు రిచర్డ్.

'చెప్పాను కదా! మీ నాన్నా నేనూ వొకళ్ళనొకళ్ళం పూర్తిగా అర్థం చేసుకున్నాము. మాకు యే అభిప్రాయభేదాలూ లేవు ఇక విడాకుల అవసరం యెందుకొస్తుంది?' అని నార్మా అతనికి నచ్చచెప్తోంది

'దురదృష్టవశాత్తూ వచ్చిందనుకో. అప్పుడు మేము నీదగ్గరుండాలా? నాన్న దగ్గరుండాలా?'

'ఛప్. నోర్మూసుకోవోయ్! మనింట్లో విడాకుల అవసరం ఎన్నటికీ రాదు'

ఆర్థిక స్థాయిల్లో, స్తోమతల్లో, సామాజిక పరిస్థితుల్లో, గతుల్లో, సంస్కృతిలో మన కుటుంబాలకూ, అమెరికన్ కుటుంబాలకూ మధ్య చాలా వైవిధ్యత వున్నా— ప్రేమాభిమానాలూ, కోపతాపాలూ, నిరాశా నిస్పృహలూ, పట్టుదలా, ఆశావాదిత్వం . ఆదరణలూ, అనురాగాలూ యిలాంటివాటిలో—ఏ దేశం ప్రజ లయినా—ప్రజలంతా వొక్కటేనేమో ననిపిస్తుంది.




సమర్థ రామదాసస్వామి ఛత్రపతి శివాజీ కాలంలో ఉండిన మహాయోగి. ఆయన విన్నంగుడ్డై అరణ్యాలలో నివసిస్తూ ఉండినా ప్రజలను ప్రబోధిస్తూ వారిని ధర్మమార్గానికి మళ్ళిస్తూ ఉంటూవుండేవాడు

శివాజీకి ఆయన గురువు, గురువే కాదు, దైవం! తాను పాలిస్తున్న రాజ్యం ఆ యోగిదే అని శివాజీ భావన!

వాల్మీకి మహర్షి మాదిరిగానే రామదాస యోగి రామాయణాన్ని రచిస్తూ, ఎప్పటికప్పుడు శిష్యులను చేరదీసి, వాళ్ళకు వినిపిస్తూ ఉండేవాడు.

శ్రీరామచంద్రుని చరిత్ర కీర్తించబడే చోటల్లా హనుమంతుడు మారువేషంతో వచ్చి వింటూవుండడం పరిపాటి!

'యత్ర యత్ర రఘునాథ కీర్తనం
తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్,
బాష్పవారి పరిపూర్ణ లోచనం
మారుతిం నమత రాక్షసాంతకమ్'.

అనే శ్లోకం ఈ విషయాన్నే తెలియజేస్తున్నది.

అది సుందరకాండలోని — హనుమంతుడు అశోకవనంలో ప్రవేశించిన ఘట్టం.

రామదాసస్వామి హనుమంతుడు ఆ అశోక వనంలో తెల్లని పువ్వులను చూచినట్లు తెలుపుతూ, వాటిని వర్ణించాడు.

శిష్యులెంతో శ్రద్ధగా వింటున్నారు. హనుమంతుడి సంగతి వేరే చెప్పనక్కర లేదు

రామదాసయోగి యథార్థ విషయాలు వ్రాస్తున్నాడా, లేక కల్పన చేస్తున్నాడా? అని హనుమంతుడు చాలా శ్రద్ధతో గమనిస్తూనే వున్నాడు. ఇంతవరకూ అన్నీ యథార్థంగానే ఉన్నాయి. పువ్వుల వర్ణన విని, అతడు చకితుడయ్యాడు.

హనుమంతుడు చూచినవి ఎర్రని [illegible] తెల్లపువ్వులను అతడు చూడలేదు.

రామదాసు అసత్యవర్ణన చేసినందుకు ఆంజనేయుడికి ఒళ్ళు మండినది. పెదవులు అదరగా అతడు 'అయ్యా! నీవు వ్రాసినది తప్పు. హనుమంతుడు ఎర్రటి పూవులనే చూశాడు గాని తెల్లపువ్వులను చూడలేదు' అన్నాడు.

స్వామి 'హనుమంతుడు తెల్లపువ్వులనే చూశాడు' అని తిరిగి అన్నాడు.

హనుమంతుడు కోపం పట్టలేకపోయాడు! వెంటనే నిజరూపంతో స్వామికి ప్రత్యక్షమయి, 'ఓయీ! నీవు అసత్యాన్నే చెప్పుతున్నావు చూచినవాడను నేను! నాకు తెలియనిది నీ కెలా తెలుస్తుంది? ఎర్ర పువ్వులనే చూశాను. ఇలాంటి అబద్ధపు రాతలు యిక మీద వ్రాయబోకు. మహాపరాధం' అని అన్నాడు.

హనుమంతుడు తన ధ్యానంలో ప్రత్యక్షమైనందుకు స్వామి సంతోషించి చేతులు జోడిస్తూ 'ఓ రామభక్తాగ్రణీ! నీవు ప్రత్యక్షమైనందున నేను ధన్యుడనైనట్లు సంతోషిస్తున్నాను. కాని, మీరు చూచినవి తెల్లపువ్వులే అని మాత్రం గట్టిగానే చెప్పగలను. ఇలా మనవి చేస్తున్నందుకు క్షమించండి' అన్నాడు.

'అయితే నామాటే అసత్యమంటావా?'

'కపిగ్రామణీ! నీవు చర్మచక్షువులతో చూచావు నేను యోగదృష్టితో చూచాను. యోగదృష్టి అయథార్థమని ఎలా చెప్పగలము? నీవే ఆలోచించు.'



# ధర్మపథం

బులుసు వెంకటరమణయ్య

ఎవరి పట్టుదల వారు విడవడంలేదు.

యథార్థ విషయమేమిటో తేలలేదు.

ఇక గత్యంతరమేమిటి?

'ఇదేదో ఇప్పుడే తేల్చుకోవాలి తీర్పు చెప్పవలసినవాడు శ్రీరామచంద్రమూర్తి తప్ప మరొకరులేరు ఆయనదగ్గరకే వెళ్ళుదాం — పద' అన్నాడు హనుమంతుడు.

'పరమ సంతోషం' అని బయలుదేరాడు స్వామి.

ఇద్దరూ శ్రీరాముని సన్నిధి చేరుకున్నారు.

పరమభక్తాగ్రణికి శ్రీరాముడు ప్రత్యక్షం కావడంలో అనుమానం ఏముంది? ఇద్దరూ ఆయనకు కావలసినవారే!

శ్రీరాముడు ఫిర్యాదు విన్నాడు.

ఇద్దరూ వారివారి వాదనలను సకారణంగా విన్నవించారు.

శ్రీరాముడు శ్రద్ధగా విన్నాడు. చిరునవ్వు నవ్వాడు

ఒక్కక్షణం ఉండి 'రామస్వామి చెప్పినదే యథార్థం మారుతి అశోకవనంలో చూచిన పువ్వులుతెల్లనివే! ఎర్రనివి ఎంతమాత్రమూ కావు' అని ఆయన తీర్పు చెప్పాడు.

హనుమంతుడు నిర్ఘాంత పోయాడు తన ఉపాస్య దైవం చెప్పిన తీర్పును ఎలా కాదనగలడు?

శ్రీరాముడు మళ్లీ అందుకున్నాడు—

'అయితే ఒక సంగతి! పువ్వులు తెల్లనివే అయినా హనుమంతుడికి మాత్రం ఎర్రగానే కనబడ్డాయి'

హనుమంతుడికి కొంత ధైర్యం వచ్చింది.

'మారుతి అశోక వనంలో ప్రవేశించినప్పుడు కోపంతో నిప్పులు కక్కుతూ ఉన్నాడు. చూపుల్లో రక్తిమ తాండవించేది. అతడు చూచిన ప్రతివస్తువూ అతనికి ఎర్రగానే కనబడుతూ వచ్చింది పువ్వులు తెల్లనయినా, వాటిమీద అతని చూపుల్లోని రక్తిమపడి, అవి ఎర్రగానే కనిపించాయి' అని శ్రీరాముడు తన తీర్పును వివరించాడు.

ఉభయులకూ తృప్తి కలిగింది

మన భావన ఎలా ఉంటుందో — దాన్ని అనుసరించే అన్ని విషయాలు మనకూ రూపంగానే కానవస్తాయి.

యాదృశీ భావనా యస్య
సిద్ధిర్భవతి తాదృశీ,'

భావన ననుసరించే కార్యసిద్ధి!

## శత్రువుచేతకూడా మన్ననలందుకున్న

# రాణి చిన్నమాజీ

'కర్నాటకంలోని కేలడి రాజ్యానికి 1661 లో సోమశేఖర నాయకుడు పరిపాలకుడయ్యాడు. అతని భార్య చిన్నమాజీ. చిన్నమాజీ పరిపాలనలో దిట్ట. యుద్ధరంగంలో ఆరితేరిన వనిత. అటువంటి స్త్రీని భార్యగా పొందిన సోమశేఖర నాయకుని కీర్తి దిగంతాలకు ప్రాకింది. 1677 లో సోమశేఖర నాయకుడు మరణించాడు. ఆ తర్వాత చిన్నమాజీ రాజ్యానికి వచ్చింది.'

—కేలడి నృపవిజయ

(17 వ శతాబ్దపు కన్నడ చరిత్ర)

[ఢిల్లీ చక్రవర్తి ఔరంగజేబ్ తన ప్రతాపం చూపించుకుంటున్న రోజులవి. అతని ప్రభావానికిలోనై మరాఠీ సామ్రాజ్యం క్షీణదశకు వస్తున్నది. శివాజీ మరణానంతరం ఔరంగజేబ్‌కు కావలసినంత ధైర్యం వచ్చేసింది. అందుకే దక్కనులో పీఠం వేయాలని చూశాడు. శివాజీ కొడుకు శంభాజీని చంపివేశాడు. శంభాజీ భార్యనీ కొడుకునీ ఖైదు చేశాడు. శంభాజీ మరణించిన తర్వాత అతని తమ్ముడు రాజారాం రాయగఢ్‌కు అధిపతి అయ్యాడు. ఔరంగజేబ్ రాయగఢ్ కోటమీదకు దాడి చేసినప్పుడు రాజారామ్‌కు సహాయపడ్డవారు ఎవరూ లేకపోయారు.]

'మహాప్రభూ, రాజారామ్! ఔరంగజేబ్ మన శత్రువు. లతను వరసగా రాజ్యాలన్నిటినీ కొల్లగొట్టుకుంటూ వస్తున్నాడు. మనకు చూస్తే సైన్యబలం తక్కువ. అతన్ని ఎదుర్కోవడమనేది దుస్సాహసమే అవుతుంది. వెంటనే జింజీకి పారిపోదాం. అక్కడ మనం సురక్షితంగా వుండొచ్చు. ఔరంగజేబ్ చొరరాని ప్రదేశమది. మీ ఆజ్ఞకై ఎదురు చూస్తున్నాను.'

– రామచంద్ర అమాత్య

(మరాఠీ సామ్రాజ్య ముఖ్యమంత్రి)

[రాజారామ్ రాయగఢ్‌ను విడిచిపెట్టి జింజికోటకు పారిపోతున్నాడని ఔరంగజేబ్ తెలుసుకున్నాడు. అతన్ని పట్టుకోడానికి సైన్యాన్ని నలుదిక్కులకీ పంపించాడు. జింజికోట చుట్టుప్రక్కలంతా హైందవ రాజుల మయం. రాజారామ్‌కు రక్షణ నిచ్చినట్లయితే తాము ఔరంగజేబ్ విరోధి వర్గంలో చేరిపోతామేమోననే భయం వారికి ఉంది. అందుకు రాజారామ్ ఔరంగజేబ్ సైన్యానికి చిక్కకుండా తప్పించుకోవడం ఎంతో కష్టమయిపోయింది.]

'ఎంతటి అవమానం! శివాజీ కుమారుడయిన రాజారామ్‌కు రక్షణ నిచ్చేందుకు ఒక్క హైందవ రాజూ ముందుకు రాలేదు! కాని, నా విధ్యుక్త ధర్మాన్ని నేను నిర్వహిస్తాను. రాజారామ్ నా రాజ్యం గుండా వెళ్తున్నట్టు, ఔరంగజేబ్ సైన్యం వెంటాడుతున్నట్టు గూఢచారులద్వారా నాకు వార్త అందింది. రాజారామ్ జింజీకి చేరేవరకు నేనతనికి సాయపడతాను. కేలడి రాజ్యానికి, మరాఠా సామ్రాజ్యానికి పునాదులు ఒకేచోట ఉన్నాయి. ఆ విషయం నేను మరువను. రాజారామ్ నాకు సోదరతుల్యుడు. నా ఆఖరి రక్తపుబొట్టువరకు యుద్ధంచేసి రాజారామ్‌ను కాపాడతాను!'

—రాణి చిన్నమాజీ.

[రాణి చిన్నమాజీ తనకోటలో రాజారామ్‌కు రక్షణ కల్పించింది. ఔరంగజేబ్ ముస్లిం సైన్యమంతా రాజారామ్‌ తలదాచుకున్న చిన్నమాజీ కోటమీద దాడి చేసింది. చిన్నమాజీ జంకుగొంకు లేకుండా ధైర్యస్థైర్యాలతో పోరాడి శత్రుసైన్యాన్ని చెండాడింది. ఔరంగజేబ్ సైన్యం చిన్నాభిన్నమై పారిపోయింది. రాజారామ్ జింజీ కోట చేరేవరకు చిన్నమాజీ సహాయం చేసింది.

[ఈ వార్తను విన్న ఔరంగజేబ్ ఆశ్చర్యచకితుడయ్యాడు. చిన్నమాజీని అభినందిం

## డాక్టర్ కబుర్లు

### గర్భం - గుండెల్లో మంట

చాలామంది ఆడవారికి కడుపుతో ఉన్నకాలంలో గుండెల్లో మంటవస్తూ ఉంటుంది. ఈ మంటకి గర్భధారణ కాలాన్ని అనుసరించి చికిత్స ఇవ్వాలి.

మొదటి మూడు నెలలలో ఈమంట రొమ్ము ఎముకల గూడుమధ్య భాగం క్రిందుగా రావచ్చు. పులుపు రుచి తెలియదు, క్షార పదార్థాలు వాడి లాభం లేదు. రాత్రి, పగలు— ఎప్పుడయినా రావచ్చు, భోజనం, శయనం— వీటివల్ల మారేదికాదు. వికారం, డోకు, తలనొప్పి వస్తాయి. వీటన్నిటికీ క్షారపదార్థాల బదులు 'ట్రాంక్విలయిజర్లు' (మానసిక ప్రశాంతం కలిగించే మందులు) వాడాల.

నాలుగవ నెలతర్వాత వచ్చే మంట వేరు. ఇది గొంతుకలో రావచ్చు, వికారం డోకులేక పోవచ్చును. వానికి మామూలు మాత్రలు— క్షారపదార్థం కలవయినా — వాడవచ్చు.

ఏవి ఎలా ఉన్నా వైద్యసలహా లేనిదే మందును తినరాదు.



డా.

హెచ్ ఎల్ హెర్షన్‌సోన్

(కాపీరయిటు)

# చెట్లమీద మాత్రలా?

కుటుంబ నియంత్రణ 'మాత్ర' చెట్ల మీద కాస్తే అందరికీ అందుబాటుల్లో ఉంటుంది కదూ! ద్–అంత్ర కాస్తో ద్వీపాలు పసిఫిక్ సముద్రంలో ఉంటాయి. ఈ ద్వీపాలలో ఒక చెట్టు మొగ్గ అక్కడి ఆడపిల్లలు తింటూ ఉంటారు.

'ఈ ద్వీపాలలో ఉండే ఆడపిల్లలు చాలా మంది పన్నెండవ ఏటనుంచీ పురుషులతో సంబంధం పెట్టుకుంటూ ఉంటారు కాని వారికి సాధారణంగా పెళ్లి అయ్యేదాకా గర్భంరాదు,' అని ఇటీవలే మానవజాతి శాస్త్రజ్ఞురాలు డాక్టర్ ఆన్ చపునింగ్ అన్నారు. 'కడుపురాకుండా ఉండటానికి వారు ఈ మొగ్గలని వారానికి మూడు సార్లు తింటూ ఉంటారు'

ఈ సందర్భంలో ఏ రకం దేహస్వభావం ఉన్న వనితకి ఏరకం కుటుంబనియంత్రణ మాత్ర వేసుకుంటే మంచిది, అన్న ప్రశ్న విషయమయి జరిగిన పరిశోధనల ఫలితాలు కూడా ఇవ్వవచ్చు. 'న్యూజర్సీ మెడికల్ సొసయిటీ మీటింగ్'లో ఈ ఫలితాలని ప్రకటించారు.

డా. హారీ ఫుల్లర్టన్ కుటుంబనియంత్రణ మాత్రలలో రెండు రకాల 'ఏస్ట్రోజన్' అనే వస్తువునీ, ఏడు రకాల 'ప్రొజెస్టరోన్' అనే వస్తువునీ వాడుతారని ఈ మీటింగులో వివరించారు ఈ కింది దేహ స్వభావాలు కల స్త్రీలు ఈ కిందనే ఇచ్చిన పేరులు కల మాత్రలు వాడవచ్చుట. (వీటిలో కొన్ని ఈ దేశంలోనూ క్రమంగా దొరుకుతాయనివార్తలనిపట్టి గ్రహించవచ్చు)

సన్నటివారు — ఓవ్యులెన్, లావుపాటి వారు — ఓరకాన్ అధిక కామాసక్తిగల వారు — ప్రొవెస్ట్, స్వల్ప కామాసక్తి కల వారు — ఓరకాన్, మగ లక్షణాలు కల వారు— ప్రొవెస్ట్, (బాగా) ఆడ లక్షణాలు కలవారు — ఎనోవిడ్, వక్షస్థలం బాగా ఎదగని వారు — సి—క్వెన్స్, సాధారణంగా అందరూ — నార్లెస్ట్రిన్, నారినయిల్, ఆర్థోనోవమ్.

వదలకుండా ఈ మాత్రలు వాడే వారిలో కొన్ని మార్పులు కానవస్తాయిట. ఋతుక్రమం మారవచ్చు లేదా దేహం బరువు అధికం అయి చిరాకు కూడా ఎక్కువ అవవచ్చు

కాని, మొత్తం మీద మాత్రలు వాడితే పెద్ద హాని కలిగినట్లు కనిపించటం లేదని డా. ఫుల్లర్టన్ అన్నారు.

—రూత్ వింటర్ (ఇన్ ఫా) ●

# రాణీ చిన్నమాజీ

చాడు ఎన్నో బహుమతులను పంపి ఆమెను సత్కరించాడు!

'జింజీకోటను వశపరచుకోడానికి ఔరంగజేబ్ వల్ల కాలేదు, తర్వాత అతను మరణించాడు కూడా. రాజారామ్ తిరిగి రాయగఢ్‌కు వచ్చాడు. కోల్పోయిన రాజ్యాల్ని నెమ్మది నెమ్మదిగా దక్కించుకున్నాడు. అతను, చిన్నమాజీ సహాయానికి ఎప్పుడూ కృతజ్ఞతల్ని తెల్పుకుంటూనే ఉన్నాడు]

'రాణి చిన్నమాజీ భోగలాలసత్వానికి తలొగ్గినదికాదు. ఆమె మతవిషయాల్లోను, ధర్మచింతనలోను కాలాన్ని వెళ్లబుచ్చింది. అనేక పవిత్ర స్థలాల్లో ధర్మసంస్థల్ని నెలకొల్పింది కాశీ, రామేశ్వరం, తిరుపతి, శ్రీశైలంలో ఇందుకు నిదర్శనాలు కనిపిస్తాయి వ్యవసాయ పెంపుబడికోసం కాలువలని తవ్వించింది, భర్త జ్ఞాపకార్థం తుంగభద్ర నదీ తీరాన సోమశేఖర పురాన్ని నిర్మించింది వేదపండితులకు భూదానం ఇచ్చింది. ఆమె 25 సంవత్సరాల పరిపాలనలోను ప్రజలు నిత్యకల్యాణం పచ్చతోరణంగా సుఖించారు. సమకాలికుల్లో ఎవరూ రాణి చిన్నమాజీ సాటిరారు!'

—శివ తత్వ రత్నాకర్
(సమకాలీన పండితుని సంస్కృత కావ్యంలో)
—వి సు. ●

## వార్తలలో వనిత

ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ ఈ వారంలో అతి నిరాడంబరంగా జరిగిన వివాహాని కొకదానికి సాక్షిగా వ్యవహరించారు ప్రధాని డెప్యూటీ సెక్రటరీ, మాజీ భరత్‌పూర్ సంస్థానాధీశుని బంధువర్గంలోని వారైన శ్రీ



నట్వార్‌సింగ్‌కి పాటియాలా రాజదంపతుల కుమార్తె కుమారి హమిందర్‌కి పౌర వివాహ చట్టం కింద ఢిల్లీలోని అదనపు జిల్లా మాజిస్ట్రేట్ సమక్షంలో జరిగిన ఈ వివాహానికి శ్రీమతి ఇందిరాగాంధీ ఒక సాక్షిగా ఉన్నారు. రెండవ సాక్షి హిమాచల్ ప్రదేశ్ ముఖ్యమంత్రి

తీర్థయాత్రా సందర్భంగా ఈ వారంలో ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ మధుర మీనాక్షిని, మహాబలేశ్వరుని శ్రీ కాళహస్తీశ్వరుని, శ్రీ జ్ఞాన ప్రసూనాంబని, తిరుపతి వెంకటేశ్వర స్వామిని, శ్రీ అలివేలు మంగతాయారుని భక్తి పురస్సరంగా దర్శించారు. తాము దైవదర్శనం చేయడానికి తిరుపతిలో జరిగిన ఏర్పాట్లకు ప్రధాని ముగ్ధులైనారు.

నాలుగు రోజులపాటు విశ్రాంతి నిమిత్తం శ్రీమతి ఇందిరాగాంధీ కొడైకెనాల్ వెళ్ళారు. అక్కడ కోహినూర్ బంగళా ఆమెకు వసతి గృహంగా ఏర్పాటు చేశారు. ఇంతకుముందు షేక్ అబ్దుల్లాని నిర్బంధంలో కొడైకెనాల్‌లో ఉంచినప్పుడు ఆయన ఈ బంగళాలోనే ఉన్నారు, ప్రధాని బృందానికి కొడైకెనాల్ స్థలదర్శనానికి, బోటు షికారు చేయడానికి, గుర్రపు స్వారీకి తగిన ఏర్పాట్లు జరిగాయి

—తస్కర్

# జాన్ కాల్విన్

1536 సంవత్సరంలో బాసెల్ పట్నం పేరు యూరప్ అంతా మారుమోగింది. ఈ కీర్తికి కారణం — ఆ ఏడు అక్కడ ప్రచురణ అయిన ఒక పుస్తకం. దానిపేరు 'క్రయిస్తవ మత ధర్మశాస్త్రాలు.' క్రయిస్తవమత శాఖలలో ఒకటయిన ప్రొటెస్టెంట్ మతానికి సంబంధించిన గొప్ప గ్రంథాలలో ఇదొకటి. భవుతిక శాస్త్రానికి న్యూటన్ 'ప్రిన్సిపియా' ఎటువంటిదో, తత్వశాస్త్రానికి కాంట్ 'క్రిటిక్' ఎటువంటిదో ఈ మతానికి పయి పుస్తకం అటువంటిది

దానిని రాసిన వ్యక్తిపేరు జాన్ కాల్విన్. ఫ్రాన్సులోని 'నయోన్' అనే ఊరిలో 10—7—1500నాడు పుట్టాడు. అతని తండ్రి స్థానిక బిషప్ కార్యదర్శి కొడుకుని చర్చి ఉద్యోగంలో ప్రవేశ పెట్టటానికి నిశ్చయించుకున్నాడు. 12వ ఏటనే జాన్ నయోన్ కాథెడ్రల్‌లో చేరాడు. 1523లో పారిస్‌కి వెళ్ళి నాలుగు సంవత్సరాలపాటు లాటిన్, ఆధ్యాత్మిక విద్యాభ్యాసాలు చేశాడు. ఈ కాలంలోనే అతనిలో మత సంస్కరణ అవసరం అనే ఊహ కలిగింది. ఈ ఊహ జీవితాశయం అయిపోయింది చదువు పూర్తి అయిన తర్వాత పారిస్ వెళ్ళిపోయి అక్కడ మత సంస్కరణోద్యమాలలో పాల్గొన్నాడు అంతతో కీర్తి గడించాడు. కాని, ఒకనాడు అతను పారిస్‌ని వదిలి బాసెల్ అనే చిన్న ఊరికి వెళ్ళిపోయాడు అక్కడ నుంచే 'క్రయిస్తవమత ధర్మశాస్త్రాల'నే పుస్తకం వెలువరించాడు ఇది ప్రొటెస్టెంట్ మత విరోధులయిన అధికారులకి నచ్చలేదు కాల్విన్ ఫ్రాన్సువదిలి పారిపోవలసి వచ్చింది. అతను స్విట్జర్లాండులోని జెనీవాకి వెళ్ళిపోయాడు. చనిపోయేదాకా అక్కడే ఉండిపోయాడు అతని కీర్తి ఎటువంటిదంటే మతసంబంధమయిన విషయాల వల్ల దేశం వదిలి వచ్చినవారెందరో జెనీవాని తమ నివాసస్థానం చేసుకున్నారు

కాల్విన్ సిద్ధాంతాలు కొత్తవికావు. సెయింట్ ఆగస్టిన్ అతను చెప్పిన వెన్నో అంతకిముందే చెప్పాడు. కాని, కాల్విన్ ప్రొటెస్టెంట్ మతసిద్ధాంతాలని చక్కగా సూత్రీకరించి చెప్పాడు, వివరించాడు ప్రకృతిమీద, ఆత్మమీద భగవంతుడికి సంపూర్ణమయిన అధికారం ఉందని కాల్విన్ వాదించాడు.

కాల్విన్ కీర్తి నలుదిశలా పాకింది. ఎందరో రాజులూ, మహరాజులు అతనితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూ ఉండేవారు అయితే, కాల్విన్‌మాత్రం పేదగానే జీవిస్తూ వచ్చాడు కాల్విన్ సిద్ధాంతాలని గాఢంగా ద్వేషించే ప్రతివాది ఒకడు 1564 ప్రాంతాలలో ఒకచోట ఇలా రాశాడు — 'పాషండుడయిన కాల్విన్ బలం ఏమిటంటే, అతనికి ధనంమీద అసలే ఆశ లేదు!'

—ఎస్.



**బి, ఉలవపాడు**

కధలలో సాధారణంగా స్త్రీలను సౌందర్యవతిగానూ ఆకర్షణకల యువతిగానూ వ్రాస్తూ ఉంటారు ఎందుచేత?

ఎందుచేత నేమిటి? అది రచయిత జన్మహక్కు తను వూహించిన పాత్రలకైనా తన కోర్కెల తొడుగులని తొడుక్కో నివ్వరా ఏమిటి?

**ఎస్ టి, ఖర్గపూరు**

మాది ఉమ్మడి కుటుంబం యదార్ధగాధ వ్రాసి పంపిస్తాను కధమాత్రం చక్కగా ఉంటుంది ప్రచురిస్తారా?

దొంగ ఉత్తరాలు వ్రాసి కొంపలు కూల్చేవారికీ, ఇలా నిజజీవితాలతో చెలగాటం ఆడేవారికీ తేడా ఏమిటొ నాకు తెలియడం లేదు సోదరీ

**డి జె. పి, బరంపురం**

అల్లరి చిల్లరగా తిరిగే యువకులు పెళ్ళికాగానే పెద్ద మనుష్యుల్లాగా మారిపోతా రెందుకు?

ఆ మార్పు సహజం బాధ్యతతో పాటు వస్తుంది అలామారని వాళ్ళు వైవాహిక జీవితంలో సుఖ శాంతులకి దూరం అవుతారు

**ఎన్. జె, విశాఖపట్నం**

స్త్రీ వంటరిగా జీవించకలదని నా స్నేహితురాలు, జీవించలేదని నేను వాదించుకుంటున్నాం.

మీ స్నేహితురాలి వలాగా, మీ రిలాగా జీవించడానికి నిర్ణయాలు చేసుకొని స్వానుభవం వల్ల తెలుసుకోకూడదా సోదరీ?

**వి. ఎల్. ఎన్. ఆర్, బరంపురం**

ప్రతి మానవుడు భవిష్యత్తుని గురించి తియ్యనికలలు కంటాడా?

ప్రతివ్యక్తికీ కలలు కనడం జన్మహక్కు ఎటొచ్చీ తనకే ఆ హక్కు ఉందేమో అని అపోహపడుతూ ఉంటాడు అప్పుడే ఇలాంటి ప్రశ్నలు తలెత్తుతూ ఉంటాయి

**వి. వి. ల్, జయపురం**

స్వర్గం నరకం అంటూ వేరే ఉండవనీ ఈ భూమిమీదే పాపపుణ్యాల బేరీజును పట్టి అనుభవిస్తామని నానమ్మిక మరి మీది?

ఈ భూమి అంతా ఎందుకు సోదరీ, కొందరు పుణ్యాత్ములు ఎవరింటిలో వారే ఈ స్వర్గనరకానుభవాలని పొందేస్తూ ఉంటారు!

**బి. వి. ఎస్. ఎస్, అనకాపల్లి**

ఇహ పర సుఖాలని అనుభవించాలనుకున్న మానవుడు అనుభవించలేక పోతాడు ఎందుచేత

బహుశా 'ఇహం'లో ఉంటూ 'పర' సుఖాలని హామేషా కోరుతూ ఉండడం వల్లనేమో తమ్ముడూ.




**కె కె, సామర్లకోట**

ఆంధ్ర రచయిత్రుల పుస్తకం ప్రచురితం అయిందా? ఎక్కడ దొరుకుతుంది?

అడ్డ పీత నడకలు నడుస్తూ మెల్లిగా రూపం దిద్దుకుంటూంది పుస్తకం అచ్చు అయాక సాహిత్య అకాడమీ వారి కార్యాలయానికి వ్రాస్తే దొరుకుతుంది

**ఎమ్ వి. ఎస్. మద్రాసు—4**

స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః అన్న పెద్దల వాక్యం చాలా వరకు నిజం అని నా వాదం. మీరేమంటారు?

స్వానుభవం మీద చెప్తున్నారేమో! మీమాట ఎలా కాదంటాను? స్త్రీ బుద్ధి ప్రళయకారి అన్న పెద్దలే ఆ స్త్రీ పూజింపబడిన చోట దేవతలు నివాసం ఏర్పరచుకొంటారనీ అన్నారు అదీ మీరు వినే ఉంటారు.

**ఎన్. వి. ఎస్, బరంపురం**

ఆడవాళ్ళు ఎంత చదువుకున్నా వంట చేయక తప్పదని కొందరంటూ ఉంటారు కదా, చదువుకుంటే వంట చెయ్యకూడదా?

కొందరలా అనుకోవడంలో తప్పులేదు గాని ఈ మధ్య వస్తున్న కార్యాలకి ఆధారంగా చదువుకున్న ఆడది భర్త చేతివంట గాని తినదన్న నమ్మకం ఎక్కువ అవుతుందేమో వంటచేయడం తప్పుకాదు అదేమంత బ్రహ్మవిద్యాకాదు!

**ఎం. కె, విజయనగరం**

కళాత్మక దృష్టిలోఉండి పరీక్ష తప్పాను. బంధుమిత్రులు నన్ను హీనపరుస్తున్నారు. నాకు బ్రతుకు వ్యర్థం అనిపిస్తూంది

'తాటి చెట్టు ఎందుకెక్కావు?' అంటే 'దూడ గడ్డికోసం' అన్నాట్ట వెనుకటికి ఒకడు కళాత్మక దృష్టికి పరీక్ష తప్పడానికి ఏమిటి సంబంధం? చదివితే పాసయ్యే పరీక్షకి కళాదృష్టి ఎందుకు అడ్డువస్తుంది? చదువుకునే రోజులలో విద్యార్థులకి ఇతర వ్యాపకాలు ఉట్టి హాబీలుగానే ఉండాలి.

**డి. ఎ, టిటాగ్లాఘర్**

మా చెల్లెమ్మగారు నన్ను 'కళలేని జీవితం వ్యధా' అంటుంది మీరేమంటారు?

మనలో మనమాట— మీ చెల్లెమ్మగారు ఏ 'కళ' గురించి అంటున్నారా తెలుసుకోవాలని ఉంది!

**పి. ఆర్. డి, నుంజార్లపల్లి**

ఆదినుంచి గౌరవమర్యాదలు పొందిన స్త్రీ ఈనాడు ఫాషను పేరుతో, హక్కుల పేరుతో, సామాన్య గౌరవ మర్యాదలనే కాక మానధనాన్ని కూడా కోల్పోతోంది ఈ పతనానికి కారణం ఏమిటి?

కర్మని చావుకిలాగ వ్యక్తుల పతనానికి కారణాలు అనేకం ఉంటాయి అయినా స్త్రీలీనాడింత పతనావస్థలో ఉన్నారని వూహించుకుని కుమిలిపోకు కుమారీ!

**వి. ఎమ్ ఆర్ శ్రీరామగిరి**

నేటి మన ఆర్థిక పరిస్థితివల్ల పొదుపు గురించి కొన్ని ముఖ్య విషయాలు తెల్పగలరా?

నేటి పరిస్థితులలో పొదుపును గురించి ఏం చెప్పినా చిలకపలుకుల లాగా ఉంటాయి 'చాలీచాలని జీతాంతో చస్తుంటే మధ్య ఈ గొడవేమిటి?' అంటారు తమ్ముడూ

**పి, ఎస్. కె ఆల్, ఒంగోలు**

జీవితాంతంలోఉన్న జీవి ఆశించేదేమిటి? జరిగేదేమిటి?

జీవితాంతంలో పుణ్య చింతనతో చనిపోవడం మంచిదని కోరతారు కాని వెనకటికో పెద్దమనిషి చావు బ్రతుకుల్లో ఉంటే, ఆయనచేత నారాయణ, నారాయణ అనిపించాలని చుట్టూ చేరిన చుట్టాలు తాపత్రయ పడ్డారుట చివరికి నాలాంటి ప్రబుద్ధునికో ఉపాయం తట్టిందట కనీసం 'నార' అనేనా అంటాడని నార పట్టుకొచ్చి చూపించాడుట నీరసించిపోతున్న కంఠంతో 'ఇప్పుడు పీచెందుకు?' అన్నాట్ట ఆ పెద్దమనిషి , కొందరి జన్మ అంతే! అలాగే ఉంటాయి—

**ఎమ్. బి ఆర్, జంషెడ్‌పూరు**

ఆడదై పుట్టాక ఎప్పుడూ ఇంట్లోనే పడి ఉండాలా? వీధి గుమ్మంలోకి వస్తే విసుక్కొనే మగవారితో వేగడం కష్టం. కొన్నాళ్ళిలా పడిఉంటే పిచ్చెత్తి పోతుం దేమో అనిపిస్తుంది

మీ ఉత్తరానికి సమాధానం అనవసరం ఎందుకంటారా? ఆడదానికి ఆవేశం ఎక్కువ అన్న నానుడి రుజువు చేస్తుంది మీ లేఖ అస్తమానూ ఇంట్లో ఉంటేనే మీకంత విసుగ్గా ఉంటే, పగలంతా పని

చేసివచ్చే మగవారికింకెంత విసుగుఉండాలి? గుమ్మం దగ్గరికి రావడం రాకపోవడం అన్న చిన్న విషయంతో జీవితపు బాధ్యతలు ముడి పెట్టుకోవడమా? అన్న సంగతి ప్రశాంతంగా కూర్చుని ఆలోచించండి కొంద రాడవాళ్లు ఏ టైములో చూసినా గడపలని పట్టుకు వేలాడుతారు వీధికేసిచూస్తూ కాలక్షేపం చేస్తారు లేదా వీధివైపు కిటికీలలో కూర్చుని చూస్తుంటారు ఇలాంటి వారినిచూస్తే మనకే ఎబ్బెట్టుగాఉంటుండే దాన్నెవరికి చెప్పాలి? ఇరవైనాలుగు గంటలూ ఇంట్లో ఉంటే ఏం తోచడంలేదని మీవారితో చెప్పండి సాయంత్రం పూట ఏ బజారుకో తీసుకు వెళ్లమనండి (బజారుకు వెళ్లి ఏదో కొని తీరాలని అనుకోకండి) అలా సరదాగా విండో షాపింగ్ చేసివస్తే హాయిగా ఉంటుంది ఇక పిచ్చెత్తడం సంగతంటారా? మా నాన్నగారు అంటూ వుంటారు— 'ఆడది పిచ్చి ఎత్తించాకలదు, పిచ్చి ఎత్తించుకోనూ కలదు' అని ఏం చేయదలిచాం అది మీరే నిర్ణయించుకోవడం మంచిది— వ్యక్తిగత సమస్యలు, కుటుంబపు గుట్టు రచ్చ కీనాడు ఎక్కించి తృప్తిపడ్డా, మరునాడు బాధ పడవలసినదీ మీరేనన్న సంగతి మరిచిపోకూడదు — దాని జీవితం అరిటాకూ ముల్లూ నతు!

## యన్. వై. ఆర్. కె, పొణ్యాం

'వివాహం చేసుకోవలయునని రెండు సంవత్సరాలనుంచి అమ్మాయిలని చూస్తున్నాను. అందం ఉంటే చదువు ఉండదు చదువుంటే అందం ఉండదు ఈ రెండింటిలో దేన్ని వదులుకోవాలో సెలవిస్తారా ?'

మీ కష్టం నిజంగా బాధాకరమైనదే! పొణ్యాంలో కూర్చుని మీరలా వాపోయి ప్రయోజనం లేదు కాలేజీలలో చూడండి తెలివి తేట్లకి మెరుగులు పెట్టే లందకత్తెలుండడమేకాదు అలాంటి వాళ్ల మీలాంటి వేటగాళ్లకి ఒకటో ఆరో పాఠం కూడా చెప్తారు అయినా అంతా కాకిచూపులాగా ఒక పక్కే చూస్తే ఏంప్రయోజనం! మీరు చూసిన అమ్మాయిల్లో ఒకరైనా ఉత్తరం రాస్తే నాకూ తెలి తెలిసేది— ఆ అమ్మాయి దేన్ని వదులు కుందో !

## డి. పి. విజయనగరం

బి ఏ. పాస్ అయిన నాకు కట్నంపుచ్చుకొనే వ్యక్తిని వివాహం చేసుకోవడం యిష్టం లేదు ఏం చెయ్యను ?

చేయడాని కేముంది కట్నం కోరనివారికోసం వేచి చూడండి

## కె. వి. ఎన్. ఆర్, అనకాపల్లి

నిజమైన సాఫీగా సాగదన్న షేక్సుపియరు మాటలతో మీరెంతవరకూ ఏకీభవిస్తారు

ఎంతవరకూ ఏమిటి? పూర్తిగానూ.మన సినిమా లు చూస్తుంటే తెలియడం లేదా — యీ సంగతి

## వి. ఏ. ఎస్, కరీంనగర్

ఆనందం ఆత్మకు సంబంధించినది , ఆత్మ దేనికి సంబంధించినది? ఇహానికా? పరానికా?

ఆత్మ బ్రతికున్నన్నాళ్లూ మనిని అంటి పెట్టుకునే ఉంటుందిగా అంచేత చచ్చేవరకు 'ఇహం' తరవాత 'పరం' అని చెప్పుకుందాం.

## ఆర్. పి. సి. ఆర్కో, కొల్లూరు

మానవునకు నిత్య ముఖ్యావసరం ఏది ?

డబ్బు!

## పి. విశాఖపట్నం

'నన్ను ఒరే తమ్ముడూ, అని మనసారా పిలిచే అక్కయ్య ఒక్కరూ నాకు కనిపించ లేదు ఆ పిలుపులో నాకు సంతృప్తి లభిస్తుంది—మీ ఉద్దేశ్యం ?'

ఉద్దేశ్యం ఏమైతే నేమి? పరితపించి పోతువ్నావుగా నే పిలుస్తా— ఒరే తమ్ముడూ !

## జి. బి. ఆర్, గంటి బాబానగర్

మానవునకు/తన మానవ జీవితంలో చీకు చింతలేకుండా ఎంతకాలం జీవించకలడు ?

'తన' మానవజీవితంకాక 'పర' మానవజీవితం కోసం యిద్దైపోనంత కాలం కొంతలో కొంత చీకు చింత తగ్గుతాయి

## బి. సి. కె, ఆలూరు

'దేవునిపైనే దృష్టివుంచి సర్వస్వము దేవునికే' అంకితం యిచ్చి, చివరకు నిలువ నీడలేక ఆలుబిడ్డలను వదలి మరణించాడు అతడు దేవుణ్ణి చూస్తాడంటారా ?

తనకితాను సహాయం చేసుకోనివ్యక్తిని దేవుడ్తైనా చూసి కనికరిస్తాడని అనుకోవడం అత్యాశ ఆలు బిడ్డలను అధోగతిపాలు చేసి దేవునికి అందలం ఎత్తడం దేవుడు కూడా హర్షించడు

## కె. ఎస్. ఆర్, చేవ్రూరు

జీవితంలో మనం సాధించగలిగేది ఏమిటండి ?

ఏం సాధించాలనుకుంటే అది సాధించడమే ప్రశ్నేకించి 'ఇవి' సాధించు అని ఆదేశించడానికి ఎవరూ ఉండరు సాధించే పద్ధతిలో రూల్సు ఉండవు. ఎవరి పద్ధతి వారిది!

## డి. డి, మంగళగిరి

స్త్రీలుకూడ పెద్ద చదువులు చదువవలెనని కోరిక ఉన్న వీలైన సౌకర్యములు లేనప్పుడు ఏమిచేయవలయును !

వూరకుండవలయును!

## వై. యల్. ఎస్, ఆముదాలవల్సా

వేసినప్రశ్నకు సమాధాన మివ్వక తిరిగి ప్రశ్నే వేసినవారిని ఏమనాలి ?

ఏమనాలి?

## కె ఆర్. ఆర్. జి, అగ్రహారం

మీ ప్రశ్నావళికి ఏ ఏ ప్రశ్నలు పంపాలి ? వ్రాసేవారు ఆడవారే కావాలా ? లేక మగ వాళ్ళుకూడా పంపవచ్చా ?

ప్రశ్నావలి చూస్తున్నారుగా ఈ శీర్షికకు ఏవిధమైన పక్షపాతం లేదు. ●

[11—8—1967 ఆంధ్ర సచిత్ర వార పత్రికలో, 'ప్రశ్నావళి' శీర్షికలో, కుమారి జంపాల హనుమాయమ్మ, దుగ్గిరాల పేరు కింద ఒక ప్రశ్న, ఆ ప్రశ్నకి శ్రీమతి కె రామలక్ష్మి ఇచ్చిన సమాధానము, ప్రచురించాము ఆ ప్రశ్న తాము పంపలేదని కుమారి జంపాల హనుమాయమ్మ రాస్తున్నారు.

—సంపాదకుడు.]






(ఒంటరిగా ఉన్నప్పుడు నాకు కలిగిన ఊహాలే యీ రచనలకు ఆధారం. ఏ వ్యక్తినిగాని, యే సంఘటననుగాని ఉద్దేశించి యివి వ్రాయబడలేదు. కేవలం హాస్యమే యీ రచనల లక్ష్యం—రచయిత)

'మనం ప్రతిసాయంత్రం యిక్కడ కూర్చొని, యెవరికి తోచింది వాళ్ళం మాట్లాడేస్తున్నాం కాని దానివల్ల యెంత మాత్రం లాభంలేదు. ఏదో ఒక విషయాన్ని తీసికొని, దాన్ని సమగ్రంగా చర్చించాలి' అని తన అభిప్రాయాన్ని వెల్లడించాడు చిదంబరం.

'కేవలం చర్చించడమే కాదు దాన్ని లిఖిత మూలంగా భద్రపరచాలి. లేకపోతే మన చర్చలవల్ల అంతగా ప్రయోజనం ఉండదని' చంద్రరావు తన వివరణను ప్రతిపాదించాడు.

'మీ యిద్దరకూ అంత పట్టుదలగా ఉన్నప్పుడు నేను మాత్రం కాదంటానా? అని చూడామణి తన ఆమోదాన్ని వెల్లడిస్తూ యిలాగ అన్నాడు.

'కొంచెం యించుమించుగా తెలుగులో ప్రతిగ్రంథం విషయంలోను, యెక్కడ వ్రాశారనే దాన్నిగురించో, యెప్పుడురాశారనే దాన్ని గురించో యెవరురాశారనే దాన్ని గురించో, తగాయిదాలు ఉంటూనే ఉన్నాయి. అందుచేత మనవిషయంలో అలాంటి తగాయిదాలు రాకుండా ముందుగానే జాగ్రత్త పడాలి.'

'దానికే ముంది? మనం అనకాపల్లి యేటిగట్టున జామితోటలో కూర్చొని, ఫలానా ఫలానా తేదీల్లో రాశారని ముందుగానే రాద్దాం.'

'కేవలం అనకాపల్లి అని రాస్తే చాలదు. కొంతకాలం పోయినతరువాత మన అభి-

ప్రాయాలు యెవరికైనా ఉపయోగకరంగా కన్పించినట్లయితే వాళ్ళు, అమాంతంగా మీటింగుపెట్టి మనల్ని మహా కవులుగానో, మహాపురుషులుగానో, యుగ పురుషులుగానో ప్రకటించి మన జయంతులు, వర్ధంతులు అంటూ చేయడం ప్రారంభిస్తారు. అటువంటప్పుడు కొంతమంది వ్యక్తులు తమ పాండిత్యాన్ని ప్రదర్శించడానికిగాను మనది అనకాపల్లి అనే గ్రామం కాదని మరేదో గ్రామమని వాదించే ప్రమాదం ఉంది అందుచేత అనకాపల్లికి ఆపేరు యెలాగవచ్చిందీ మొదలైన వివరాలతోసహా పకడ్బందీగా రాయాలి' అన్నాడు చంచ్రలావు.

### అనకాపల్లి కథ

'పూర్వం యీ గ్రామానికి 'అనేక ఫలీ' అనేపేరు ఉండేది. రకరకాలైన ఫలాలు యిక్కడ దొరకడమే దానికి కారణం 'అనేక ఫలీ' అనే పేరే కాలక్రమంలో అనకాపల్లిగా మారింది' అన్నాడు చిదంబరం.

ఇంతకంటే ముఖ్యమైన కారణం మరొకటి ఉన్నదంటూ చంచ్రలావు చెప్పడం ప్రారంభించాడు.

పూర్వం సనకసనందనాదులు అనే రుషులు ఉండేవారు వారిలో సనకుడికి అనకుడు అని ఒక తమ్ముడు ఉన్నాడు వాళ్ళిద్దరూ, చిన్నప్పుడు కాశీలో గురువుగారిదగ్గర చదువుకుంటుండేవారు ఒకనాటి ఉదయం అన్నదమ్ములిద్దరూ గురువుగారి నిమిత్తం పువ్వులు, పళ్ళు తేవడానికి అడవికి వెళ్ళేరు. అడవిలో అనకుడికి ఒకమంచి జామపండు కన్పించింది. అప్పటికి యింకా స్నానం చేయకపోయకపోయినా, కోరికను అణచుకోలేక ఆ జామపండును తినేశాడు అనకుడు తరువాత గురువుగారికి నిజం చెప్పి క్షమించవలసినదిగా కోరేడు.

'నీవు చేసింది పాపం నిన్ను నేను క్షమించినా పాప ఫలితం నువ్వు అనుభవించక తప్పదు అందుచేత పాప పరిహారం నిమిత్తం కాశీ విశ్వేశ్వరుని దర్శించి, గంగాజలం తీసికొని రామేశ్వరం వెళ్ళి అక్కడ రామేశ్వరుని గంగాజలంతో అభిషేకం చేసి సేతువులో యిసుక తీసికొని వచ్చి గంగలో కలపాలి అలాగ నీవు చేసినట్లయితే యీ పాపం పోతుంది' అని గురువుగారు అన్నారు.

ఈ పాపం చేసినప్పుడు నువ్వు అనకుడికి తోడుగా వున్నావు కాబట్టి యీ యాత్రలో కూడా తోడుగా వుండవలసినదిగా గురువుగారు సనకుణ్ని ఆదేశించారు.

సనకుడు, అనకుడు కాశీలో విశ్వేశ్వరుని దర్శించి, నాగపూరు, హైదరాబాదు (అప్పటికి యీ పేర్లు లేకపోయినా దారి గుర్తు నిమిత్తం వాడబడ్డాయి) లమీదుగా రామేశ్వరం చేరుకొన్నారు. అక్కడనుంచి చెన్నపట్టణం మీదుగా కాశీకి బయల్దేరేరు ఒకనాటి మధ్యాహ్నానికి వాళ్లిద్దరూ కసింకోట సత్యనారాయణమూర్తి కొండ ప్రాంతానికి వచ్చేరు ఎండ చాలా తీవ్రంగా వుంది అనకుడికి ఆకలి, దాహం కూడా అధికం కావడం వలన నీరసంతో ముందుకి నడవలేక అక్కడ కూర్చొనిపోయేడు అప్పుడు సనకుడు కొంచెం ముందుకు వెళ్ళగా అక్కడ శారదా నది, ఆ ఒడ్డున ఒక పల్లి కన్పించేయి. అవి చూచి సనకుడు వెనుకకు పరుగెడుతూ 'అనకా! పల్లి, ఓ అనకా! పల్లి' అంటూ కేకలు వేశాడు అప్పటి నుంచి ఆ పల్లికి అనకాపల్లి అని పేరు వచ్చింది అనకుడు ఆ యేటిలో దాహం తీర్చుకొని, అక్కడి ప్రకృతి సౌందర్యానికి సంతోషించి, కాశీ నుంచి తనతో తీసుకొని వచ్చిన జామి విత్తనాలను అక్కడ నాటేడు. అందుచేతనే అనకాపల్లి జామిపళ్ళు చాలా రుచిగా వుంటాయి

'సరే స్థలాన్ని గురించిన వివరాలు చాలు. ఫలానా సంవత్సరంలో వీనిని రాశామని ముందుగానే వివరించడం మంచిద'న్నాడు చిదంబరం

'ఇది కూడా అంత సులువైనదేం కాదు' ప్రతి చరిత్రకారుడికి కొన్ని స్వంత సిద్ధాంతాలు ఉంటాయి వాటికి విరుద్ధంగా యెంత బలమైన సాక్ష్యం కన్పించినా, దానికి ఏదో ఒక అనవసరమైన అర్థాన్ని కల్పించి, తమ సిద్ధాంతానికి అనుకూలంగా మార్చివేయగలరు. క్రీస్తు శకం 1967 అని నువ్వు యెంత స్పష్టంగా రాసినా కూడా, దానిని క్రీస్తు తరువాత వెయ్యి సంవత్సరాలకు అని గాని లేదా క్రీస్తుకు వెయ్యి సంవత్సరాలు ముందు అని గాని చరిత్రకారులు బలమైన ఆధారాలతో రుజువు చేయగలరు. చరిత్రకారుల వద్ద మన పప్పులేం ఉడకవు' అని స్పష్టంగా తేల్చేశాడు చూడామణి

'అసలు పేరులోనే ఉంది ఆ ప్రత్యేకత కుంభకారుడు అంటే కుండలు చేసేవాడు అన్నట్లుగా చరిత్రకారుడు అంటే చరిత్రను చేసేవాడని అర్థం నిజంగా జరిగింది యేమైనప్పటికీ, దానితో నిమిత్తంలేకుండా తనకు తన సిద్ధాంతాలకు అనుగుణంగా చరిత్రను సృష్టించగలిగినవాడే నిజమైన చరిత్రకారుడు అందుచేత ఎంత జాగ్రత్తగా రాసినా కూడా మనం చరిత్రకారుల బారి నుండి తప్పించుకోలే'మని తమ బలహీనతను వెల్లడించాడు చంచ్రలావు

'మనకు చేతనైనంతవరకు వివరంగా రాద్దాం తరువాత చరిత్రకారుల దయ. మరొక విషయాన్ని గురించికూడా యిప్పుడే స్పష్టంగా రాయడం మంచిది' అన్నాడు చూడామణి

'ఏమిటది?' అని చిదంబరం చంచ్రలావు ఒకేసారి ఆత్రతతో చూశారు.

'మన రచనలకు సినిమా ప్రమాదం యేర్పడవచ్చును అందుచేత మన రచనల్ని కొంతగాని, అంతాగాని యెట్టి పరిస్థితిలోను సినిమా తీయరాదు. ఎవరైనా యిందుకు విరుద్ధంగా వ్యవహరించినయెడల మేము జరుపబోవు పరువునష్టపు దావాకు గురి కావలసి వుంటుంది—అని యిప్పుడే స్పష్టంగా రాయాలి' అన్నాడు చూడామణి

'సినిమాలంటే నీ కింత భయం యెందుకు?' అని చిదంబరం ప్రశ్నించాడు.

ఇటువంటి ముందు జాగ్రత్తను తీసుకోనందువల్లనే గదా వాల్మీకి, వ్యాసుడు, కాళిదాసు మొదలైన కవులంతా సినిమా బారిని పడ్డారు. అందులోను లక్ష్మీదేవి శాపాన్ని గురించి విన్న తరువాత, యెవడూ తన రచనను సినిమా తీస్తుంటే చూసి సహించలేడు' అన్నాడు చూడామణి

'ఏమిటా శాపం?' అని చంచ్రలావు, చిదంబరం ఒకేసారి ప్రశ్నించగా చూడామణి చెప్పడం ప్రారంభించాడు

(ఇంకా వుంది)

# కదిర్ గ్రామం

ఫొటోలు, వ్యాసం ఎస్. రామకృష్ణ



కప్పురాశైయార్‌లు పూజకి నడిచి వెడుతున్న దృశ్యం

కదిర్గ్రామం వెళ్ళాలని ఎన్నో రోజులుగా అనుకుంటున్నాను ఈ మధ్యే ఆ అవకాశం కలిగింది!

కదిర్గ్రామం సిలోన్ ఆగ్నేయ ప్రాంతంలో మాణిక్య గంగ నదీతీరం మీద ఉంది దక్షిణ భారతదేశంలో ఉండేవారికి దీనిపేరు బాగా తెలుసు సిలోన్ పాఠిసంగతి సరేసరి కాని ఉత్తరాదివారికి ఇది అంతబాగా తెలియదు

సింహళద్వీపం వారు దీనిని కైలయ అని పిలుస్తారు కదిర్గ్రామం కొలంబోకి సుమారు 190 మయిళ్ల దూరంలో ఉంటుంది బస్సుమీద ఇలికగ చేరుకోవచ్చు— నది ఇవతలవడ్డ దగ్గర దిగి చిన్న వంతెన మీదుగా నడిచి నీటిని దాటాలి

అక్కడ దేవాలయాలకి ఉన్నట్లే ఈ గుడికీ పురాణగాథ ఒకటి ఉంది పద్మాసురుడనే రాక్షసుడు దేవతలని బాధపెట్టగా వారు బ్రహ్మ, విష్ణువులని ప్రార్థించారు వారూ ఏమీ చెయ్యలేక పోయారు శివుని సహాయం అర్థించారు శివుడు కార్తికేయుడిని పంపాడు కార్తికేయుడు తల్లి పార్వతి ప్రసాదించిన ఈటెతో రాక్షసుడిని (తమిళనాడులోని తిరుచ్చెందూర్‌లో) పొడిచాడు రాక్షసుడు కార్తికేయుడిని పూజించి, తనని నెమలి వాహనంగా మార్చుకొమ్మని ప్రార్థించాడు కార్తికేయుడు అతని ప్రార్థనని మన్నించాడు ఈ విజయం తర్వాతనే కార్తికేయుడు సింహళానికి వెళ్ళి వేటకత్తె వల్లిని వివాహం చేసుకున్నాడు, సింహళ ద్వీపంలోని కిరాతక తెగవారు అతనిని తమ అల్లుడుగా స్వీకరించారు అతని పేర 'కార్తికేయ గ్రామం' స్థాపించటం జరిగింది ఇదే 'కదిర్గ్రామం' అయింది

తమిళరాజా ఎల్లాలుడిమీద గెలుపు ప్రసాదించినందుకు క్రీ పూ మూడవ శతాబ్దంలో ఒక రాజుగారు ఇక్కడ గుడి కట్టించాడట కాని నేటి ఆలయ కారకుడు ముత్తులింగస్వామి ఇతనికి కళ్యాణగిరి అనే పేరుకూడా ఉంది కళ్యాణగిరికి కార్తికేయుడిని తిరిగి భారతదేశానికి తీసుకువచ్చి వెయ్యాలనే కోరిక కలిగింది కదిర్గ్రామానికి వచ్చి 12 సంవత్సరాలు తపస్సు చేశాడు ఈ కాలంలో ఇద్దరు కిరాతక బాలబాలికలు అతనికి ఎంతో సేవచేశారు 12 ఏళ్ల తర్వాతకూడ స్వామి ప్రత్యక్షం కాకపోవటంతో ఒకనాడు నిరాశాపూరితుడయి నిద్రపోయాడు నిద్రాభంగం అయింది కళ్లు తెరవగానే బాలుడు పరిగెత్తుకపోతూ కనిపించాడు కళ్యాణగిరి అతని వెంట పడ్డాడు బాలుడు నదిదాటి వెంటనే సుబ్రహ్మణ్యస్వామిగా ప్రత్యక్షమయ్యాడు తనకి సేవచేసిన బాలబాలికలు వల్లి, సుబ్రహ్మణ్యులేనని కళ్యాణగిరి గ్రహించాడు దేవుడి క్షమకోరి వెంటనే భరత దేశానికి తిరిగి వచ్చెయ్యమని ప్రార్థించాడు వల్లి దీనికి అంగీకరించలేదు ఒకవయిపు భక్తుడు, మరొకవయిపు భార్య వల్లి ఉడికి తాళలేక [illegible] సుబ్రహ్మణ్యుడు కాని చివరికి వల్లిమాటే నెగ్గింది కళ్యాణగిరిస్వామి కదిర్గ్రామంలోనే స్థిరపడి పోయాడు

కొన్ని సంవత్సరాలు గడిగాయి కళ్యాణగిరిస్వామి సమాధిలోకి వెళ్ళేముందు ఒక చక్రం వెయించి గుడిలో ప్రతిష్ఠించాడు అక్కడ లింగం ఒకటి ఉద్భవించింది దీనికి 'ముత్తులింగం అనే పేరు వచ్చింది

కళ్యాణగిరిస్వామి 16 వ శతాబ్దం వాడు అంటారు నేటి మఠాధిపతి అతని పరంపరలో 12 వ వాడు. ఆయన పేరు రామగిరిస్వామి

ఈ గుడికి గోపురంలేదు ద్వార మండలంమీద ఈటెని ప్రతిష్ఠించారు రాత్రివేళల దీనికి దీపాలు పెడ్తారు లోపల మూడు ఆలయాలు ఒకటి మహావిష్ణువుది, రెండవది విఘ్నేశ్వరుడిది, మూడవది మురుగన్‌ది మహావిష్ణు గుడిలో బుద్ధుని విగ్రహం ఒకటి ఉంది ఆలయాల వెనుక బోధి వృక్షంకూడా ఉంది

కదిర్గ్రామం ఆలయంలో విగ్రహారాధన లేదు ('సర్వవ్యాపి' అయిన భగవంతుడికి విగ్రహపూజ అవసరంలేదు, అనే సిద్ధాంతం ప్రకారం) గర్భగుడిముందు పెద్దతెర ఒకటి ఉంటుంది దానిమీద మురుగన్ వల్లి, నెమలిబొమ్మలు వేసి ఉంటాయి లోపలికి సింహళీయుల కొందరిని మాత్రమే వెళ్లనిస్తారు వారిని 'కప్పురాశైయార్' అంటారు [illegible]

రాళ్ళైయార్ వస్తాడు—సిల్కు ధోవతి, జుబ్బా .. తలగుడ్డలతో. ఇద్దరు అతని తలమీద బట్ట ఒకటి పట్టుకునివస్తారు. అతనుముందు విష్ణుగుడికి వెళ్లి తర్వాత తన మందిరానికి తిరిగి వెళ్లిపోతాడు. ఆ పయిన పూల తట్టతో, తివాసీమీదుగా తెరవెనుకకి నడిచి వెడతాడు శంఖారావంతో గీతాగానం కూడా వినిపిస్తుంది కప్పు రాళ్ళైయార్ బయటికివచ్చి తన నివాసం నుంచి కావడి వేసుకువస్తాడు. ఇందులో 'నివేదనం' ఉంటుందంటారు అతను లోపలికి వెళ్ళగానే శంఖారావం మళ్లీ వినిపిస్తుంది. ఇద్దరు మధ్యవయస్కులయిన సింహళ స్త్రీలు ముందుకువచ్చి దీపాలు వెలిగించి నాట్యం చేస్తారు. పూజారి బయటికివచ్చి తెరవద్ద నుంచుని చేతులు ముందుకీ వెనకకీ ఆడిస్తాడు, వంచిన తలతో ఇదంతా పూర్తికాగానే భక్తులు తము తెచ్చిన కొబ్బరికాయలు, పళ్ళు సమర్పిస్తారు

కప్పురాళ్ళైయార్ రూపాయి తక్కువ దక్షిణ పుచ్చుకోడు.



వల్లి గుడి

కొంచెం ఆవతల ఉన్న వల్లి గుడిలో కూడా పూజారి సింహళీయుడే.

బ్రాహ్మణ పూజారులు వినాయక, దేవయాని, భైరవ, దండపాణి ఆలయాలలో కళ్యాణగిరి మఠంలో ఉంటారు. ఈ పూజారులు నోటిమీద తడిగుడ్డ కప్పుకుంటారు. ఇక్కడా గర్భగుడిముందు తెర ఉన్నప్పటికీ లోపల విగ్రహాలని చూడవచ్చు

కదిర్గ్రామం దగ్గరే సెల్ల కదిర్గ్రామం, కదిరీమల ఉన్నాయి. కదిరీమలలో ఈశ్వ ప్రతిష్ఠాపించారు, సెల్ల కదిర్గ్రామంలో మాణిక్య వినాయకర్‌ని పూజిస్తారు.

కదిర్గ్రామం వెళ్ళేవారు రామకృష్ణ మఠంలో ఉండవచ్చు. ఇక్కడ వసతి, భోజనం ఉచితంగా ఇస్తారు ఉత్సవదినాలలో రోజుకి 20 వేల మందికి అన్నదానం చేస్తారు! దానాలకోసం అడగరుకాని ఇస్తే కృతజ్ఞతతో పుచ్చుకుంటారు.

పిల్లలు కలగనివారు కొబ్బరి మొక్కలని దేవుడికి అర్పిస్తారు.

నేడు, ఈ గుడికి హైందవులకన్నా సింహళీయులే అధికంగా వస్తున్నారు

ఉత్సవదినాలలో నిప్పుమీద నడుస్తారు. గుడిలోపలి భరిణని ఒకదానిని ఏనుగుమీద ఊరేగిస్తారు ఇందులో ఏముందో ఎవరికీ తెలియదు.

సింహళభాషలో 'కదిర' అంటే నల్లటి చెక్క. 'గామ' అంటే అడవి ఇక్కడ నల్లటి చెక్కకల అడవి ఒకటి ఉండేదిట.

జన్మలన్నింటిలోకి మానవజన్మ ఉత్తమమైనదంటారు గదా, అంతఉత్తమ జన్మను పొంది ఎంతో నీచమైన పనులు చేస్తారెందుకు?

డి దుర్గాప్రసాద్, వల్లపాడు

**నీచమైన పనులుచేస్తే 'మానవ జన్మకాదు' 'మా' అనే అక్షరానికి బదులు 'దా' చేర్చి చదవండి.**

మీకు నచ్చిన ప్రశ్నకు మీరు బహుమతి యిస్తున్నారు కాబట్టి, నాకు నచ్చిన మీ జవాబుకు బహుమతి యివ్వమంటారా?

కె. లక్ష్మీశ్రీనివాస్, విశాఖ.




మనియార్డర్ అయితే ఆలశ్యం అవుతుంది. వెంటనే టి. ఎమ్. ఒ. వేయండి.

అమ్మాయిలు చుట్టూ అబ్బాయిలు తిరుగుతారు కాని, అబ్బాయిలు చుట్టూ అమ్మాయిలు కాని, తిరగరెందుకు?

కె నరసింగరావు, శ్రీకాకుళం

స్త్రీలకు నిగ్రహం జాస్తి. పురుషులకు ఉద్రేకం జాస్తి. అందుకే తట్టుకోలేక తొందరపడి వెంటపడతారు

హీరోలు విలన్స్‌గా ఎందుకు నటించకూడదు?

ఎం లక్ష్మాజీరావు, రాజమండ్రి

నటుడు ఏదైనా నటించగలడు. 'సీతారామ కళ్యాణం'లో రావణుడుగా రాణించలేదా మన హీరో ఎన్. టి. రామారావుగారు ఇదే నటుడు 'శ్రీకృష్ణ పాండవీయం'లో శ్రీకృష్ణ, దుర్యోధనులుగా ద్విపాత్రాభినయం చేసి మిమ్మల్ని మెప్పించలేదా?




నాకు మీ హాస్యం అంటే యిష్టం. మిమ్మల్ని చూడాలని వుంది. ఎలా వీలుపడుతుంది?

వి. మూర్తి, విజయవాడ

మెయిల్ టిక్కట్టు కొనుక్కొని బెజవాడ స్టేషన్‌లో ఎక్కి, నేరుగా సెంట్రల్‌దిగి, సరాసరి కోడంబాకంలో నాగార్జుననగర్ నెం: 93 రండి. పద్మనాభం వున్నాడా అని అడగండి 'వున్నాడు' అని నేనంటాను సరేనా?

మీరే స్త్రీ అయివుంటే ఏమయ్యేది?

వి. ప్రభాకర్, విజయనగర్ కాలనీ.

పద్మినిని అయి ఒక అయ్యచేతిలో పడి నలుగుతూ అలో లక్షణా అని ఏటా కాన్పులతో బాధపడుతూ వుండేదాన్ని.

మీ సినిమాల్లో హీరోల్లాగా కాలేజీలో అమ్మాయిల్ని ప్రేమించ లేకపోతున్నాం కారణం ఏమిటంటారు?

కె కుమార్, విశాఖపట్నం.

నాకు తెలియక అడుగుతానూ! 'అసలు మీరు కాలేజికి వెళ్లడం చదువుకోడానికా? లేక అమ్మాయిల వేటకా?'

దేశభాషల్లో తెలుగు లెస్స అని నాడు శ్రీకృష్ణదేవరాయలు అన్నారే— అలాంటి యీ భారత దేశంలో తెలుగుకు ప్రాధాన్యత ఇవ్వక పోవటానికి కారణం?

యాన్ ఎడ్విన్ థామస్, గుంటూరు.

అది కృష్ణదేవరాయల వారి పరిపాలన తండ్రీ! ప్రాధాన్యత ఈమాత్రమైనా యిస్తున్నందుకు మనం నీరసంగా పళ్లు యికిలించి తృప్తి పడవచ్చు.

తమ ఆశలు ఫలించినపుడు దేవుడు ఉన్నాడని— ఫలించనపుడు లేడనీ అంటారు మనుష్లు ఎందుకని?

పి వి సుబ్బారావు, కనిగిరి

సహజమే! సంతోషం కలిగినప్పుడు 'పకపక' నవ్వుతాడు. బాధ కలిగినప్పుడు 'అమ్మా, అబ్బా' అని ఏడుస్తాడు. ఇది దేవునిచే నిర్మించిన మట్టి బొమ్మ ఎలా ఆడిస్తే అలా ఆడుతుంది.

ఆంధ్రా ఇడ్లీకీ, అరవసాంబారుకి పొత్తు ఎలా కుదిరిందో చెబుతారా?

కె రంగారావు, విజయవాడ.

ఈ ప్రశ్న 'సావిత్రిజెమిని' గార్లను అడగండి.

సినిమాల్లో ఆపదలో ఉన్నప్పుడు దేవుణ్ణి తలచుకోగానే సమస్యలు విడిపోతాయి మేము ఎన్నిసార్లు తలచుకొన్నా ఆపదలు తీరవు, ఎందుకుకో?

జి. జగన్మోహన్‌రెడ్డి, నిజామాబాద్.




తొందరపడకండి! మీకు 'ఇన్‌కమ్ టాక్స్' బిల్లురాగానే తప్పకుండా దేవుడు కనిపిస్తాడు

సినిమావారికి జ్యోతిషం అంటే మోహెక్కువట నిజమేనా?

కె రాజేందర్, గుడివాడ.




పిచ్చి వున్నవారికి వుంది, లేనివారికి లేదు. చిన్న సందేహం ? మీరు జ్యోతిష్కులా ?

సినిమాల్లో కథనాయిక, కథానాయకుణ్ణి కాక కథానాయకుడి వెంటతిరిగే విదూషకుణ్ణి ఎందుకు ప్రేమించ కూడదు?

కె శ్రీరామమూర్తి, ఎత్తొండ.

విదూషకుణ్ణా !! కోతిని కోతి ప్రేమిస్తుంది కాని కోయిల ప్రేమించునా?

అమ్మాయిలు రెండు జడలు వేసుకున్నా పూలు మాత్రం ఒక జడకే పెట్టుకుంటారు. ఎందుకు?

కె. ఎస్. బాలసుబ్రహ్మణ్యం, మైసూరు— 4




కొందరికి ఆ రెండింటి సవరం అయి వుంటుంది. దానికెందుకు దండగని.

స్త్రీలను అతి సుకుమారమైన పుష్పాలతో పోలుస్తారు, ఎందుకు?

ఎ. రామమోహనరావు, మద్రాసు.

ఎవరన్నారు? కాయలతో పోల్చే స్త్రీలు కూడా వున్నారు. సినిమాల్లో సూర్యకాంతం అత్తలాంటి అత్తలు.

మీకు ఆ సినిజీవితం ఎందుకు, హాయిగా ఆశ్రమం చేరకుండాను?

జి. నర్మదరావు, టిట్లాఘర్.

కాషాయ వస్త్రాలు, కమండలం వగైరా పోష్టుద్వారా పంపండి. టైం వచ్చినప్పుడు తప్పకుండా ఆశ్రమంలో చేరి ఉత్తరం వ్రాస్తాను. వెంటనే మీరు బయలుదేరి వద్దురుగాని.

మీరు శ్రీకృష్ణుడంటే మేము ..?

యన్ అనంతయ్యసెట్టి, బెంగుళూరు

గోవులు కాదుకాదు, గోపికలు!

సృష్టిలో వస్తువు ముందు జన్మించినదా లేక దాని నామము ముందు జన్మించినదా?

యువ్ జనార్ధన్, సోమవార్‌పేట.

నేను పుట్టిన తరువాతనే నాకు 'పద్మనాభం' అని పేరు పెట్టారు. దీనిని బట్టి వూహిస్తే మీ ప్రశ్నకు సమాధానం యిదే అనుకుంటాను.

సినీ ప్రపంచానికి ప్రేక్షకులకు ఏదేనా సంబంధం వుంటే— అది ఎటువంటిది?

ప్రమీలారెడ్డి, నెల్లూరు.

మీరు కొనే టికెట్లు.

మీరు నిర్వహిస్తున్న 'ఎందుకు?' శీర్షికను చదువుతుంటే ఎందుకోగాని విపరీతంగా నవ్వువస్తూంటుంది, కారణం ఏమిటో కాస్త చెప్తారా?

ఎస్ పి కనకదుర్గ, బొంబాయి— 62.

తెరమీద వెర్రిగా కనిపించినా 'ఎందుకు'లో సమాధానాలు తెలివిగానే యిస్తున్నందుకు.

పద్మనాభం

## బహుమతిపొందిన ప్రశ్న

మానవుడిలోగల ఉత్తమగుణం ఏమిటి?

ఎం శివశంకర్, విశాఖపట్నం.




తోటిమానవుడు పోయిన తరువాత అతనిలోని మంచిని లేటుగా మెచ్చుకోవడమే!

చంద్రమండలానికి మొదటి మానవునిగా మిమ్మల్ని మనదేశం తరపున పంపిస్తామని మన ప్రభుత్వం ప్రకటిస్తే అపుడు మీకెలా వుంటుంది?

కేసువ, కర్నూలు.




చంద్రమండలానికి పంపడానికి చాలా మంది సైంటిస్టులు వున్నారు. నేను ఆర్టిస్టుని కనుక హాలీవుడ్‌కు పంపమనండి సంతోషంగా రెక్కలు కట్టుకెళ్ళి, మళ్లీ యిక్కడ వాటి అన్నీ కబుర్లు పూసగుచ్చినట్లు చెపుతాను.



బాగ్దాద్ నగరంలో అబూ కాసిమ్ పేరు విననివారెవరు? పెద్ద వ్యాపారి, గొప్ప లోభి. ఒకరోజు అబూకాసిమ్ చక్కటి గాజుసీసా తెప్పి అతి చవకగా కొనేశాడు. ఇది చాలక దివాలా తీసిన సుగంధ ద్రవ్య వ్యాపారి ఒకతని దగ్గర ఎంతో 'గులాబి అత్తర్' మరింత చవకగా కొనేశాడు కూడా ఈ రెండుబేరాలవల్లా అతనికి చాలా లాభం వచ్చిందని అన్ని బజార్లలోనూ అను కున్నారు.

ఇంత మంచిబేరం చేసినందుకు మరెవ రయినా అయితే దగ్గిర స్నేహితులతో చిన్నవిందో, పెద్దవిందో ఏదో ఒకటి చేస్తు కునేవారు అబూకాసిమ్ తరహాయే వేరు. ఎంతో ఆలోచించి బాగ్దాద్‌లోని 'బహిరంగ స్నాన ప్రదేశం' ఒకదానిలో మంచిస్నానం ఒకటి చేద్దామనుకున్నాడు

స్నానానికిముందు బట్టలు, చెప్పులు ఇవతల ఒక గదిలో పెట్టాలి అబూ కాసిమ్ ఆపని చేస్తూ ఉండగా తెలిసినతను ఒకతను వచ్చాడు. ఇవీ అవీ మాట్లాడుతూ ఆ స్నేహితుడు అబూకాసిమ్‌ని చివాట్లు వేశాడు

'మీవంటి గొప్ప వ్యాపారులకి ఈ పాత చెప్పు లేమిటి? ఎవరన్నా చూస్తే నవ్వి పోతారు! మీరు తలుచుకుంటే మంచి జత కాకదానిని కొనుక్కోలేరూ?' అన్నాడు

అబూకాసిమ్ తన చిరిగిపోయిన చెప్పుల వంక కొన్నిక్షణాలు చూశాడు. నిజంగానే అవి చాలా అసహ్యంగా ఉన్నాయి

'నిజమే ననుకోండి! నేనూ చాలా ఏళ్ల నుంచీ ఈ సంగతి గురించే ఆలోచిస్తున్నాను కానీ, అవంటే నాకెందుకో ఇష్టం! అదీగాక ఏమంత చిరిగిపోయాయని? ఇంకా కొన్ని రోజులదాకా రావూ?' అంటూ అబూకాసిమ్ స్నానాల గదిలోకి నడిచి వెళ్లాడు స్నేహితుడు అతన్ని అనుసరించాడు.

లోభి లోపల నీళ్లు పోసుకుంటూ ఉంటే బాగ్దాద్ నగరం కాజీ అక్కడికి వచ్చాడు. తన చెప్పులూ, వస్త్రాలూ బయట వదిలి లోపలికి పోయాడు ఈ పెద్దమనిషి స్నానం చేస్తూ ఉండగా అబూకాసిమ్ బయటికి వచ్చాడు బట్టలు వేసుకుని చెప్పులు తొడుక్కో పోయాడు ఆశ్చర్యం! తను ఇందాక చెప్పులు వదిలిన చోట చక్కటి కొత్త జత ఒకటి ఉంది! తనవేమయి పోయాయో అర్థం కాలేదు అతనికి కాని, వెంటనే, తన స్నేహితుడి ఉపన్యాసం గుర్తుకి వచ్చింది. అబూకాసిమ్ నవ్వుకున్నాడు. పాపం, ఆ స్నేహితుడు తన మీది అభిమానంతో కొత్త జత ఒకటి బహూకరించి ఉంటాడు అబూకాసిమ్ ఆ జతని తొడుక్కుని వెళ్లిపోయాడు.

కొంతసేపటి తర్వాత కాజీగారు బయ

టికి వచ్చారు. తన చెప్పుల జత కనిపించ లేదు సరికదా వాటి బదులు చిల్లులుపడి, విరిగిపోయి అసహ్యంగా ఉన్న మరొక చెప్పుల జత కనిపించింది

'ఎవరివీ దిక్కుమాలిన పాదరక్షలు!' అని అరిచాడు ఆయన అవి బాగ్దాద్ నగర మంతా పేరుమోసిన చెప్పులు పరమలోభి అబూకాసిమ్ వదలకుండా వాడిన చెప్పులు

మర్నాడు అబూకాసిమ్ న్యాయస్థానంలో హాజరుఅయి తన నేరం ఒప్పుకున్నాడు అతి కష్టంతో, పెద్ద జరిమానా ఇచ్చుకుని బయటపడ్డాడు వెళ్ళేముందు తన పాత చెప్పులజత తీసుకున్నాడు. అయితే, వీటి వల్లనేకదా తనకింత కష్టం కలిగింది! ఇంటికివెళ్ళి తల చేత్తోపట్టుకుని విచార పడుతున్న అబూకాసిమ్‌కి తన పాత చెప్పుల మీద పట్టరానికోపం వచ్చింది వాటిని కిటికీలోంచి బయటికి విసిరిపారేశాడు అవి కాస్త వెళ్ళి పక్కనేఉన్న టిగ్రిస్ నదిలో పడ్డాయి ఆ చప్పుడు అబూకాసిమ్‌కి స్పష్టంగా వినిపించింది

కొన్ని రోజులు గడిచాయి కొందరు జాలరివాళ్ళు టిగ్రిస్ నదిలో చేపలు పడుతున్నారు ఏదో బరువుగా తగిలింది పెద్ద చేప అనుకున్నారు తీరా బయటికి తీస్తే బురద కొట్టుకుపోయిన పాత చెప్పుల జత దానికితోడు ఆ చెప్పులకి కొట్టిన మేకులు జాలరివాళ్ల వలని కూడా పాడుచేశాయి. వాళ్లకి బాగా కోపం వచ్చింది వాటిని పట్టుకుని అవతలకి విసిరేశారు

అబూకాసిమ్ అప్పుడే తన గది కిటికీ తెరిచి, కిటికీ పక్కనే బల్లముందు కూర్చుని అంతకి ముందు కొన్న గాజుసీసాల నిండా గులాబి అత్తర్ నింపి, తన బేరాలు తలుచుకుని మురిసిపోతున్నాడు పాత చెప్పుల జత వచ్చి వాటిమీద పడింది గాజు సీసాలన్నీ విరిగిపోయాయి. గులాబీ అత్తర్ అంతా వలికి పోయింది మిలమిల మెరుస్తున్న గాజు ముక్కల మధ్య బురద కారుతూ కనిపించాయి తన పాత చెప్పులు.

అబూకాసిమ్ విచారాన్ని వర్ణించలేము. ఛీ! ఈ పాడు చెప్పులు నన్నింకా వదల్లేదే వీటిని ఎలాగయినా వదిలించుకుంటాను.' అని గొణుక్కుంటూ తన తోటలో ఒక మూలకి గొయ్యి తియ్యటం ప్రారంభించాడు! చెప్పులని గోతిలో పాతెయ్యాలని అతని ఉద్దేశం. కాని, పక్కింటి మనిషి ఆ సమయంలో అటు చూడటం జరిగింది.

'అబూకాసిమ్‌కి పనిమనుషులు లేరనా తనే గొయ్యి తీస్తున్నాడు! ఇందులో ఏదో రహస్యం ఉంది! నిధిని పాతేస్తున్నాడా ఏమిటి? అదే అయి ఉంటుంది!' అనుకున్నాడు అతను. అనుకోడమే తరవాయి కాలిఫ్ ప్రతినిధితో వెళ్ళి అబూకాసిమ్ ఏదో విలువగల వస్తువుని పాతేస్తున్నాడని చెప్పాడు ఇది అక్కడి చట్టానికి విరుద్ధం నిధి ఏదయినా దొరికితే దానిని ముందు కాలిఫ్‌కి ఇవ్వాలి ఏదయినా పాతేస్తే అది వెంటనే కాలిఫ్ సొత్తు అయిపోతుంది

అబూకాసిమ్ మళ్ళీ న్యాయస్థానానికి వెళ్ళాడు అతని కథని ఎవరూ నమ్మలేదు 'చెప్పులని పాతెయ్యటమేమిటి!' అని వేళాకోళం చేశారు పెద్ద జరిమానా ఇచ్చుకున్నాడు అబూకాసిమ్ జరిమానా మొత్తంలో 'నిధి విలువ' అంచనావేసి కలిపాడు విచారణ నడిపిన అధికారి

అబూకాసిమ్‌కి పిచ్చెక్కినట్లయింది తన పాత చెప్పులని తిట్టుకున్నాడు కాని, వాటిని వదిలించుకోవటం ఎలా? ఈ ఊళ్లో అవి తనని వదిలేట్లులేవు అందు చేత మర్నాడు ఊరి బయటికి వెళ్ళి అక్కడ కనిపించిన ఒక కొలనులో పడేశాడు అద్దంలాటి నీటిలోతుల్లో అవి మునిగిపోయి అదృశ్యం అవగానే ఒక పెద్ద ఊపిరి వదిలాడు 'పీడ విరగడయింది!' అనుకున్నాడు పాపం, అతనికేమి తెలుసు, ఆ కొలను ఊరి నీటి వసతికి సంబంధించినదని? చెప్పులు మునిగి వెళ్ళి గింద గొట్టం ద్వారంలో ఇరుక్కున్నాయి. ఊరికి నీరు రావటం ఆగిపోయింది! తనిఖీ చేసిన 'నీటి వసతి' అధికారులు చెప్పుల జతని బయటికి తీశారు. అబూకాసిమ్ మరొక పెద్ద జరిమానా చెల్లించుకున్నాడు.

అతని బాధ, దుఃఖం ఇంతా, అంతా కాదు. ఈ చెప్పులు తన నింక వదలవని వాపోయాడు. చివరికి వాటిని తగలబెట్టటమే మంచిదనుకుని ఇంటి డాబా అంచు దగ్గిర ఎండబెట్టాడు దూరం నుంచి దీనిని చూసిన కుక్క ఒకటి వాటికోసం పయికి వెళ్ళింది ఒక చెప్పు ఎత్తుకుని పారిపోతూ జార విడిచింది అది కాస్త కింద వీధిలో నడిచి వెడుతున్న ఒక వనిత నెత్తిమీద పడింది ఆమె బెదిరి జారి కింద పడింది పాపం నిండు చూలాలేమో గర్భం పోయింది ఆమె భర్త అబూకాసిమ్‌ని న్యాయస్థానానికి ఈడ్చాడు 'అతను పరిహారం చెల్లించుకున్న తర్వాత న్యాయమూర్తిని ఒక కోరిక కోరాడు, 'మళ్లీ ఈ చెప్పుల జతకీ తనకీ సంబంధం లేకుండా చూడ'మని.

[చెప్పుల జతని వదిలించుకున్న తర్వాత అబూకాసిమ్ విదేశాలకి వెళ్లిపోయి అక్కడ కాజీ అయ్యాడని చెప్పుకుంటారు. పాత చెప్పులని సకాలంలో మార్చకపోతే ప్రమాదాలేమిటో అబూకాసిమ్ బాగా తెలుసుకున్నాడు] ●





"పైరవేటు మాస్టారు" లో కాంచన, రామ్మోహన్.

# మన చిత్రాలలో హాస్యం

మన సినిమాలలో హాస్యం రాను రాను ఎబ్బెట్టుగా వుంటున్నదని కొందరూ, అది వరకటి కన్న యిప్పుడే బాగుంటున్నదని మరి కొందరూ అంటున్నారు 'ఇలా వుంటే యిది హాస్యం' అని ఎవరూ యిదమిద్ధంగా చెప్పలేరు సినిమాకి కథను ఎన్నుకునేప్పుడు ఆ కథలోనే హాస్య సన్నివేశాలు కలిసి వుంటే— ఎక్కువ రక్తి కట్టేందుకు అవకాశం వుంటుంది ప్రసిద్ధ దర్శక నిర్మాత శ్రీ బి. యన్. రెడ్డి యీ విషయంతో ఏకీభవిస్తూ యిలా అంటారు:

'హాస్యం అనేది కథలో కలిసి వుంటేనే రాణిస్తుంది కావాలని ప్రత్యేకంగా జొప్పిస్తే అది రసాభాస అవుతుంది నేను నిర్మించే చిత్రాలలో హాస్యం కూడా కథలో కలిసి వుండేట్టు చూస్తాను నా చిత్రాలన్నిటిలోనూ కావాలని హాస్యం ఎక్కడా ప్రవేశ పెట్టలేదు అది యిమిడి వుండే పాత్రలనే పరిచయం చేస్తాను అలాంటి కథ దొరకటానికి ఎక్కువ టైము పడుతుంది'

దర్శక నిర్మాత బి. ఏ. సుబ్బారావు మాట్లాడుతూ 'మన చిత్రాలలో హాస్యం పూర్వపు రోజుల్లో కొంత మొరటుగా వుండేదనీ, యిప్పుడు రాను రాను సున్నితమైనదనీ' అన్నారు. 'నేను తీసిన 'పల్లెటూరి పిల్ల', 'రాజు పేద' మొదలయిన చిత్రాలను తీసుకోండి. వాటిలో ఎక్కడా కావాలని ప్రవేశపెట్టిన సన్నివేశాలు, పాత్రలు కనిపించవు. సృజనాత్మకమైన హాస్యం ఆయా పాత్రల్లో ద్యోతకం అవుతుంది. అందువల్ల ప్రేక్షకులు దానిలో లీనమై రసానుభూతిని పొందుతారు.' అన్నారాయన మళ్లీ.

నిజానికి వీరు చెప్పిన పలుకుల్లో ఎంతో



'స్త్రీజన్మ' లో ఎల్ విజయలక్ష్మి

సత్యం ఉన్నది హాస్యం కథలో ఒక భాగంగా ఉన్న పాత్రల్లో చొప్పించబడి వుంటేనే రాణిస్తుంది ఒక చిత్రానికి ఒక కథను ఎన్నుకుని—హాస్యం కోసం మరొక భాషా చిత్రాన్ని కొనుక్కుని, ఆ హాస్యాన్ని యిందులో జోడిస్తే ఇదొక ట్రాకూ, అదొక ట్రాకూ అయి అభాసుగా పరిణమిస్తుంది పాత్రల కోసం హాస్యం కాక, కథా గమనంలో ఒక భాగంగా హాస్యం ఉన్నట్లయితే మన చిత్రాలు ఎంతో అభివృద్ధిని సాధించడానికి యింకా అవకాశాలు కనిపిస్తాయి

—మోహన్ కుమార్



మహారాష్ట్ర రాష్ట్ర మహిళాసంఘాధ్యక్షురాలు శ్రీమతి శ్యామాజెట్లే ఆమె సహాధ్యాయులు శ్రీమతులు పద్మావతి ఆర్ జి సరైయా, శివేరే హరిదియా కుమారి హిల్డా దాదినాలు కాల్గేట్ బేబీ సోడర్ ఫొటోగ్రాఫిక్ పోటీ ఎంట్రీలను శ్రీయుతులు హెచ్ రాయ్ పి కపూర్ లనుంచి అందుకొంటున్న దృశ్యం

# చిత్రలహరి



శ్రీ విజయకృష్ణ మూవీస్ చిత్రం 'సుఖదుఃఖాలు'లో హరనాథ్, వాణిశ్రీ.

## మద్రాసు రంగానికి శ్రీ తారాచంద్

ప్రముఖ డిస్ట్రిబ్యూటర్ శ్రీ తారాచంద్ బార్జాత్యా మద్రాసురంగానికి వచ్చారు ఆయన బొంబాయిలో తయారయ్యే అనేక హిందీ చిత్రాలకు పంపిణీదారుడే గాక పెట్టుబడిదారుడు కూడా. ఇపుడు మద్రాసుకు వచ్చి తెలుగు తమిళ భాషల్లో కూడా శరపరంపరగా చిత్రాలు నిర్మించి ఇక్కడి పరిశ్రమనూ విస్తృత పరచాలనే సంకల్పం వుంది ఆయనకి. ప్రస్తుతం 'తక్‌దీర్' చిత్రం ఏడు భాషల్లో తయారుచేస్తూ — బెంగాలీభాషలో విడుదలై విజయవంతంగా నడచిన 'జీవన్మృత్యు' చిత్రాన్ని తెలుగు తమిళ హిందీ భాషల్లో నిర్మించేందుకు అన్ని యేర్పాట్లూ పూర్తి చేస్తున్నారు ఈస్ట్‌మన్‌కలర్‌లో నిర్మించబడే యీ తెలుగు చిత్రంలో శ్రీ యన్. టి. రామారావు ముఖ్యభూమిక పోషించేందుకు ఒప్పందం జరిగింది డి వి నరసరాజు రచయిత తెలుగువాడై వుండీ తమిళరంగంలో దర్శకుడిగా పేరు ప్రఖ్యాతులు గడించుకున్న శ్రీ ఏ భీమ్‌సింగ్ తెలుగు తమిళ ప్రతులు రెండింటికీ దర్శకత్వం వహిస్తారు.

* * *

ఇదిగాక—హిందీలో వచ్చిన 'అనుపమ' చిత్రాన్ని కూడా తెలుగు, తమిళ భాషల్లో తీయాలని అనుకుంటున్నారు శ్రీ తారాచంద్ తెలుగు చిత్రంతో నటించేందుకు ఓ ప్రముఖ నటుణ్ణి తారాచంద్ అడిగారనీ— అందుకా నటుడు యింకా తన సమ్మతిని తెలియజేయనట్లు తెలుస్తున్నది. ఈ చిత్రానికి హృషీకేష్ ముఖర్జీ దర్శకుడు హిందీ చిత్రానికీ ఈయనే దర్శకత్వం వహించారు



'మరపురాని కథ'లో వాణిశ్రీ, సంధ్యారాణి

## అనర్థాలన్నిటికీ ఆడదే కారణమా ?

యస్ వి రంగారావు సోఫాలో కూచుని పేపరు చదువుకుంటున్నారు ఎదురుగా వచ్చి ముగ్గురు కోడళ్లూ దీర్ఘాలు తీయసాగారు 'అబ్బబ్బా! ఇంతలోకే ఏం ముంచుకుపోయిందని యీ ఏడుపు?' అన్నారాయన చిరాగ్గా, పేపరు మడచి పక్కన పెడుతూ వాళ్లు మాట్లాడకుండా మళ్లీ మొదలెట్టారు 'ఇదుగో యీ ఆకాశరామన్న ఉత్తరాల మీద నాకు నమ్మకంలేదు భూమిమీద జరిగే వాటిని రాయనివాడు గనుకే వాణ్ణి ఆకాశరామన్న అన్నారు అసలు యీ ప్రపంచంలో జరిగే అనర్థాలన్నిటికీ ఆడదే కారణం కానా?' అడిగారాయన వాళ్ల వంక చూస్తూ 'కాను!' అంది పెద్దకోడలు 'ఒప్పుకుంటున్నాం' అన్నారు మిగిలిన యిద్దరూ 'మగవాణ్ణి దేవుడిగా మార్చేది స్త్రీ, రాక్షసుడిగా మార్చేదీ స్త్రీయే అందుకని' అంటూ ఆగిపోయారు, రంగారావు 'కట్' అన్నారు దర్శకుడు కె బాలచందర్ తమిళ 'భామావిజయం' ఆధారంగా జెమినీవారు తెలుగులో నిర్మిస్తున్న చిత్రానికి సంబంధించినది యీ దృశ్యం ఇందులో మామగారుగా రంగారావు — ఆయన ముగ్గురు కోడళ్లుగా జానకి, కాంచన, జయంతి— వీరి భర్తలుగా నాగభూషణం, రామకృష్ణ, చలం నటిస్తున్నారు ఈ చిత్రానికో విశిష్టత ఉంది సినిమా ఆకర్షణ ఎటువంటిది ? సినిమా తారల ప్రభావం సామాన్య స్త్రీల మీద ఎలాటి ముద్రవేసుకుంటుంది ? అంతస్థుకు మించిన ఆలోచనలు చేస్తే ఎలాటి అనర్థాలను ఎదుర్కోవలసి వచ్చేదీ ఈ చిత్రం వ్యంగ్యం ధోరణిలో చెబుతుంది పైన పేర్కొన్నవారూ ప్లస్ ఓ సినిమాతార (రాజశ్రీ) ఆమె సెక్రటరీ (శ్రీకాంత్), అతని ప్రియురాలు (సచ్చు) యిందులో ముఖ్యపాత్రధారులు — సంభాషణలు భమిడిపాటి రాధాకృష్ణ ఈ చిత్రంలో గల అయిదు పాటల్నీ డా సి నారాయణరెడ్డి రాశారు, సంగీతం ఎం ఎస్ విశ్వనాథం,

కెమెరా: వెల్స్వ, దర్శకత్వం కె బాల చందర్ నిర్వహిస్తున్నారు అసోసియేట్: ఓరంకిశర్మ సగానికి పైగా తయారయింది

* * *

ఇంతవరకూ హాస్యనటుడిగా మీరెరిగిన శ్రీ పేకేటి శివరామ్ యిప్పుడు దర్శకుడు అయినారు శ్రీ భగవతీ ప్రొడక్షన్స్‌వారి 'చక్రతీర్థ' కన్నడ చిత్రానికి ఆయన తొలి సారిగా దర్శకత్వం వహిస్తున్నారు ఈ చిత్రానికి ఆగస్టు 18 ఉదయం 9–30కి మైసూరులోని ప్రమియర్ స్టూడియోస్‌లో



'మూగజీవులు' లో సెరా ప్రెట్
(టి వి స్టార్ స్వీడన్)

ప్రారంభం జరిగింది మైసూరు ప్రభుత్వ ఆర్థికమంత్రి శ్రీ రామకృష్ణ హెగ్డె కెమెరా స్విచ్ ఆన్ చేయగా— బొంబాయి దర్శకుడు శ్రీ సత్యేన్ క్లాప్ కొట్టారు జయంతి, రాజ్‌కుమార్ ముఖ్య పాత్రధారులు

* * *

సంగీత దర్శకుడు శ్రీ పి యస్ విత్యానంద్ వివాహం ఆగస్టు 23వ తేదీ ఉదయం గం 11–45కి తిరుమల కొండమీద శ్రీ వెంకటేశ్వర స్వామి సన్నిధిని జరిగింది వధువు—చి సౌ రాజరాజేశ్వరి

* * *



'స్త్రీజన్మ' లో ఎల్ విజయలక్ష్మి కృష్ణ

సినీ నటుడు శ్రీ జగ్గయ్య లోకసభ పురప్రముఖులు కొందరు సభ్యులుగా ఏర్పడి సభ్యునిగా ఎన్నికయినందుకుగాను—గుంటూరు శ్రీ జగ్గయ్యను సన్మానించారు ఈ సన్మాన

## సినిమా డైరీ

● ఒక బొంబాయి చిత్ర నిర్మాత తన చిత్రంలో నాయికగా నటిస్తున్న బబీటాను— చాలా సెక్సీగా చూపించి డబ్బు చేసుకోవాలనుకుని ఆమెను మినిస్కర్ట్ వేసుకోమని కోరాడు కాని ఆయన ప్రయత్నం నెరవేరలేదు 'మినిస్కర్ట్' వేసుకుందుకు బబీటా నిరాకరించింది

● ఈనాడు ఎంతో ప్రజాదరణ పొందుతున్న సంగీతదర్శక ద్వయం లక్ష్మీకాంత్— ప్యారే లాల్‌లు ఒకప్పుడు లతామంగేష్కర్ సోదరుడు హృదయనాథ్ ఆర్కెస్ట్రాలో పనిచేసే వారు అప్పుడు ప్యారేలాల్ వయొలిన్ లక్ష్మీకాంత్ మాండొలిన్ వాయించేవారని— లతా మంగేష్కర్ ఒక విలేఖరితో చెప్పారు

● దర్శకనిర్మాత శ్రీధర్ ప్రస్తుతం మద్రాసులో హిందీ తమిళ భాషల్లో నిర్మిస్తున్న చిత్రంలోకి చాలా ఖరీదైన సెట్ ఒకటి వేశారనుధ్య దానికి లక్ష రూపాయలు వ్యయం అయిందిట'

● ఎల్లరిపెంపకం తన అభిమాన విషయమనీ జవహర్‌లాల్ నెహ్రూ తన అభిమాన చారిత్రక పురుషుడనీ ఎర్గిస్ యు టీ ఒక ఇంటర్వ్యూలో వెల్లడించారు

● 'భారతదేశాన్ని నా చిత్రాలకు కథావస్తువుగా ఎన్నుకుంటాను భారతీయ జీవనాన్ని నా చిత్రాలలో చూపిస్తాను' అన్నారు ప్రఖ్యాత దర్శకుడు సత్యేన్ బోస్ ఆయన దర్శకత్వం వహించిన 'దోస్తీ' 'మేరేలాల్', ఆన్‌రా' చిత్రాలు అఖండ విజయాన్ని సాధించినవి

● ఆశాపరేఖ్ 'అనార్కలి' కొత్త నృత్యనాటికను తయారు చేస్తున్నది ఆమె యింతకు ముందు ప్రదర్శిస్తూ వచ్చిన 'చౌలాదేవి' నృత్య నాటిక బహుళ ప్రజాదారణ పొందింది

● మద్రాసులో తను స్థాపించిన 'నాట్యాలయ' వలెనే బొంబాయిలోకూడ ఒక డాన్స్ అకాడమీని స్థాపించబోతున్నది వై జయంతిమాల 'అసలు వినాయక చతుర్థికే ప్రారంభించ వలె వుందికాని, కొంత టైము పట్టేటట్లుంది' అన్నదామె

● లలితాశివ జ్యోతివారి "లవ కుశ" చిత్రం పారిస్‌లో ప్రదర్శనకు పంపబడుతున్నది

సభ ఆగస్టు 17వ తేదీ సాయంకాలం గం 5—30కి గుంటూరు మునిసిపల్ గాంధీ పార్కు (స్వరాజ్ మైదాన్)లో జరిగింది సభకు వ్యవసాయ మంత్రి శ్రీ పి తిమ్మా రెడ్డి అధ్యక్షత వహించారు

* * *

రత్నగంధి, యోజనగంధిలను వివాహ మాడిన వ్యక్తితో తన చావు రాసిపెట్టి వున్న దని తెలుసుకున్న భీమాసురుడు ఆ గహం చెందటం—గంధర్వలోకంలోని తోటలో ఆడు కొంటున్న వాళ్లిద్దరిలోనూ పెద్దదైన రత్న



'నవయువతి'లో జయలలిత.

గంధి(రాజశ్రీ)ని భీమాసురుడు (జగ్గారావు) ఎత్తుకుపోవటం—అది చూసి యోజనగంధి (వాణిశ్రీ) కెవ్వున కేకవేసి పడిపోయే దృశ్యా లను, అనంత లక్ష్మీ ప్రొడక్షన్స్‌వారి 'కాంభోజరాజుకథ'కు గాను యిటీవల దర్శ కుడు కమలాకర కామేశ్వరరావు తీశారు. గుమ్మడి, అంజలీదేవి, యల్. విజయలక్ష్మి, శోభన్‌బాబు, రాజ్‌బాబు, చలం, రమణా రెడ్డి, బాలకృష్ణ, సూర్యకాంతం, సూర్యకళ యితర ముఖ్యపాత్రలు ధరిస్తున్నారు. సంభా షణలు: ఏ. పిచ్చేశ్వరరావు, పాటలు: కొస రాజు, సి. నారాయణరెడ్డి, సంగీతం, టి



'పెద్దఅక్కయ్య'లో వాణిశ్రీ

# చిత్రలహరి

వి రాజు, కళ రాజేంద్రకుమార్, కెమెరా: యస్ వెంకటరత్నం, నిర్వహణ పెంచు రామయ్య, నిర్మాతలు డి భాస్కరరావు, కొసరాజు భానుప్రసాద్ యింతవరకూ 15 రీళ్లు తయారయింది సెప్టెంబరుకి పూర్తి అవుతుందని నిర్మాతలు చెప్పారు.

**ఉమర్ ఖయ్యాం సాకి**

శ్రీదేవీ కంబైన్స్‌వారు నిర్మిస్తున్న 'పెద్ద అక్కయ్య' చిత్రంలో 'ఉమర్ ఖయ్యాం' నృత్య నాటికను ప్రవేశపెట్టారు ఉమర్ ఖయ్యాం—హరనాథ్, సాకీ—జ్యోతిలక్ష్మి. దాశరథి రాసిన 'విరజాజిసేను వలపుల రోజా—నినుకోరేను చల్లని రాజా' గీతాన్ని —సంగీత దర్శకుడు ఘంటసాల ఘజల్ ఫైవులో ట్యూన్‌చేశారు సుశీల పాడింది. నృత్యాన్ని హీరాలాల్ ఎంతో కళాత్మకంగా కంపోజ్ చేశారు ఈ నృత్య నాటిక యీ చిత్రంలో ఒక విశేషాంశం అవుతుందని చూసినవారు అభిప్రాయపడుతున్నారు కృష్ణ కుమారి, చంద్రమోహన్, వాణిశ్రీ, విజయ లలిత, గుమ్మడి, కాకరాల, కె వి చలం, జి వరలక్ష్మి యితర ముఖ్య భూమికలు పోషిస్తున్న యీ చిత్రం యింతవరకు పది రీళ్లు తయారయింది దర్శకుడు: వి పి సుబ్బారావు, కెమెరా యస్ యస్ లాల్, నిర్మాత తోట సుబ్బారావు

**మూడుహారాల కథ**

రామారావు దగ్గర హారం కొట్టెయ్యాలని జయలలిత, జయలలిత దగ్గరున్న హారం కాజే య్యాలని కాంతారావు, కాంతారావు హారాన్ని తస్కరించాలని సత్యన్నారాయణ అవస్థలు పడే దృశ్యాలను యిటీవల 'చిక్కడు దొరకడు' చిత్రానికిగాను దర్శకుడు విఠలా చార్య చిత్రీకరించారు ఈ మూడు హారాలకీ ఒకదానికొకటి సంబంధం వుంది ఈ మూడు ఎవరి దగ్గరుంటే వారు ఏం చేస్తారు, ఏమవుతారన్నది—వెండి తెరమీద చూడాల్సిందే అన్నారు విఠలాచార్య యన్ టి రామారావు చిక్కడుగాను, కాంతారావు దొరకడుగాను — కృష్ణకుమారి పాంచాల పురం యువరాణి పద్మావతిగాను నటి స్తున్నారు

**మరొక షెడ్యూలులో పని**

చిత్ర నిర్మాణం పూర్తికావచ్చిందనీ, మరొక షెడ్యూలులో మాత్రం పని మిగిలి



గొప్పవారిగోత్రాలు లో అంజిబాబు

వున్నదని విఠలాచార్య చెప్పారు శ్రీ విఠల్ కంబైన్స్ పేరిట ఆయన నిర్మిస్తున్న 'అగ్గి దొర' చిత్రం పూర్తి అయిందని కూడా అన్నారు

*   *   *

'డుం డుం డుం గంగిరెద్దు దాన రొచ్చాడు– డూ డూ డూ బసవన్న మా తోలు కొచ్చాడు' అనే పాటను ఎ వి యం వారి ఈస్ట్‌మన్ కలర్ చిత్రం 'అవేకళ్ళు'కి కిందటి వారం చిత్రీకరించారు—దర్శకుడు ఏ సి త్రిలోక్‌చందర్ సుశీల బృందం



'మరపురానికథ లో కాంచన

పాడిన యీ పాట చిత్రీకరణలో నాయిక కాంచన, ఆమె చెలులు విజయశ్రీ, సాధన, రేణుక, లక్ష్మి పాల్గొన్నారు కృష్ణ, రాజనాల, గుమ్మడి, పద్మనాభం, గీతాంజలి, నాగభూషణం, రామదాసు, రమణారెడ్డి సురేంద్రనాథ్, ఆనందమోహన్, కనకం యితర నటీనటులు రచన డి వి నరస రాజు పై పాటను కొసరాజు రాశారు సంగీత దర్శకుడు వేదా సెప్టెంబరు మొదటి వారానికి నిర్మాణం పూర్తి అవుతుంది

—మోహన్‌కుమార్ ●

ఆనవసరం అని తోచి, ఈ ఐదు రకాల నాణెములు సరిసమాన సంఖ్యలలో ఉండేలా 6సంచులలో సర్దేడు ఉహూ౹ సంతృప్తి కలుగలేదు మళ్ళీ వాటినన్నింటినీ కింద పోసి, ఆ నాణెములు సరిసమాన సంఖ్యలలో ఉండేలా 5 సంచులలో పోసి మూతులు కట్టి, ఒళ్ళో పెట్టుకుని 'వంద రూపాయలు ఎప్పటికి పూర్తి అవుతాయో అని ఊహాలోకంలో విహరించసాగేడు

ఇంతకీ వందరూపాయలు పూర్తి కావాలంటే ఇంకా ఎంత డబ్బు సమకూడలో మీకేమైనా తెలిసిందా?

### జ వా బు లు

(క) ఫిల్లి ఈ క్రింది క్రమంలో ఎలుకలను పట్టాలి

1—8—3—4—11—6—7—2—9—10—5—12

* * *

(చ) సరిసమానమైన చదరాలు మూడు, 'లుగు తయారుచేసే పద్ధతులు ఇక్కడి



## మెదడుకి మేత

(29 వ పేజీ తరువాయి)



బొమ్మలో చూపించాను

(ట) 16 సరి వరుసలు ఏర్పడేటట్లు ఈ కింది విధంగా అమర్చవచ్చు



(త) ఆ ముష్టివాడి దగ్గర 10,5 3, 2,1 పైసల నాణెములు సమాన సంఖ్యలో వున్నాయి. వాటిని 7, 6,5 సంచులలో సమానంగా సర్ద గలిగేడంటే ఆ సంఖ్యలో 7,6,5లు నిశ్శేషంగా పోతాయని తెలుస్తోంది అటువంటి సంఖ్యలలో అన్నింటికన్న చిన్నది 210 దాని తరువాత 420 లోనూ, 630 లోనూ, 840 లోనూ 7 6,5లు నిశ్శేషంగా పోతాయి వీటిలో అసలు సంఖ్య ఏదో వెతికి పట్టుకోవాలి

ఒక్కొక్క రకం 210 నాణెములున్నాయనుకుందాం వీటి మొత్తం రూ 44 10 పైకి సమానం అవుతుంది ఒక్కొక్క రకం 420 నాణెములుంటే మొత్తం రూ 88 20 పైకి సమానం అవుతుంది ఒక్కొక్క రకం 630 ఉంటే రూ 132 30 పైకి సమానం

వందరూపాయలు ఎప్పటికి పూర్తి అవుతాయో కదా అని కలలు కంటున్నాడంటే అతని దగ్గర నున్న మొత్తం రూ 88 20 పైకి సమానం అయి ఉండాలి ఇంకా రూ 11 80 పై సమకూడితే వంద రూపాయలు పూర్తి అవుతాయి ●

## ...గణేశ్ చతుర్థి

(11 వ పేజీ తరువాయి)

రంలో గణేశ్ చతుర్థి గురించి కలలు కంటూవుంటారు భక్తులు

మహారాష్ట్రుల్లో వీరరసం ఎక్కువని అందరికీ తెలుసు, వారిలో శైవారాధకుల కంటె శివాజీ ఆరాధకులే ఎక్కువ పండుగ పబ్బాలు వచ్చినప్పుడు శివుణ్ని ఎంతగా కొలుస్తారో, శివాజీని అంతగానూ తలుస్తారు.

మహారాష్ట్రుల్లో సంఘీభావాన్ని పెంపొందించడానికి, పూర్వం జాతీయాందోళనలో ఉత్సాహంగా పాల్గొనజేయడానికి, వారిలో చైతన్యాన్ని రప్పించడానికి బాలగంగాధర తిలక్ గణేశ్ చతుర్థికి ఇంతటి ప్రత్యేకతను సృష్టించారు

అదే ఆవేశాన్ని మహారాష్ట్రులు 'శివసేన' వైపు మళ్లించుకొని శివాజీ పేరుకే మచ్చ తేవడానికి ప్రయత్నిస్తున్నారూ అంటే అది మన దురదృష్టం!

—సికరాజు. ●



Edited, Printed and Published by S Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

Regd No 4479 ANDHRA SACHITRA VARA PATRIKA







